


# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి: 35 సంచిక : 3 మార్చి - ఏప్రిల్ 2012

వెల : రు 20/- (291) పేజీలు : 68

## విరగ్గాస్తున్న వెన్నెలను వెంబడిస్తోంది రాజ్యం...
## ఆత్మవిశ్వాసంతో తిరగబడుతోంది అరణ్యం .





KLVA101M159






291 సంపుటి : 35 ◈ సంచిక : 3 ◈ మార్చ్ - ఏప్రిల్, 2012


సంపాదకుడు
**చలసాని ప్రసాద్**

◆ ◆ ◆

వర్కింగ్ ఎడిటర్
**డి.వి. రామకృష్ణారావు**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500040
*** కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా**
రచనలు పై చిరునామాకూ,
* ఇ-మెయిల్ ద్వారా
arunatara1977@gmail.com
కూ రచనలు పంపవచ్చు

◆ ◆ ◆

సంపాదకవర్గం :
**ఉజ్వల్**
**బాసిత్**
**కూర్మనాథ్**

◆ ◆ ◆

చందాలు పంపాల్సిన చిరునామ
మేనేజర్
**ఎస్. రవికుమార్**
5-1307, దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360
సెల్ : 9866021257

◆ ◆ ◆

విరసం కార్యదర్శి చిరునామా
**పి. వరలక్ష్మి**
5-1802, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360

**ఈ సంచిక వెల : రు. 20/-**


# సంపాదక లేఖ...

రోజురోజుకు ఈ 'ప్రజాస్వామ్య వ్యవస్థ'పైన ప్రజలు నమ్మకం కోల్పోతుంటే పాలకులు కొత్తకొత్త పద్ధతుల్లో నమ్మకాన్ని కూడగట్టుకునే ప్రయత్నం చేస్తున్నారు. అన్ని వ్యవస్థలూ అవినీతిలో పోటీ పడుతున్నాయి. ఇప్పుడు దేశ వ్యాప్తంగా ఒక పెద్ద నాటకం కొనసాగుతోంది. నిన్న ప్రాజెక్టుల పేరిట కేటాయించిన భూములు, నీళ్లు, విద్యుత్తు, వనరులు ఇవాళ్టి కుంభకోణాలుగా తేలిపోతున్నాయి. ఇవాళ్టి కేటాయింపులు, 'అభివృద్ధి' పథకాలు రేపటి కుంభకోణాలుగా తేలనున్నాయి. ఎంఎల్‌ఎలు, ఎంపిలు, ఐఎఎస్‌లు, ఐపిఎస్‌లు, న్యాయమూర్తులు, పారిశ్రామిక వేత్తలు ఇలా అందరికీ జైలు ఇప్పుడు తాత్కాలిక విడిది గృహంగా మారింది. అవినీతి కుంభకోణాల కేసుల్లో ఇవాళ అరెస్ట్, రేపు విడుదలల దొంగాట నడుస్తోంది. ఈ 'కష్టాన్ని' కాస్త ఎదుర్కొని బయటకు వచ్చి మళ్ళీ తమ తమ సామ్రాజ్యాలను ఏలుకోవచ్చు. శాసన, పాలనా వ్యవస్థలు ఒకదానితో ఒకటి అవినీతిలో పోటీ పడుతుంటే న్యాయ, పత్రికా వ్యవస్థలు వాటికి తాళాలు కొడుతున్నాయి. రక్షక దళాలు వేసుకొనే బూట్ల కొనుగోలు నుంచి శవ పేటికలదాకా, యుద్ధ విమానాల నుంచి యుద్ధ ట్యాంకర్లదాకా, గుండు సూది నుంచి గుండెకు వాడే మందులదాకా అన్నిటా అవినీతి విలయతాండవం చేస్తోంది. ఈ అవినీతి భారాన్ని ప్రభుత్వాలు జనంపై వేస్తున్నాయి. నిన్నటి బోఫోర్స్ నుంచి నేటి బొగ్గుదాకా లక్షల కోట్ల రూపాయల కుంభకోణాలు జరిగిపోతున్నాయి. రోడ్లు, బిల్డింగ్‌లు, డ్యామ్‌లు, ఫ్లై ఓవర్‌లు, గనులు, పరిశ్రమలు, టెలికమ్యూనికేషన్స్, అంతరిక్ష పరిశోధనలు ఒకటేమిటి నేల నుండి నింగిదాకా ఎందెందు చూసినా అవినీతే. ఈ దేశ ఖనిజాలతో సహా సమస్త వనరులనూ మూడో కంట కనబడకుండా వాయువేగంతో తరలించుకుపోయే ఆరులేన్ల రహదారులు వచ్చాయి. బియ్యం కార్డు, సారా ప్యాకెట్‌లను జనం చేతిలో పెట్టి, కంటికి టి.వి. తెరలు కట్టి మనిషి రక్తం పీల్చే కొత్త పద్ధతులు వచ్చాయి. మరోపక్క ఈ వాస్తవాలను ప్రజలకు తెలియజేస్తూ, సమాజనిలో మౌలిక మార్పు కోసం వేలాది మంది తమ రక్తం ధారపోస్తున్నారు. ఆ పోరాటాల, త్యాగాల చరిత్ర ఇప్పుడు దేశం నలుమూలలకూ విస్తరించింది. నిజాయితీపరులను, ఉద్యమకారులను రాజ్యం అక్రమకేసుల్లో ఇరికించి ఏళ్ళతరబడి జైళ్లలో నిర్బంధిస్తోంది. బూటకపు ఎన్‌కౌంటర్లలో చంపేస్తోంది. నిన్నటి వేయి పడగల హైందవ నాగరాజు నేడు శతకోటి పడగల హైందవ, భూస్వామ్య, దళారీ, బూర్జువా, సామ్రాజ్యవాద నాగరాజుగా బుసలు కొడుతోంది. అయినా రాజ్యం 'సబ్ ఠీక్ హై-ఖామోష్' అంటూ గావుకేక పెడుతోంది.

ఈ నేపథ్యంలో విప్లవ రచయితల సంఘం మార్చ్ 10, 11 తేదీలలో తన 23వ రాష్ట్ర మహాసభలను కర్నూలులో జరుపుకుంది. నక్సల్బరీ శ్రీకాకుళాలను, జగిత్యాల జైత్రయాత్రలను, తెలుగునేల ఆరాట, పోరాటాలను, సాహిత్య, సాంస్కృతిక రంగంలో ఎత్తిపట్టిన విరసం నేడు ఆపరేషన్ గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా సాహిత్య సృష్టి చేయడానికి దిశానిర్దేశం చేసుకుంది. ఈ సభల నుంచి వచ్చే సభలదాకా గ్రీన్‌హంట్ వ్యతిరేక ఆందోళనను సంస్థ తన సాహిత్య, రాజకీయ కేంద్ర కర్తవ్యంగా స్వీకరించింది. ఇదే కాలంలో విప్లవోద్యమం కా. షంషేర్, కా. సింగన్న వంటి అమూల్యమైన నాయకులనూ, కార్యకర్తలనూ కోల్పోయింది. కా. షంషేర్ (గుండేటి శంకర్) ఒకచేత గన్నూ, మరోచేత పెన్నూ పట్టిన యోధుడు. శ్రమ విముక్తి జరిగేదాకా విప్లవోద్యమం అటువంటి 'యోధ'లను సృష్టించుకుంటూనే ఉంటుంది. ఈ క్రమంలోనే తెలంగాణలోని హైదరాబాద్‌లో విప్లవ ప్రజాస్వామ్య వేదిక (రెవల్యూషనరీ డెమొక్రటిక్ ఫ్రంట్) ఏప్రిల్ 22, 23 తేదీలలో తన మొదటి మహాసభలను జరుపుకుంది. దేశవ్యాప్తంగా వెల్లువెత్తుతున్న విప్లవాకాంక్షకు అద్దం పట్టింది. దేశంలోని సామ్రాజ్యవాద సంక్షోభాన్ని విప్లవ సంక్షోభంగా మార్చమని పిలుపునిచ్చింది. పోరాటం తప్ప ప్రజలకు మార్గమేముంది?



## ఈ సంచికలో...



శివసాగర్ విశ్లేషణా వ్యాసాలు వచ్చే సంచికలో....

పెరిగిన ధరల వలన అరుణతార ఖర్చు కూడా చాలా పెరిగిపోయింది. తప్పని పరిస్థితుల్లో అరుణతార విడి ప్రతి ధర, అలాగే సంవత్సర చందా, దశాబ్ది చందాల ధరలు పెంచక తప్పడం లేదు. ఎప్పటిలానే మీ హార్దిక, ఆర్థిక సహకారాలు మాకు అందిస్తారని ఆశిస్తున్నాం.
**విడి సంచిక వెల : రు. 15; సంవత్సర చందా : రు. 160; దశాబ్ది చందా : రు. 1500**

**కవర్ డిజైన్ :** శ్రీను, సృజనా గ్రాఫిక్స్, ప్రొద్దుటూరు; **రెండవ కవర్ & నాల్గవ కవర్:** విరసం 23వ రాష్ట్ర మహాసభల దృశ్యాలు
**ఫోటోలు :** పావని

# తెలుగు సాహిత్య లోకం - ఆపరేషన్ గ్రీన్‌హంట్

- పాణి

రచయితలను, సాహిత్య ప్రపంచాన్నీ కాలం అనుక్షణం పరీక్షిస్తూనే ఉంటుంది. ప్రతి కాలంలోనూ గొప్ప రచనల కోసం ఎదురు చూడాల్సిందే. ఎందుకంటే అవి జీవితాన్ని మన అనుభవానికంటే అద్భుతంగా, వాస్తవికంగా ఎత్తి చూపుతాయి కాబట్టి. అయితే కాల పరీక్షకు రచయితలు ఎట్లా స్పందించారు? దాని వ్యక్తీకరణగా ఎలాంటి సాహిత్యం వచ్చింది? అనే ప్రశ్నలు కూడా వేసుకోవాల్సిందే. అవి చాలా విలువైనవి.

ఆధునిక తెలుగు సాహిత్యం అలాంటి పరీక్షలెన్నిటినో చవి చూసింది. వలసవాదం అట్లాంటి మొట్ట మొదటి పరీక్ష. బహుశా వలసవాదానికి వ్యతిరేకంగా అనేక మంది కవులు, రచయితలు స్పందించారు. విచిత్రంగా విశ్వనాథ కూడా తన కారణాల వల్ల, తన దృక్పథంతో స్పందించిన ఫలితమే వేయి పడగలు నవల. తరతరాల బ్రాహ్మణీయ ఆధిపత్యానికి వ్యతిరేకంగా కొనసాగుతూ వచ్చిన ధిక్కార ధార కూడా వలసవాద వ్యతిరేక ఆవరణలో మరింత విస్తృతమైంది. మాకొద్దీ తెల్ల దొరతనం అన్న మకుటం కులవ్యవస్థ మీది తిరుగుబాటుగా మాకొద్దీ నల్ల దొరతనంగా మారిపోయిందంటే .. అందులో వలసవాద కాల స్పృహ దాగి ఉన్నట్లే.

జాతీయ కాంగ్రెస్, కమ్యూనిస్టు, టెర్రరిస్టు అనబడే ఆలోచనా స్రవంతులన్నిటి ప్రేరణతో వలసవాదాన్ని వ్యతిరేకించిన ఆలోచనాపరులు, రచయితలు, కళాకారులు నేరుగా పోరాటాల్లో పాల్గొన్నారు. నాయకత్వం వహించారు. జెయిలు శిక్షలు అనుభవించారు. వీళ్లెవరూ తమను తాము సాహిత్యానికి, మేధో ప్రపంచానికి సంబంధించిన ప్రత్యేక మానవులని అనుకోలేదు. . రాజకీయాలని.. సాహిత్యమని వేరు చేసుకొని చూడలేదు. ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలోనైనా, తెలంగాణ సాయుధ పోరాటంలోనైనా, తిరిగి మళ్లీ నక్సల్బరీ శ్రీకాకుళ పోరాట కాలంలోనైనా రచయితలు కాలం విసిరే సవాళ్లను అందిపుచ్చుకున్నవాళ్లే.

ఆ అన్ని సందర్భాల్లో తెలుగులో అద్భుతమైన సాహిత్యం వచ్చింది. చిరస్మరణీయమైన సాహిత్యకారులు ఆ కాలాల్లో తయారయ్యారు. పోరాటం కోసం కాసేపు రచనను పక్కన పెట్టిన వాళ్లున్నారు... ఉద్యమంతోపాటు రచన చేసిన వాళ్లున్నారు... జెయిల్లో నిర్బంధం మధ్యనే సృజన చేసినవాళ్లున్నారు... ఉద్యమానంతరం ఆ అనుభవాలను సాహితీకరించినవాళ్లూ ఉన్నారు. ఈ చరిత్ర తెలుగు సాహిత్యాన్ని నిరంతరం పురోగామిశక్తిగా మార్చివేసింది. సాహిత్య ప్రమాణాల రీత్యా, దృక్పథం రీత్యా కూడా తెలుగు సాహిత్యం ఉన్నతీకరించబడింది.

అందరికీ తెలిసిన ఈ చరిత్ర వివరాల్లోకి వెళ్లనవసరం లేదుగాని, ఇది మళ్లీ గుర్తు చేసుకోవాల్సిన తరుణం. ఆపరేషన్ గ్రీన్‌హంట్ అనే పేరుతో భారతదేశంలో అంతర్యుద్ధం మొదలై మూడేళ్లవుతోంది. యుద్ధం రెండో దశలోకి కూడా వచ్చేసింది. అర్ధ సైనిక బలగాలతోపాటు నేరుగా భారత ప్రభుత్వ బలగాలు పెంటగాన్ కనుసన్నల్లో... మధ్య, తూర్పు భారతదేశంపై యుద్ధం చేస్తున్నాయి. మానవరహిత విమానాలు మానవావాసాలపై తిరుగాడుతున్నాయి. అరుంధతీరాయ్‌లాంటి వాళ్లు ప్రజలపై యుద్ధం సాగుతోందని దేశమంతా తిరిగి చెప్తున్నారు. ఎక్కడో స్వీడన్ నుంచి ఎనభై ఏళ్ల వృద్ధుడు యాన్ మిర్డాల్ ఇండియాకు వచ్చి యుద్ధభూమిలో తిరుగాడి.. అక్కడి యుద్ధం గురించి, నిర్మాణం గురించి దేశమంతా ప్రచారం చేసిపోయారు. అంతర్జాతీయ స్థాయిలో గొంతెత్తి అరుస్తున్నారు. భారతదేశంలో అంతర్యుద్ధం మొదలైందని నిర్ధారించారు. "ప్రపంచంలోనే మొదటిసారిగా భారత సైన్యం 'సాంప్రదాయేతర యుద్ధనీతి' అనే సిద్ధాంతపత్రాన్ని 2007 డిసెంబర్ 1న ప్రవేశపెట్టింద"ని దాని గుట్టు విప్పారు. దండకారణ్యంలో ఒక ఎర్రని జెండా ఎగురుతోందని, దాని మీద రెండు నక్షత్రాలు ఉన్నాయని, ఒకటి ఆదివాసులను, మరొకటి ఇతరులను సూచిస్తోందని కూడా రాశారు.

ఇదంతా ఎందుకంటే భారతదేశంలో జరుగుతున్న అంతర్యుద్ధానికి వ్యతిరేకంగా విదేశీ ఆలోచనాపరులు కూడా స్పందిస్తున్నారు. వీరంతా సాహిత్యపు లోతు తెలిసినవారే. గొప్ప సృజనకారులు. వీళ్లెవరూ గ్రీన్‌హంట్‌ను మావోయిస్టుల సమస్య అనుకోలేదు.

కానీ దేశవ్యాప్తంగా విప్లవోద్యమం ఆటుపోట్ల మధ్య ఉన్నప్పుడు.. తమ అనన్య త్యాగాలతో ఉద్యమ నిర్మాణం చేసి రాష్ట్రాల సరిహద్దులు దాటించిన తెలుగు ప్రజల మధ్య జీవిస్తున్న రచయితలను మాత్రం ఈ యుద్ధం కదిలించలేకపోతోంది. ఆఫ్ఘన్‌పై, ఇరాక్‌పై అమెరికా యుద్ధం ప్రకటించగానే తెలుగు రచయితలంతా వీధుల్లోకి వచ్చారు. నిరసన సభలు నిర్వహించారు. చాలా పెద్ద ఎత్తున సాహిత్య సృజన చేశారు. అంతకంటే ముందు క్లింటన్ ఇండియాకు వచ్చినప్పుడుగాని, గుజరాత్ మారణకాండ జరిగినప్పుడుగాని, సద్దాంహుస్సేన్‌ను ఉరి తీసినప్పుడుగాని తెలుగు రచయితలు గొప్పగా స్పందించారు. నిలిచిపోయే కవితలు, పాటలు చాలా వచ్చాయి.

కానీ ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేకంగా తెలుగు సాహిత్య లోకంలో స్పందన కరువైపోయింది. రచయితలను స్పందింపచేసే

స్థాయిలో విప్లవోద్యమం లేదనిగాని, ఈ యుద్ధానికి సంబంధించిన సమాచారం అందడం లేదనిగాని అనడానికి లేదు. ఎందుకంటే - ఇవాళ దేశ విదేశాల్లోని ప్రజాస్వామికవాదులను, రచయితలను దండకారణ్యం ఆకర్షిస్తోంది. ఉద్యమ క్షేత్రం పూర్తిగా మారిపోయిన మాట నిజమే. 1980లలో విప్లవ ప్రజా ఉద్యమాలు ఉజ్వలంగా ఉండేవని, ఇప్పుడు అట్లాలేవనేవారి వగపాటులో ఈ నిజం ఉన్నమాట వాస్తవమే. అంటే - మైదాన ప్రాంతాల్లో ఉద్యమాలు లేకపోవడం గురించిన చర్చ ఇది. ఇది వాస్తవమే, ఇది ఒక పరిమితే. అయితే ఆనాటి ఉద్యమాలకంటే అనేక రెట్ల ఆకర్షణాశక్తి, ఉద్వేగలక్షణం ఇవాళ దండకారణ్యంలో నడుస్తున్న ఉద్యమానికి ఉన్నది. ఆకర్షణ, ఉద్వేగమనేవి ఒక ఉద్యమాన్ని అంచనా వేయడానికి శాస్త్రీయ పరికరాలు కాకపోయినా.. ఇక్కడ రచయితలు, మధ్య తరగతి గురించి మాట్లాడుతున్న సందర్భం కాబట్టి వాళ్లకు అవసరమైన దినుసు గురించి ప్రస్తావించాల్సి వచ్చింది. నిజానికి ఇవాళ సామాజికంగా, భౌగోళికంగా ఆదివాసీల మధ్యనే విప్లవోద్యమం ఉండవచ్చుగాని, ఈ నలభై ఏళ్లలో చాలా ఉన్నత స్థాయికి ఎదిగి కొనసాగుతున్నది. ఇప్పుడు అక్కడ యుద్ధం మాత్రమేకాదు, విప్లవ జనతన సర్కార్, ప్రత్యామ్నాయ అభివృద్ధి అనే రెండు అద్భుతాలు అంకురించాయి. నిజానికి కవులకు, రచయితలకు ఇవి కనీసంగానైనా ఉత్తేజాన్ని ఇవ్వాలి. కాని తెలుగు రచయితలకు తమ మధ్య ఒక గొప్ప ప్రయోగం జరుగుతున్నదనే సోయి ఉన్నదా? సందేహమే. కనీసం ఈ మొత్తం వ్యవహారం మీద ఒక విమర్శనాత్మక వైఖరితోనైనా ఆసక్తి పెంచుకోవచ్చు. అదీ లేదు.

ఇక సమచారం గురించే అయితే.. బహుశా ఈ నలభై ఏళ్లలో విప్లవోద్యమం నుంచి ఎన్నడూ రానంత సాహిత్యం ఇప్పుడు వస్తోంది. ఉద్యమ అభివృద్ధి క్రమంలో భాగంగా లోపలి నుంచే అసంఖ్యాక రచయితలు, మేధావులు విరివిగా తెలుగు, ఇంగ్లీషు, హిందీ భాషల్లో రాసి బైటి సమాజానికి అందిస్తున్నారు. అనేక కారణాల వల్ల ప్రత్యేకతల వల్ల ఒకప్పుడు ఇలాంటి ఉద్యమ సాహిత్యం బహిరంగంగా అందరికీ అందుబాటులోకి వచ్చేదికాదు. ఇప్పుడు అట్లా కాకుండా అందరికీ విప్లవోద్యమ సాహిత్యం చేరువలోకి వస్తోంది. కేవలం విప్లవ రచయితలే కాకుండా గతంకంటే చాలా ఎక్కువగా బైటి ప్రజాస్వామికవాదులు దండకారణ్య విప్లవం గురించి, గ్రీన్‌హంట్ యుద్ధం గురించి విశ్లేషణలు అందిస్తున్నారు.

ఇవన్నీ తెలుగు పాఠకులకు, రచయితలకు అందుబాటులో ఉన్నవే. కొన్ని వక్రీకరణలతోసహా కూడా ప్రధాన స్రవంతి పత్రికలు, చానళ్లు కూడా ఈ యుద్ధాన్ని ప్రచారం చేస్తున్నాయి. మొత్తం మీద ఏ ఇతర ఉద్యమం వేయజాలని ప్రభావాన్ని అంతర్జాతీయ స్థాయిలో సహజంగానే దండకారణ్య విప్లవం వేస్తోంది. ఏ ఉద్యమం నుంచీ రానంతగా పెద్ద ఎత్తున సాహిత్యం, నివేదికలు, విశ్లేషణలు వస్తున్నాయి. వీటిని తెలుగు సమాజం, బుద్ధిజీవులు, రచయితలు అందుకోవడంలోనే సమస్య ఉంది.

ఈ విషయంలో మొత్తంగానే తెలుగు బుద్ధిజీవులు ఆలోచించక తప్పదు. ఒకవేళ ఉద్యమం తమదాకా వచ్చి తమను కదిలించేంత శక్తివంతంగా లేదని అనుకున్నా.. అసలు విప్లవోద్యమంపట్లనే భిన్నాభిప్రాయాలున్నానుకున్నా... ప్రజాస్వామికవాదులుగా, రచయిలుగా, బుద్ధిజీవులుగా ఈ యుద్ధంలో జరుగుతున్న దారుణం గురించి మాట్లాడకపోతే తాము పాటించే ప్రజాస్వామిక విలువలకు అర్థం ఉండదని, అవన్నీ శుష్క వల్లాపనలుగా మిగిలిపోతాయని, అంతిమంగా తమ ప్రజాపక్షపాతమే సంక్షోభంలో పడిపోయే ప్రమాదమున్నదని గుర్తించాలి.

రాజ్యం ఈ దేశ ఆదివాసులపై యుద్ధం చేస్తున్నప్పుడు ఈ మౌనానికి ఉన్న అర్థం ఏమిటని చరిత్ర ప్రశ్నిస్తుంది. ఈ అంతర్యుద్ధంలో ఎటువైపు అని కాలం నిలదీస్తున్నది. ఈ మాట ఇట్లా అనడం ఈ దేశ ప్రజలపై జరుగుతున్న యుద్ధానికన్నా నొప్పి కలిగించేదేమీ కాదు.

యుద్ధోన్మాదంతో కొట్టుకుంటున్న భారత పాలకవర్గాలను ఎదిరించి పోరాడుతున్న ఆదివాసుల పక్షాన నిలబడి ఈ మాట విరసం తెలుగు సాహిత్యలోకాన్ని అడగదలుచుకుంది. యుద్ధం ముంచుకొని వచ్చినప్పుడు యుద్ధం పట్ల స్పందన, నిరసన మాత్రమే సంభాషణను నిర్ణయిస్తాయి. అవే ప్రమాణాలవుతాయి. లక్షలాది సైనిక బలగాలు దీర్ఘకాల లక్ష్యంతో దేశ ప్రజలపై యుద్ధం చేస్తున్నప్పుడు కూడా నాజూకైన మాటలతో ఆత్మవంచన చేసుకొని మర్యాదస్తులుగా మిగిలిపోవడం కంటే అడగవలసిన మాట అడగడమే మంచిది.

జీవితపు మారుమూలల్లోకి సాహిత్యకారుల సృజన చూపు ప్రసరించి అన్ని ఆధిపత్యాలను, అన్యాయాలను ప్రశ్నించవలసిందే. ఈ పని ఇప్పుడు జరుగుతున్నాదానికంటే ఇంకా ఎక్కువగా జరగాల్సిందే. అయితే, దానికీ... కళ్ల ముందు సాగుతున్న ఈ మహా సంగ్రామంలో ప్రజల పక్షాన నిలబడి మాట్లాడటానికీ పోటీ ఏమీ లేదు. దేన్నీ తక్కువ చేయనవసరం లేకుండానే ఈ యుద్ధానికి వ్యతిరేకంగా మాట్లాడవలసి ఉన్నది. ఈ పని చేయడమంటే సాహిత్యాన్ని వదిలి రాజకీయాల్లోకి వెళ్లిపోవడమనే వాళ్లూ ఉండొచ్చు. ఈ సమస్య మావోయిస్టులదనీ, ఈ గొడవ ఏదో.. వాళ్లూ... వాళ్ల సంబంధీకులే చూసుకోవాలనీ, మావోయిస్టు రాజకీయాలతో, వాళ్ల ఆచరణతో సకారణ వ్యతిరేకత ఉన్నందు వల్లనే ఈ మౌనమనీ సమర్థించుకుంటే అది తప్పక రాజకీయమవుతుంది.

ఈ మాట కూడా ఎందుకు అనవలసి వస్తోందంటే - మార్చి 10, 11 తేదీల్లో జరిగిన విరసం 23వ రాష్ట్ర మహా సభల సందర్భంగా ఒక విచిత్రమైన వాదన, స్పందన వినిపించింది. ఎవరు ఎన్ని సద్విమర్శలు, దుర్విమర్శలు పెట్టినా విరసం ఆది నుంచి రాజ్యహింసను వ్యతిరేకిస్తూ విప్లవోద్యమ ప్రచారం తన సాహిత్య సాంస్కృతిక పోరాటానికి మూలధాతువనే అవగాహనతోనే కొనసాగుతోంది కాబట్టి గ్రీన్‌హంట్ మొదలైనప్పటి నుంచి శక్తిమేరకు తన సాహిత్యోద్యమంలో దీనికి ప్రాధాన్యత ఇచ్చింది. అందు వల్ల సహజంగానే యుద్ధం రెండో దశకు కూడా చేరుకున్నది కాబట్టి ఈ మహా సభలకు ఆపరేషన్ గ్రీన్‌హంట్ - ప్రత్యామ్నాయ అభివృద్ధి

అనే అంశాన్ని ఎంపిక చేసుకున్నది. సభల కరపత్రం విడుదలైనప్పటి నుంచి విరసం మిత్రులు, అభిమానులు, సోదర సాహిత్య సంస్థల నుంచి.... ఈ సభల్లో సాహిత్యం ఏముంది? అంతా మావోయిస్టు ఉద్యమం గురించి తప్ప .. అనే విమర్శలు వచ్చాయి. సాహిత్యంలో ఏమీ చేయలేక మావోయిస్టు రాజకీయ ప్రచారానికి సభలను నిర్దేశించుకున్నారని కూడా అన్నవాళ్లున్నారు. విప్లవోద్యమాన్ని ప్రచారం చేయడం గురించి ఏ రకమైన పశ్చాత్తాపం లేదు, వెనకడుగు వేసేది కూడా లేదు గాని ఈ విమర్శల్లో సవరించాల్సిన రెండు అంశాలున్నాయి.

ఒకటి: గ్రీన్‌హంట్ మొదలై ఇంత కాలమైనా ఇప్పటికీ కొందరైనా తెలుగు ఆలోచనాపరులు దాన్ని మావోయిస్టు సమస్యగా మాత్రం చూడటం. రెండు: ఆ సభల్లో సాహిత్యాంశాలు లేవని ఆరోపించడం.

గ్రీన్‌హంట్ ఈ దేశ ప్రజల స్వావలంబన సమస్య అనీ, ఆదివాసీ అస్తిత్వాన్ని ఏకంగా తుడిచిపెట్టేసే యుద్ధమనీ అనుకుంటే ఈ యుద్ధం వెనుక ఎంత విస్తృత నేపథ్యం ఉన్నదో అర్థం అవుతుంది. నిజానికి ఇది కేవలం ఆదివాసుల సమస్య కాదని, మావోయిస్టుపార్టీ సమస్య కాదని, ఈ దేశ ప్రజలందరి సమస్య అని విప్లవోద్యమం ఎన్నోసార్లు చాలా వివరంగా ఈ మూడేళ్లలో చెప్పింది. ఇది కేవలం వారి విశ్లేషనగానే గాక కనీసం ఈ మూడేళ్లలో జరుగుతున్న పరిణామాలను పైపైన చూసినా ఈ యుద్ధం భారత ప్రజలందరి సమస్య అని అర్థం అవుతుంది.

ఇక ఆ సభల్లో దండకారణ్యంలో విప్లవ కళా సాహిత్య సృజన, యుద్ధకాలంలో బుద్ధిజీవుల పాత్ర అనే రెండు సాహిత్యాంశాలున్నాయి. కానీ అవి సాహిత్యంగా కనిపించకపోవడాన్ని ఏమనుకోవాలి? బహుశా ఆదివాసీ ఉద్యమ సాహిత్యాన్ని గుర్తించడంలోనే ఇబ్బందా? ఇది. బహుశా అందువల్లే మొత్తంగా ఈ మౌనం సాగుతున్నదనుకోవాలా?

వీటితోపాటు మరో మాట కూడా చెప్తే సరిపోతుంది. ఆ సభల్లో ఇరవైమూడు పుస్తకాలు ఆవిష్కరిస్తే అందులో విరసం సభ్యులు రాసిన సాహిత్య విమర్శ, కథలు, కవిత్వం, నవల, సామాజిక విమర్శ పుస్తకాలు పది ఉన్నాయి. ఇదంతా సాహిత్య అవునోకాదో అంచనా వేసి చెప్పాల్సిందే. విరసం సాహిత్య కర్తవ్యాలకూ, రాజకీయ కర్తవ్యాలకూ మధ్య కృత్రిమ పోటీ పెట్టుకోదు. ఆ రెంటినీ నలభై ఏళ్లుగా సమన్వయం చేస్తూ పురోగమిస్తోంది. రాజకీయాలంటే భయమో, ఈసడింపో ఉన్నవాళ్లకు ఈ మేలు కలయికలో రాజకీయాలే కనిపించి ఆందోళనపడతారు. అట్లని సాహిత్యం కనిపిస్తుందా? అంటే అదీ లేదు. నేరుగా రాజకీయాలు చెప్పాల్సి వస్తే వెనకడుగు వేయకుండానే సాహిత్యకృషి కొనసాగించడం కత్తిమీదసాము. అయినా విరసం ఆ పని చేస్తోంది. నిజానికి ఇదేదో విరసం వ్యవహారం మాత్రమే కాదు. పైన ప్రస్తావించిన, మనందరికీ తెలిసిన సాహిత్య చరిత్రలోని ప్రజా రచయితలు ఈ మేలుకలయికను సాధించనవారే. రెండో ప్రపంచ యుద్ధం, స్పెయిన్ అంతర్యుద్ధం వంటి వాటిలో ప్రపంచ స్థాయి సుప్రసిద్ధ రచయితలు, మేధావులు ఈ పనే చేశారు. అక్కడైనా .. మన తెలంగాణ సాయుధపోరాటంలో, శ్రీకాకుళ సాయుధపోరాటంలో అయినా నేరుగా రచయితలు, కళాకారులు యుద్ధంలోకే వెళ్లి పోరాటం, రచనా రెండూ చేశారు. నేరుగా సైన్యంలోకి వెళ్లనివాళ్లు కూడా ఈ సమన్వయాన్ని సాధించారని మనకు తెలుసు.

విరసంకు ఉన్న పరిమితి వల్ల ఆ యుద్ధాన్ని సాహిత్య కళా మేధోరంగాల్లో ప్రచారం చేయడమే కర్తవ్యంగా పెట్టుకుంది... అదీ తన సాహిత్య వ్యాసంగం ద్వారా విప్లవానికి దోహదపడాలనే ఆశయాన్ని దృఢంగా నిలిపి ఉంచుకుంటూనే. అందుకే ఈ యుద్ధకాలంలో రచయితలు ఏం చేయాలి? విరసంలాంటి సాహిత్య సంస్థ ఏం చేయాలి? అనే ప్రశ్నలకు సమాధానంగా గ్రీన్‌హంట్ మొదలైనప్పటి నుంచి తన సృజనాత్మక మేధో శక్తినంతా యుద్ధవ్యతిరేక ప్రచారానికే వెచ్చిస్తూ వచ్చింది. ఈ మహా పభల్లో అయితే గ్రీన్‌హంట్ వ్యతిరేకంగా సాహిత్య సాంస్కృతిక రంగాల్లో పని చేయడమే కేంద్ర కర్తవ్యంగా ఎంచుకుంది. అయితే ఈ సభల సందర్భంగా ఇట్లాంటి విచిత్రమైన స్పందన వచ్చింది. ఇది మన సాహిత్యరంగం ఎలా ఉందో అర్థం చేసుకోడానికి సూచిక. బహుశా అస్తిత్వ స్పృహలోని పరాకాష్టకు సాహిత్య, మేధో రంగం చేరుకున్నదా? అందువల్లే ఆదివాసీ ప్రాంతంలో జరుగుతున్న ఈ భయానక యుద్ధంలో ఆదివాసీలే తేల్చుకోవాలేగాని మనమేం చేయగలమనే వైఖరితో ఉన్నారా? అసలు ఇది వాళ్లకు తప్ప మనకు ఎట్లా అనుభవంలోకి వస్తుందనే సమాధానం కూడా సిద్ధం చేసుకున్నారా? ఈ సందేహాలు ఎందుకంటే అస్తిత్వ స్పృహలోని ఆలోచనాక్రమం ఇట్లాగే ఉంటుంది కాబట్టి. అయితే సకల పీడిత అస్తిత్వాల గురించి మాట్లాడే ప్రజాస్వామిక వాదులు కూడా మన దగ్గర చాలా మంది ఉన్నారు. వాళ్లకు కూడా దండకారణ్య ఆదివాసీలపై అమెరికా అండదండలతో భారత పాలకవర్గాలు చేస్తున్న ఈ యుద్ధం ఎందుకు కనపడటం లేదనే సందేహం కలగడం న్యాయమే కదా?

అనేక కారణాల వల్ల తెలుగు మేధో, సృజనాత్మకరంగాలు తీవ్ర సంక్షోభంలో ఉన్నాయనడానికి ఈ విషయం ఒక చిన్న ఉదాహరణ మాత్రమే. నిజానికి చాలా గంభీరమైన సమస్యల్లో కొట్టుమిట్టాడుతున్నందు వల్ల చాలా సహజంగా స్పందించాల్సిన ఇలాంటి విషయంలో కూడా మౌనమే రాజ్యమేలుతోంది. మిగతా వివరాల్లోకి ఇక్కడ పోలేకపోయినా ఆలోచనా, ఆచరణరంగాల్లో కనీసంగా క్రియాత్మకం కావల్సిన అవసరం ఉంది. అప్పుడే ఈ యుద్ధాన్ని నిలువరించగలం.

అయితే ఈ పని ఏ ఒక్క సంస్థా చేయజాలదు. ఏ ఒక్క రంగంలోనో చేసినంత మాత్రాన యుద్ధాన్ని ఆపడం సాధ్యంకాదు. అందరూ అన్ని వైపుల నుంచి కమ్ముకొని రావాల్సి ఉంది. అన్ని చేతులూ కలవాలి. అన్ని గొంతులూ కలవాలి. సాధ్యమవుతుందనే నమ్మకం ఉంది. ఎందుకుంటే తెలుగు సమాజానికీ, సాహిత్య రంగానికీ అలాంటి అద్భుత వారసత్వం ఉంది కాబట్టి.



కార్యదర్శి నివేదిక

# యుద్ధ కాలపు సాహిత్యోద్యమం

## 23వ రాష్ట్ర మహా సభల సందర్భంగా కార్యదర్శి నివేదిక

- పాణి

విప్లవ రచయితల సంఘం 23వ మహాసభలకు వచ్చిన రచయితలకు, సాంస్కృతిక కార్యకర్తలకు, విప్లవాభిమానులకు సాదర స్వాగతం. భారత విప్లవోద్యమంతో పాటు నలభై ఏళ్లకు పైగా విరసం చేస్తున్న ప్రయాణంలో ఈ మహాసభలకు ఒక ప్రత్యేకత ఉంది. నిర్బంధం, అణచివేత మధ్య పురోగమిస్తున్న విప్లవోద్యమం మీదికి ఇవాళ కేంద్ర ప్రభుత్వం లక్షలాది అర్ధ సైనిక బలగాలను, సైనిక బలగాలను పంపి యుద్ధం చేస్తున్న ఈ తరుణంలో విరసం ఈ మహాసభలు జరుపుకుంటోంది. ఈ భీకర యుద్ధం ఇప్పటికే రెండో దశలోకి వెళ్లిపోయింది. ఇప్పటికే ఈ యుద్ధంలో భాగంగా భారత విప్లవోద్యమ అగ్ర నాయకులు ఆజాద్, కిషన్‌జీలాంటివాళ్లు, ఇంకా అనేక మంది విప్లవ నాయకులు, కార్యకర్తలు, ఆదివాసీ వీరులు, సాధారణ ప్రజలు, విప్లవాభిమానులు అమరులయ్యారు. ఆంధ్రప్రదేశ్‌లోని గోదావరీ తీరం నుంచి దండకారణ్యం, ఆంధ్ర ఒడిషా సరిహద్దు ప్రాంతం, ఈశాన్యంలోని జంగల్‌మహల్‌దాకా సువిశాల ఆదివాసీ ప్రాంతంలో ఎందరో ఈ యుద్ధంలో ప్రాణత్యాగం చేశారు. వారందరికీ వినమ్రంగా నివాళి ప్రకటిస్తూ ఈ సభలను ప్రారంభించుకుందాం. అట్లాగే మార్క్సిస్టు లెనినిస్టుగా తన ఆలోచనాశక్తినంతా జీవితాంతం ఈ దేశ ప్రజల విముక్తి కోసం వెచ్చించిన కా. ఆర్.ఎస్.రావుకు, విరసం సభ్యుడు, రాయలసీమ విద్యావంతులు వేదిక నాయకుడు అయిన కా. మాధవస్వామికి జోహార్లు చెప్పుకుంటూ ఈ సభలను ప్రారంభించుకుందాం.

2010 మే నెలలో విశాఖపట్నంలో నూరేళ్ల శ్రీశ్రీ, నలభై ఏళ్ల విరసం సందర్భంగా 22వ మహాసభలు జరిగాయి. ఈ రెండేళ్లలో పాలక వర్గం మరింతగా తమ దోపిడీ పద్ధతులను, అణచివేత చర్యలను తీవ్రతరం చేసింది. తాను రాజ్యాంగ పరిధిలో తీర్చవలసిన ఏ ఒక్క సమస్యనూ తీర్చలేకపోగా నానాటికి ధరలు, నిరుద్యోగం పెంచుతూ పోయింది. అభివృద్ధి పేరుతో విధ్వంసపూరిత విధానాలు అమలు చేస్తూ పోయింది. థర్మల్ విద్యుత్ ప్లాంట్లకు, ఫార్మా కంపెనీలకు సారవంతమైన భూములను అప్పగించడానికి ప్రజలపై దారుణ మారణకాండ ప్రయోగించింది. ఉత్తరాంధ్ర అంతా గనుల తవ్వకాలు, థర్మల్ విద్యుత్‌ప్లాంట్ల నిర్మాణం, ఫార్మా కంపెనీల స్థాపనలతో అగ్నిగుండంగా మారిపోయింది. ప్రతి పల్లె సోంపేటగా, కాకరాపల్లెగా మారిపోతున్నాయి. అక్కడ విప్లవ, ప్రజాస్వామిక శక్తుల ఆధ్వర్యంలోనూ, స్వచ్ఛందంగానూ ప్రజలు బలిదానాలు చేస్తూ ఉద్యమాలు నడుపుతున్నారు. దక్షిణ కోస్తా అంతటా కోస్టల్ కారిడార్ ప్రభావంతో పెద్ద ఎత్తున రైతులను భూమికి దూరం చేసే ప్రక్రియ ఈ రెండేళ్లలో వేగవంతం అయింది. నెల్లూరు జిల్లాలో సెజ్‌లు. థర్మల్ విద్యుత్ ప్లాంట్ల పేరుతో గ్రామాలు నిశ్శబ్దంగా అదృశ్యమైపోతున్నాయి.

ఇక తెలంగాణ ప్రజలు ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా, ముఖ్యంగా ఆ ప్రాంత ప్రజల చిరకాల వాంఛ ప్రత్యేక తెలంగాణ కోసం ఉద్యమిస్తున్నారు. బూర్జువా పార్టీల పరిమితులను, వంచనను అధిగమించి ప్రజలు ఈ రెండో విడత పోరాటంలో లక్షలాదిగా కదిలి తమ ఆకాంక్షను వెల్లడి చేసుకున్నారు. అనేక నిరసన రూపాలను, పోరాటా రూపాలను ఉద్యమ ప్రపంచంలోకి తీసుకొని వచ్చారు. ఈ క్రమంలో అనేక రకాలుగా అణచివేతను అనుభవించారు. తెలంగాణ ఉద్యమంలోని అనేక ఆటుపోట్లు, నయవంచనలు సృష్టించిన నిరాశా నిస్పృహల మధ్య అనేక మంది ఆత్మహత్యలు చేసుకున్నారు. అయినా కేంద్రం తెలంగాణ విషయం ఏమీ తేల్చకపోగా ఉద్యమాన్ని చల్లార్చడానికి కుట్రలు పన్నింది. ప్రజలు తమ ఆకాంక్షను నెరవేర్చుకోడానికి పోరాట పథంలోనే ఉన్నారు.

రాయలసీమ ప్రాంతీయ పాలక శక్తులు స్థానిక ప్రజలను నిత్యం దోపిడీ చేస్తూ, ఫ్యాక్షన్ ఆధిపత్యాన్ని చెలాయిస్తూ, కోస్తా ప్రాంత పాలకవర్గంతో కలిసి తెలంగాణ ప్రజల న్యాయమైన ఆకాంక్షను అడ్డుకోవడానికి ప్రయత్నం చేస్తున్నాయి. కరువుకాటకాల మధ్య, వలసల మధ్య దశాబ్దాలుగా నలిగిపోతున్న రాయలసీమ ప్రజల సమస్యల పరిష్కారానికి కనీస ప్రయత్నం చేయకుండా, అప్పులతో ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతాంగానికి చేయూత నివ్వకుండా, నిరుద్యోగ రోగగ్రస్తమైన యువతరానికి ఉద్యోగ కల్పన కోసం, పెండింగ్ ప్రాజెక్టుల సాధన కోసం ఏ చిన్న ప్రయత్నం కూడా చేయకుండా నిత్యం తెలంగాణ ఉద్యమానికి వ్యతిరేకంగా మాత్రమే మాట్లాడడం మనం చూస్తున్నాం. రాయలసీమ హక్కుల ఉద్యమం పేరుతో కోస్తా పాలకులతో కలిసి సమైక్య దోపిడీ సాగించడానికి సమైక్యాంధ్రవాదాన్ని లేవదీశారు. ఇది తెలంగాణను వ్యతిరేకించడమే లక్ష్యంగా కొనసాగుతోంది. దీంతో కేవలం ల్యాండ్, మైనింగ్, లిక్కర్ మాఫియా తప్ప బూర్జువా రాజకీయ నాయకత్వం కూడా లేని రాయలసీమ ప్రజలు తీవ్ర సంక్షోభంలో చిక్కుకుపోయారు. రాయలసీమ ప్రజలకు, తెలంగాణ ఆకాంక్షకు వ్యతిరేకంగా తయారైన సీమ నాయకుల కుట్రలను బయటపెడుతూ ఈ ప్రాంతంలో ఇప్పుడిప్పుడే ప్రజాస్వామిక శక్తులు ప్రాంతీయ వివక్ష, దళిత బహుజన ప్రజల అస్తిత్వానికి సంబంధించిన ప్రత్యేక సమస్యల పట్ల, కార్మిక ఉద్యోగ వర్గాల చట్టబద్ధ హక్కుల ఉల్లంఘనపట్ల చైతన్యయుతమైన ప్రయత్నాలు మొదలయ్యాయి.

మొత్తం మీద రాష్ట్రంలో పాలకులు అత్యంత జుగుప్సాకరంగా తమ నైజాన్ని బైటపెట్టుకొని, కనీస బూర్జువా పద్ధతులను కూడా పాటించకుండా అసెంబ్లీలో, బైటా కేవలం మాఫియాగా తయారయ్యారు. కోట్ల రూపాయాల కుంభకోణాల్లో మునిగి తేలుతున్నారు. వేలాది ఎకరాల అక్రమ స్వాధీనం, అధికార దుర్వినియోగం ముడి దినుసుగా దేశ, రాష్ట్ర రాజకీయాలను పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద శక్తులకు దోపిడీకి అనుకూలంగా

తయారు చేశారు.

ఈ నేపథ్యంలో ప్రజలు నిర్మాణయుతంగానూ, జీవిత సంక్షోభంలో నుంచి అనివార్యంగానూ ఈ రెండేళ్లలో అనేక పోరాటాలు చేశారు. ఆ పోరాటాల ఉత్తేజంతో విప్లవ రచయితల సంఘం తన రెండేళ్ల కార్యకలాపాలను ఈ మహాసభల సందర్భంగా సమీక్షించుకొని భవిష్యత్ కార్యక్రమం నిర్దేశించుకోదలిచింది. విప్లవంలో, ప్రజా పోరాటాల్లో సాహిత్య, సాంస్కృతిక పాత్ర నిర్వహించడం లక్ష్యంగా పెట్టుకున్న విరసం ప్రధాన ఆచరణ రూపం సాహిత్య రచన. సృజనాత్మక సాహిత్య రూపాలు, సాహిత్య విమర్శ, సామాజిక, రాజకీయ విశ్లేషణలు, అధ్యయనం, క్షేత్ర పరిశోధన, విప్లవ భావజాల ప్రచారం విరసం మొదటి నుంచీ ఎంచుకున్న ఆచరణ రూపాలు.

ఈ రెండేళ్లలో ఈ కోణాల్లో విరసం గణనీయమైన కృషి చేసింది. పైన చెప్పిన ఆచరణ రూపాల్లో కూడా ఆయా సమయ సందర్భాల ప్రత్యేకతలు, ఉద్యమ అవసరాలను బట్టి ఒక్కో రూపంలో కృషి ఎక్కువగా జరుగుతూ వచ్చింది. ఈ రెండేళ్ల కాలంలోనే చెప్పాలంటే - విశాఖపట్నం మహా సభల నాటికే ఆపరేషన్ గ్రీన్‌హంట్ ఉధృతంగా సాగుతున్నందువల్ల సహజంగానే విరసం గ్రీన్‌హంట్ వ్యతిరేక ప్రచార బాధ్యతను స్వీకరించాల్సి వచ్చింది. ఆ తర్వాత కొద్ది కాలంలోనే పరమ దుర్మార్గంగా విప్లవోద్యమ అగ్రనాయకుడు కామ్రేడ్ ఆజాద్, హేమచంద్రపాండేలను ప్రభుత్వం హత్య చేసింది. ఆ ఏడాది జూలై 4 విరసం ఆవిర్భావ సదస్సు ఈ అమరుల స్మృతిలో గ్రీన్‌హంట్ వ్యతిరేకంగా పెద్ద ఎత్తున హైదరాబాదులో జరిగింది. కామ్రేడ్ ఆర్.ఎస్.రావు, అరుంధతీరాయ్‌లాంటి వాళ్లు ఈ సదస్సులో ప్రసంగించారు. ఒక రకంగా అప్పటి నుంచి విరసం గ్రీన్‌హంట్ వ్యతిరేక కార్యక్రమాలను ముమ్మరం చేసింది. గ్రీన్‌హంట్ వ్యతిరేక కమిటీలో భాగస్వామ్య సంస్థగా విరసం సభ్యులు సాల్వాజుడుం నడుస్తున్న ప్రాంతాలకు, యుద్ధ ప్రాంతాలకు నిజనిర్ధారణకు వెళ్లారు. అక్కడి వాస్తవ స్థితిగతులను విశ్లేషిస్తూ రచనలు చేశారు. గ్రీన్‌హంట్ అనేది ఈ దేశ ప్రజలపై పాలకులు చేపట్టిన యుద్ధమని, ఆదివాసులు నిర్మిస్తున్న ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను ధ్వంసం చేయడానికే ఈ యుద్ధం జరుగుతోందనే వాదనను విరసం బలంగా తీసికెళ్లింది. కేవలం అమాయక ఆదివాసులపై దాడులు, ఆదివాసుల హక్కుల ఉల్లంఘన అనే చట్రానికి పరిమితమైతే యుద్ధ రహస్యం తెలియదని, దేశంలోని సహజ వనరులను కార్పొరేట్ శక్తులకు పాలకవర్గం ధారాదత్తం చేసే విధానాలు అమలు చేస్తున్న నేపథ్యంలో ఆదివాసులు విప్లవ మార్గంలో ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను నిర్మిస్తున్నారనే విషయాన్ని బలంగా విప్లవోద్యమం తర్వాత విరసమే బలంగా ప్రచారంలో పెట్టగలిగింది. అందువల్లే ఆదివాసులు అంతర్యుద్ధంలో తలపడవలసి వస్తోందని గట్టిగానే ప్రచారం చేయగలిగామనే సంతృప్తి ఉంది.

గ్రీన్‌హంట్‌లో భాగంగా జార్ఖండ్ విప్లవగాయకుడు జీతేన్‌మరాండీ, ఆయన మిత్రులకు ఉరిశిక్ష విధించడానికి వ్యతిరేకంగా రచయితల, కళాకారులు ఐక్య వేదిక నిర్మాణంలో విరసం క్రియాశీలంగా పనిచేసింది. ప్రజాకళామండలితో ఆ వేదిక నిర్వహణ బాధ్యతలు కూడా పంచుకొని జీతేన్‌కు, ఆయన సహచరులకు ఉరి శిక్ష రద్దేయ్యే వరకు రాష్ట్ర వ్యాప్తంగా అనేక రూపాల్లో నిరసన కార్యక్రమాలు చేపట్టింది. విరసం యూనిట్లు కూడా ఈ సందర్భంగా ఆయా జిల్లాలో క్రియాశీలంగా పని చేశాయి. కేవలం ఆందోళనాకార్యక్రమాలే గాక, ఉరిశిక్షల సందర్భంలో విశ్లేషణ వ్యాసాలు, కవిత్వం, పాటలు విరసం సభ్యులు రాశారు. కళాకారుల ఉరిశిక్షలు గ్రీన్‌హంట్‌లో భాగంగా చూడాలనే విరసం తన వాదనను శక్తివంతంగా సమాజంలోకి తీసికెళ్లగలిగింది. ఈ రెండేళ్లలో ఎక్కువ కాలం ఈ కమిటీ కార్యక్రమాలు నడిచాయి. కేవలం జితేన్ బృందం ఉరిశిక్షల రద్దు మాత్రమేగాక, భారత శిక్షాస్మృతి నుంచి ఉరిశిక్షను రద్దు చేయాలనే డిమాండ్ మీద విరసం పనిచేసింది. దేశవ్యాప్తంగా ఉరిశిక్షల వ్యతిరేక ఆందోళన ఫలితంగా జార్ఖండ్ కళాకారుల మీది కేసులను కోర్టు కొట్టేసింది. జితేన్‌మరాండి జైలు నుంచి బైటికి వస్తాడనుకోవడం వల్ల ఈ మహాసభలకు ఆయనను అతిథిగా ఆహ్వానించాం. కానీ ఆయన మీద ఉన్న ఇతర కేసుల్లో కోర్టు బెయిలు ఇవ్వకుండా వేధిస్తున్నందు వల్ల ఆయన ఇవాళ ఇక్కడికి రాలేకపోయారు.

కుల సమస్యపట్ల విరసంకు స్పష్టమైన దృక్పథం ఉన్నప్పటికి దాన్ని మరింత సమగ్రం చేసుకోడానికి ఫిబ్రవరి 12,13 - 2011న ఒక ఆంతరంగిక సమావేశం జరిగింది. దీని కోసం విరసం తొలి ప్రణాళికలో కులం గురించిన ప్రస్తావన దగ్గరి నుంచి, ఏఐఎల్ఆర్‌సీ సదస్సు పత్రాలు, విప్లవోద్యమ అవగాహనను తెలిపే రచనలు మరోసారి వివరంగా సభ్యులందరూ చదివి కుల సమస్యపై ఇంకా పెంచుకోవలసిన అవగాహన దిశగా చర్చ జరిగింది. ఈ రెండు రోజుల చర్చల వెలుగులో, గతంలో ఉన్న సంస్థ అధికార పత్రాల ఆధారంగా కుల సమస్యపై ఒక పత్రం తయారు చేయడానికి ఒక కమిటీ ఏర్పాటయింది. ఈ కమిటీ ఇప్పటికి ఐదు సమావేశాలు నిర్వహించి ప్రాథమిక అధ్యయనం పూర్తి చేసింది.

ఈ చర్చల సందర్భంలోనే 2011 మేలో కావలిలో రాష్ట్ర సాహిత్య పాఠశాల అస్తిత్వాలు - మార్క్సిజం అనే అంశంపై నిర్వహించాం. వేర్వేరు సాంఘిక అస్తిత్వాలను మార్క్సిస్టు శాస్త్ర పద్ధతిలో విశ్లేషించే ప్రయత్నం చేశాం. ఈ పాఠశాలలోని ప్రసంగాల్లో కొన్ని అరుణతారలో అచ్చయ్యాయి కూడా.

2011 జూలై 4న దండకారణ్య సాహిత్యోద్యమానికి ముప్పై ఏళ్లయిన సందర్భంగా ఒక రోజంతా పెద్ద ఎత్తున సదస్సు జరిగింది. అఖిల భారతస్థాయిలో విస్తరించి ఉన్న దండకారణ్య ఉద్యమం గురించి విశ్లేషించడానికి వక్తలు వచ్చారు. ఈ సదస్సుకు దండకారణ్య రచయితలు నాలుగు ప్రసంగ అంశాలపై పత్రాలు పంపించారు. వాటిని అచ్చువేసి విప్లవాభిమానులకు అందించాం. ఈ సందర్భంగా గ్రీన్‌హంట్ ఉత్పాతాలపై కామ్రేడ్ సాధన రాసిన పుస్తకం, కామ్రేడ్ అనూరాధ గాంధి స్త్రీవాద తాత్విక ధోరణులపై రాసిన పుస్తకం, కామ్రేడ్ శాఖమూరి అప్పారావు స్మృతిలో వచ్చిన పుస్తకం సదస్సులో ఆవిష్కరించబడ్డాయి.

ఈ రెండేళ్ల కాలంలో ఒక ముఖ్యమైన సమావేశం ఒకటి జరిగింది. కీలక దశలో భారత విప్లవోద్యమం - విశ్లేషణలు అనే అంశంపై విరసం ప్రచురించవలసిన ఒక పుస్తకం కోసం ..... కర్నూల్లో 13,14 ఆగస్టు 2011న సదస్సు జరిగింది. ఈ సదస్సులో విప్లవోద్యమానికి సంబంధించిన ఐదు అంశాలపై ఉద్యమ సన్నిహితులైన విశ్లేషకులు ప్రసంగించారు. చాలా లోతైన చర్చ జరిగింది.

ఇవిగాక విరసం సభ్యులు పోలవరం బాధిత ప్రాంతాలకు వెళ్లి

పరిశీలన చేశారు. నెల్లూరు జిల్లా క్రిష్ణపట్నం ప్రాంతంలో థర్మల్ విద్యుత్ కేంద్రాల విధ్వంసాన్ని తెలుసుకోడానికి విరసం బృందం మూడు రోజుల పాటు క్షేత్ర పరిశోధన చేసి వ్యాసాలు రాశారు. ఈ ప్రాంతానికి విరసం బృందం మూడేళ్ల కాలంలో మూడు సార్లు పర్యటించి సెజ్‌లు, థర్మల్ విద్యుత్ కేంద్రాల స్థాపన తర్వాత స్థానికుల జీవితాల్లో, ఆలోచనల్లో ఎట్లాంటి మార్పులు వస్తున్నదీ పునరావసం ఎలా అమలవుతోందీ అధ్యయనం చేసి రికార్డు చేయగలిగాం. క్షేత్ర పరిశీలనలో ఇది ఒక విలువైన అనుభవం.

ఇక ఈ రెండేళ్లలో ఉవ్వెత్తున సాగిన తెలంగాణ ఉద్యమంలో గతంలో వలే విరసం శక్తి మేరకు క్రియాశీలంగా పాలు పంచుకుంది. తెలంగాణ డిమాండ్‌పై, నిర్బంధంపై నిరసనగా సభలు సమావేశాలు జరిగాయి. తెలంగాణ సమస్యపై విరసం సంస్థాగత అవగాహనను ఇంకా ముందుకు తీసుకుపోవడానికి ప్రత్యేక సర్వసభ్య సమావేశం నిర్వహించుకున్నాం. మహబూబాబాద్ ఘటనపై విరసం సభ్యులు కవిత్వ సంకలనం అచ్చేశారు.

తెలంగాణ ఉద్యమంలో భాగంగా సాగిన సకల జనుల సమ్మెలో పాల్గొనడమే గాక సంఘీభావంగా విరసం కరపత్రాన్ని ప్రచురించింది. ఈ సమ్మెలో పాల్గొన్నందుకు డాక్టర్ చెరుకు సుధాకర్ మీద పి.డి. యాక్టు పెట్టడాన్ని నిరసిస్తూ మొత్తంగానే తెలంగాణపై నిర్బంధం, అప్రజాస్వామిక అణచివేత చట్టాల రద్దు కోరుతూ సభ నిర్వహించాం.

ఈ దశాబ్దంలో వచ్చిన అనేక కొత్త సమస్యల్లో యురేనియం తవ్వకం ఒకటి. కడప జిల్లాలో యురేనియం తవ్వకాలు మొదలయ్యాక విరసం సభ్యులు క్రియాశీలంగా నిరసన ఉద్యమంలో పాలు పంచుకుంది. యురేనియం విపత్తుపై, కర్నూలు జిల్లాలో జిందాల్ సిమెంట్ ఫ్యాక్టరీ విధ్వంసంపై క్షేత్ర పరిశీలన చేసి, విశ్లేషణ వ్యాసాలు రాశారు.

విరసం చిరకాల మిత్రుడు కామ్రేడ్ ఆర్.ఎస్.రావు అమరత్వం తర్వాత ఆయన సిద్ధాంత కృషి మీద ఒక రోజంతా సదస్సు నిర్వహించాం. ఢిల్లీ, ఒడిషా, హర్యానా, బీహార్ ప్రాంతాల నుంచి సామాజిక విశ్లేషకులు హాజరయ్యారు. ఈ సదస్సులో ఆర్‌ఎస్‌రావు అర్ధ వలస - అర్ధ భూస్వామ్య సిద్ధాంత రచనలపై లోతైన విశ్లేషణలు వెలువడ్డాయి.

సంస్థ ఈ రెండేళ్లలో చేపట్టిన ఈ రాజకీయ, సాహిత్య, సిద్ధాంత కార్యక్రమాలు, ఆందోళనలతో పాటు రచన కూడా విస్తృతంగా సాగింది. విప్లవ సాహిత్యంలోని వైవిధ్యాన్ని, ప్రమాణాలను ఎత్తిపట్టే రచనలు విరసం సభ్యులు రాశారు.

చత్తీస్‌గఢ్‌లో సాల్వాజుడం దాడులను, గ్రీన్‌హంట్ ఆపరేషన్ నేపథ్యాన్ని, గ్రీన్‌హంట్‌లో భాగంగా జరుగుతున్న విధ్వంసాన్ని, విప్లవ జనతన సర్కార్ గురించి విలువైన పుస్తకాలు అచ్చేసింది. అమర వీరుల జీవిత చరిత్రలు, స్మృతి రచనలు, వారి సృజనాత్మక రచనలు పుస్తకాలుగా ప్రచురించింది. ముప్పై ఏళ్ల దండకారణ్య సాహిత్యోద్యమంపై సమగ్రమైన పుస్తకాన్ని అచ్చేసింది. తెలంగాణ ఉద్యమాన్ని విశ్లేషిస్తూ ప్రజా తెలంగాణ అనే వ్యాస సంకలనాన్ని, తెలంగాణ కవిత్వం పేరుతో కవితా సంకలనాన్ని విరసం సభ్యుల రచనలతో అచ్చేసింది.

ఈ రెండేళ్లలో విరసం సభ్యులు రాసిన రచనలకు అరుణతార ప్రధాన వేదికకాగా ఇతర ప్రజా ఉద్యమ పత్రికల్లో, దిన పత్రికల్లో అనేక విశ్లేషణాత్మక రచనలు చేశారు. కవిత్వం, కథ, నవల, సాహిత్య విమర్శ, అనువాదం తదితర ప్రక్రియల్లో విశేష కృషి చేశారు. ఈ సభల సందర్భంగా కొన్ని కొత్త పుస్తకాలను ఆవిష్కరించుకోబోతున్నాం. విప్లవోద్యమ ప్రచారం, విశ్లేషణా రచనలతోపాటు, అల్లకల్లోలమై పోతున్న మానవజీవితాన్ని విప్లవ దృక్పథంతో చిత్రించారు.

కావలి సాహిత్య పాఠశాలలో ఆవిష్కరించిన ఇరవై దాకా పుస్తకాలు, ఈ సభల్లో ఈ రోజు రేపు ఆవిష్కరించుకొనే పుస్తకాలు విరసం సాహిత్య సృజన శక్తికి నిదర్శనం. కథలు, కవిత్వం, నవల, సాహిత్య విమర్శ ప్రక్రియల్లో ఈ అచ్చయిన పుస్తకాలేగాక అరుణతారలో, ఇతర పత్రికల్లో ఈ రెండేళ్లలో అచ్చయిన సృజనాత్మక సాహిత్యం, విమర్శ, సామాజిక విశ్లేషణ అంతా కలిసి విరసం సాహిత్య కృషిలో భాగం. ఈ సాహిత్యంలో కొత్త స్వరాలు, కొత్త జీవన తలాలు, కొత్త వ్యక్తీకరణలు, కొత్త విశ్లేషణ పరికరాలు కనిపిస్తాయి. విప్లవ రచయితల సంఘంగా విప్లవానికి నిబద్ధమై రాజకీయ, సామాజిక రంగాల్లో కార్యకర్తగా పనిచేస్తూనే మౌలికంగా రచయితల సంఘం కాబట్టి సృజనాత్మక ప్రక్రియల్లో పురోగమిస్తోందనడానికి ఈ సాహిత్యమంతా ఉదాహరణే.

ఈ రెండేళ్లలో అజ్ఞాత విప్లవ రచయితలు రాసిలోనూ, గుణంలోనూ విలువైన సాహిత్యం రాశారు. ఇదంతా విప్లవ సాహిత్యానికి, విప్లవ రచయితల సంఘం కృషికి గొప్ప చేర్పు. ఆ ఆ మాటకొస్తే తెలుగు సాహిత్యం మొత్తంలోనే చాలా విలువైన సృజనాత్మక సాహిత్యం, విశ్లేషణా రచనలు అజ్ఞాత విప్లవ రచయితలు రాస్తున్నారు. ఈ సాహిత్యమంతా అరుణతార ద్వారా పాఠకులకు చేరుతోంది.

అరుణతార ఈ రెండేళ్లలో కూడా క్రమబద్ధంగా రాకపోయినా, ఏడాదికి దాదాపు 600 పేజీల చొప్పున సాహిత్యం పాఠకులను అందివ్వగలిగాం. సగటున నెలకు 50 పేజీల సాహిత్యం ఇచ్చినట్లే. పత్రికా నిర్వహణలో ఆర్థిక, మానవ వనరుల కొరత తప్ప రచనలకు కొరత లేదు. విరసం సభ్యుల రచనలతోపాటు, దండకారణ్య రచయితల సాహిత్యం , సోదర ప్రజాస్వామిక రచయితల తోడ్పాటు వల్ల అరుణతార శక్తివంతమైన విప్లవ సాహిత్య పత్రికగా పాఠకులపై ప్రభావం వేయగలుగుతోంది. ఈ రెండేళ్లలో అరుణతార ప్రతి సంచికా గ్రీన్‌హంట్ అంతర్యుద్ధాన్ని కేంద్రంగా చేసుకొని సాహిత్య, సాంస్కృతిక, రాజకీయ విషయాల కలయికగా తీర్చిదిద్దినట్లు అర్థమవుతుంది.

గ్రీన్‌హంట్ రెండో దశకు చేరిన ఈ దశలో సహజంగానే ఈ మహాసభల ఇతివృత్తం గ్రీన్‌హంట్ ఆపరేషన్ - ప్రత్యామ్నాయ అభివృద్ధి ఎంపిక చేసుకున్నాం. దేశంలో అంతర్యుద్ధం నడుస్తున్న ఈ తరుణంలో రచయితలు, బుద్ధిజీవులు ఆదివాసుల ప్రత్యామ్నాయ సామాజిక ప్రయోగం పక్షాన గొంతెత్తి నినదించమని, చేయీ చేయీ కలిపి ఉద్యమిద్దామని పిలుపునిస్తున్నాం. ఈ మహా సభల స్ఫూర్తితో ఈ రెండేళ్లపాటు గ్రీన్‌హంట్ వ్యతిరేక రాజకీయ సాహిత్య సాంస్కృతిక ప్రచారం కేంద్ర కర్తవ్యంగా విరసం స్వీకరిస్తోంది. ఈ కృషిని అందరం కలిసి కొనసాగించినప్పుడే దండకారణ్య ప్రయోగాన్ని కాపాడుకోగలమని విజ్ఞప్తి చేస్తున్నాం.



# గ్రీన్‌హంట్ వ్యతిరేక చైతన్యం ప్రతిఫలించిన విరసం 23వ రాష్ట్ర మహాసభలు

- బాసిత్

విరసం 23వ రాష్ట్ర మహాసభలు మార్చి 10, 11 తేదీల్లో కర్నూలులో కామ్రేడ్ కిషన్‌జీ హాలు (లయన్స్ క్లబ్ కమ్యూనిటీ హాలు, స్టేట్ బ్యాంక్ ఎంప్లాయీస్ కాలని)లో ఆర్.ఎస్. రావు వేదిక మీద ప్రత్యామ్నాయ అభివృద్ధి-ఆపరేషన్ గ్రీన్‌హంట్ అంశంగా కేంద్రంగా జరిగాయి.

10వ తేదీ ఉదయం 10.30 గంటలకు పతాకావిష్కరణ జరిగింది. ఎర్ర జెండాను గుంటూరు జిల్లా విప్లవోద్యమంలో పని చేస్తూ అమరుడైన కామ్రేడ్ జీవన్(వీరేష్) సోదరుని కొడుకు రాజు ఆవిష్కరించాడు. వీరేష్ కర్నూలు జిల్లా ఆదోని దగ్గర కడితోట గ్రామంలో పుట్టాడు. విరసం జెండాను కామ్రేడ్ కొండల్‌రెడ్డి సహచరి మాధవి ఆవిష్కరించింది. కొండల్‌రెడ్డి పటేల్ సుధాకరరెడ్డితోపాటు బూటకపు ఎన్‌కౌంటర్లో అమరుడయ్యాడు. ఆ తర్వాత అమరుల స్థూపాన్ని వరంగల్ విప్లవోద్యమంలో అసువులు బాసిన ఆదివాసీ కామ్రేడ్ సింగన్న తల్లిదండ్రులు లక్ష్మి, రామయ్య ఆవిష్కరించారు. ప్రజాకళామండలి కళాకారులు ఎర్రజెండా మీద, అమర వీరుల మీద పాటలు పాడారు.

కా. చెంచయ్య అధ్యక్షతన మొదటి సెషన్ ప్రారంభమైంది, గ్రీన్‌హంట్ రెండోదశకు చేరిన ఈ సందర్భంలో విరసం తన 23వ మహా సభలు నిర్వహించుకుంటున్న నేపథ్యాన్ని చెంచయ్య వివరించారు. తర్వాత ముఖ్య అతిథి కామ్రేడ్ అపర్ణమరాండీ ప్రారంభోపన్యాసం చేశారు. అపర్ణ కామ్రేడ్ జితేన్‌మరాండి సహచరి. జితేన్‌కు గిరిధి సెషన్స్ కోర్టు ఒక తప్పుడు కేసులో ఉరిశిక్ష విధించగా, దేశవ్యాప్త ఆందోళన తర్వాత ఆ రాష్ట్ర హైకోర్టులో కేసు కొట్టివేయబడింది. అపర్ణ జార్ఖండ్ విస్థాపన వ్యతిరేక ఆందోళనలో పని చేస్తున్న కార్యకర్త, కళాకారిణి.

ఆమె మాట్లాడుతూ "అటవీ వనరులను కబళించడానికి ఆదివాసీ జీవితాలపై రాజ్యం ఉక్కుపాదం మోపి, విప్లవకారులందరిపై దమనకాండ పెంచింది. జార్ఖండ్ వనరుల విధ్వంసానికి వ్యతిరేకంగా గజ్జెకట్టి, గళం విప్పి పాడినందుకు జితేన్, ఆయన ముగ్గురు సహచరులపై రాజ్యం కట్టి ఉరిశిక్ష విధించింది. పెద్ద, పెద్ద కంపెనీలకు ఆశ్రయం ఇవ్వడానికి అక్కడి ముఖ్యమంత్రి, బడా బాబులందరితో కలిసి జార్ఖండ్ ప్రజలపై నిప్పుల నిర్బంధం కురిపించడం మొదలుపెట్టారు. ప్రగతి పేర అపార సంపద మీద దాడి జరుగుతోంది. అందుకే అక్కడి ప్రజలు 'మావోవాదీల' అండతో నూతన సమాజాన్ని నిర్మించుకుంటున్నారు" అని ఆమె అన్నారు.

తదుపరి సెషన్‌లో కార్యదర్శి పాణి గత రెండేళ్ల సంస్థ నివేదిక సభకు వినిపించారు. ఈ రెండేళ్లలో విరసం అనేక సమస్యలపై క్షేత్ర పరిశీలనలు చేసి విశ్లేషణలు అందించిందని, కథల వర్క్‌షాపులు నిర్వహించిందని, నిర్బంధానికి వ్యతిరేకంగా సభలు, ఆందోళనలు చేపట్టిందని వివరించారు. ముఖ్యంగా ఆపరేషన్ గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా సాహిత్యోద్యమాన్ని నడిపిందని వివరించారు. సృజనాత్మక సాహిత్య ప్రక్రియల్లో కృషి చేస్తూనే సామాజిక రాజకీయ రంగాల్లో బుద్ధిజీవుల పాత్ర పోషించిదని సంస్థ కార్యక్రమాలను విశ్లేషించారు. యుద్ధం తీవ్రతరమైన నేపథ్యంలో ఈ సభల నుంచి వచ్చే మహా సభల దాకా గ్రీన్‌హంట్ వ్యతిరేక ఆందోళనను సంస్థ తన సాహిత్య, రాజకీయ కేంద్ర కర్తవ్యంగా స్వీకరిస్తోందని ప్రకటించారు. అనంతరం పుస్తకావిష్కరణలు జరిగాయి. కళాకారులు పాటలు పాడారు.

భోజన విరామానంతరం ఉదయమిత్ర నిర్వహించిన సెషన్‌లో 'ఆదివాసీ ప్రాంతాల్లో వనరుల దోపిడి' గురించి వరలక్ష్మి మాట్లాడారు.

సభా వేదిక మీద ఏర్పాటు చేసిన బ్యానర్‌లో అడవి గాయపడిన దృశ్యాన్ని, ప్రస్తావిస్తూ 'అడవుల్ని విధ్వంసం చేస్తూ, ఆదివాసీ ప్రాంత వనరుల్ని సామ్రాజ్యవాదం దోపిడి చేస్తున్నదని' ఆమె చెప్పారు. పెట్టుబడి సామ్రాజ్యవాద దోపిడీగా మారిన తీరును ఆమె కళ్ళకు కట్టారు. 'ప్రపంచీకరణ సూత్రం గ్లోబల్ కుగ్రామం. భూగోళం మీద ఇంకా దోపిడికి గురికాని దేశాలేవైనా ఉంటే వాటిని వెతుక్కొని దోపిడి చెయ్యడమే వాళ్ళ పని అన్నారు. బ్రిటిష్ వలస ముగిసి, భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని ఒక చెప్తున్నారు. ఇప్పుడు ఇక్కడ వాళ్ల సైనిక స్థావరాల అవసరం లేకుండానే దళారీ ప్రభుత్వాల సహకారంతో అదే దోపిడి కొనసాగుతోంది. అదే ప్రపంచీకరణ అని చెప్పారు. 'రాజకీయ నాయకులకు కార్పొరేటు సంస్థలున్నాయనే దశ నుండి కార్పొరేటు సంస్థల అధినేతలే రాజకీయ నాయకులయ్యారని అన్నారు. వేదాంత కంపెనీలో షేర్లున్న చిదంబరమే రాజకీయనాయకుడుగా, హోం మినిష్టరుగా అవతారమెత్తి ఇంతకుముందు రెడ్ కారిడార్ అనబడే దండకారణ్యాన్ని ఇప్పుడు ఎం.ఓ.యూ.ల కారిడార్ చేస్తానని భారత దళారీ ప్రభుత్వం తరపున మన్మోహన్ సింగ్‌తోపాటు సంతకం చేసాడని ఆమె వివరించారు. లక్షల కోట్ల విలువజేసే వనరుల దోపిడి కోసం బార్డర్ సెక్యూరిటీ ఫోర్స్‌నంతా మధ్య భారతానికంతా, దండకారణ్యమంతా భారత ప్రభుత్వం తెచ్చి 2009 సెప్టెంబర్ నాటికి గ్రీన్‌హంట్ పేరు పెట్టుకొని ప్రజలపై యుద్ధానికి దిగిందని ఆమె అన్నారు.

'వనరుల్ని వెలికి తీస్తే అభివృద్ధి జరుగుతుందా లేక ఆఫ్రికాలోని 'రువాండా' జాతుల పోరాటంలో మాదిరిగా వనురుల తొలగింపుతో 8 లక్షల మంది చనిపోయినట్లు భారత్‌లో కూడా జరగనుందా? అని ప్రశ్నించారు.

బాసిత్ నిర్వహించిన సెషన్‌లో 'గ్రీన్‌హంట్ విధ్వంస రూపాలు' అనే అంశంపై పౌరహక్కుల సంఘం నాయకుడు ఆర్. రాజానందం ప్రసగించారు.

భారత సమాజం మీద సామ్రాజ్యవాదం చేస్తున్న యుద్ధమే

గ్రీన్‌హంట్ అని ఆయన అన్నారు. గ్రీన్‌హంట్ వివిధ దశలు వివరిస్తూ ఆదివాసీల విస్థాపన, ఆదివాసీల జీవన హననమే గ్రీన్‌హంట్ లక్ష్యమని అన్నారు. సల్వాజుడుం కన్నా ముందరి విధ్వంసక రూపాల్ని ఆయన వివరంగా పేర్కొంటూ సాల్వాజుడుం పేరుతో జరిగిన అకృత్యాలను, ఇప్పుడు గ్రీన్‌హంట్ పేరుతో జరుగుతున్న యుద్ధ విధ్వంసాన్ని విశ్లేషించారు.

తొలిరోజు సాయంకాలం జరిగిన కవి సభను క్రాంతి, ఉదయభాను నిర్వహించారు. ఈ సభలో 20 మందికిపైగా కవులు గ్రీన్‌హంట్ వ్యతిరేక కవితలు, కిషన్‌జీ స్మృతి కవితలు, తెలంగాణ తదితర సమస్యలపై కవిత్వం చదివారు.

రెండోరోజు మార్చి 11న తొలి సెషన్ సుదర్శన్ నిర్వహణలో ప్రజా కళా మండలి, ఇతర కళాకారుల సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. ఈ సెషన్‌లో ప్రధానంగా ఉదయ మిత్ర నాటకంగా మలిచిన కన్నడ నవల 'చిరస్మరణ'ను ప్రజా కళా మండలి ప్రదర్శించింది. అమరుల బంధుమిత్రుల సంఘం సభ్యుల, జార్ఖండ్ అభేన్ కళాకారుల పాటలు సభికుల్ని ఉత్తేజపరిచారు.

రెండో రోజు రెండో సెషన్ నల్లూరి రుక్మిణి నిర్వహణలో జరిగింది. ఈ సెషన్‌లో 'దండకారణ్య అభివృద్ధి నమూనా-ప్రగతి భావన' అనే అంశంపై పాణి ప్రసంగం చేశారు.

రుక్మిణి తెలంగాణ సాయుధ పోరాటానికి, దండకారణ్య ఉద్యమానికి గల ప్రధాన తేడాను వివరిస్తూ దండకారణ్యం ఎందుకు స్పెషల్ జోన్ అయ్యిందో విడమరిచారు. 'తెలంగాణ సాయుధ పోరాట సందర్భంలో లక్షల ఎకరాల భూముల్ని ప్రజలు స్వాధీనం చేసుకున్నప్పటికీ ఒక ప్రత్యామ్నాయ జీవన విధానాన్ని ఆ పోరాటం చూపించలేదని, అదే దండకారణ్య ఉద్యమం ప్రత్యామ్నాయ జీవితాన్ని ఒక నమూనాలాగ ప్రపంచానికి చూపిస్తున్నదని, ఇదే ప్రధాన తేడా' అని ఆమె చెప్పారు.

పాణి మాట్లాడుతూ ఆచరణ యోగ్యమైన ప్రయోగమే మార్క్సిస్టు సిద్ధాంతానికి గీటురాయి' అని ప్రారంభించి అటువంటి ఆచరణాత్మక ప్రయోగం దండకారణ్యంలో జరిగిందని అన్నారు. 'అట్లా అర్థం చేసుకోవడానికి 'దండకారణ్య అభివృద్ధి నమూనా-ప్రగతి భావన' అంశాన్ని నాలుగు భాగాలుగా 1. దండకారణ్య ప్రత్యామ్నాయ వివరాలు, 2. అభివృద్ధి, 3. ప్రగతి 4. గ్రీన్‌హంట్ ఆపరేషన్ సందర్భంగా ప్రత్యామ్నాయ అభివృద్ధి చర్చ అనే చట్రంలో తన ప్రసంగం చేశారు.

దండకారణ్య ప్రయోగంలో 1. హేతుబద్ధత, 2. వ్యక్తి నిర్మాణం-స్వేచ్ఛ ఇమిడి ఉన్నాయని, ప్రగతి అంటే ఉన్నదాని కంటే మెరుగవడం అంటే సైద్ధాంతికంగా సరిపోదని, ముఖ్యంగా మార్క్సిస్టులకు అది అసలు సరిపోదని అన్నారు.

కా. అరుణ్ నిర్వహణలో కూర్మనాథ్ 'సామ్రాజ్యవాదం ప్రపంచవ్యాప్త నిరసనలు' అంశంపై మాట్లాడారు.

ప్రపంచంలోని సమస్యలన్నింటికి ఒక్క అమెరికానే కారణమని, ప్రపంచంలోని అన్ని దేశాలకు అమెరికానే ఆయుధాలు అమ్ముతోందని మళ్ళీ శాంతిజపం చేస్తూ ప్రపంచమంతా యుద్ధాల్ని నిర్వహిస్తోందని ఆయన అన్నారు. '69'లో వియత్నాంతో, '70'లో చిలీతో అమెరికా యుద్ధాలు చేసిందని, ఇరాన్ మీదనైతే ఎప్పుడెప్పుడు యుద్ధం చేద్దామా

**సభలలో సాంస్కృతిక ప్రదర్శనలు**

**10 మార్చ్ 2012న**

1. ప్రజా సాంస్కృతిక అమరవీరుల పాటలు
2. ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక పాటలు
3. రాజ్యహింస వ్యతిరేక పాటలు

**11 మార్చ్ 2012**

**1. 'చిరస్మరణ' (నాటకం)**

1943 ప్రాంతంలో కర్నాటక రాష్ట్రంలో కయ్యూరు గ్రామంలో దళిత, బలహీన వర్గాల ప్రజలు భూమికోసం, భుక్తి కోసం, విముక్తి కోసం జమిందారీ బ్రిటిషు పాలనకు వ్యతిరేకంగా జరిపిన పోరాటం. యదార్థగాథ ఆధారంగా.

**2. 'మా ఊళ్ళో మా రాజ్యం' (వీధి నాటకం)**

అడవి తల్లి ఒడిలో ఆదివాసుల జీవితం అడవి ఖనిజ సంపద కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆదివాసుల జీవితాల విధ్వంసం చేస్తున్న ఆపరేషన్ గ్రీన్‌హంట్. దానికి వ్యతిరేకంగా ఆదివాసుల పోరాటాలు గురించి తెలియజేస్తుంది.

**విరసం మహాసభలలో**

**పాల్గొన్న ప్రజా కళామండలి (పి.కె.ఎం.) సభ్యులు**

జాన్ (అధ్యక్షులు); కోటి (కార్యదర్శి); నాగేశ్వరరావు (సహాయ కార్యదర్శి); ప్రభాకర్ (కోశాధికారి); రాణి (కన్వీనర్) గుంటూరు జిల్లా; నయన, స్టాలిన్ గుంటూరు జిల్లా, చిన రామచందర్ (కన్వీనర్), రాములు, యాదగిరి, సత్తెమ్మ మహబూబ్‌నగర్ జిల్లా; యాదగిరి (కన్వీనర్) మెదక్ జిల్లా; శ్రీనివాస్ (కన్వీనర్) ప్రకాశం జిల్లా; గోపి, నరసింహ, క్రాంతి ప్రకాశం జిల్లా; వెంకటేష్, రాణి, శ్రీను, విజయ, నాగన్న, బాలస్వామి, హైదరాబాద్.

అన్నట్లు యుద్ధోన్మాదంతో అమెరికా ఉవ్విళ్లూరుతోందని ఆయన అన్నారు.

ఉత్తర ఆఫ్రికా దేశాలైన ట్యునీషియా, ఈజిప్టులలో ధరల పెరుగుదల కారణంగా ప్రభుత్వ వ్యతిరేకత పెరిగిందని, అల్లర్లను తట్టుకోలేక ఆ దేశాధినేత అమెరికా మిత్ర దేశమైన సౌది అరేబియాకు పారిపోయాడని అన్నారు. అట్లాగే అమెరికాకు ఊడిగం చేసే ఈజిప్టు ప్రధాని హోస్నిముబారక్ అమెరికా కనుసన్నలలోనే తలదాచుకున్నాడని ఆయన అన్నారు.

అయితే ఇతరుల ఇళ్లు చక్కదిద్దేందుకు తగుదునమ్మా అనుకుంటూ ముందుకురికి చిచ్చుపెట్టే అమెరికా స్వంత ఇంటిని చక్కదిద్దుకోలేకపోతోందని వాల్‌స్ట్రీట్ గొడవను ఉదహరించారు. అమెరికాలో దాదాపు 100 నగరాల్లో యువకులు ప్రదర్శనలు చేసి సంచలనాలు సృష్టించినా 200 నగరాల్లో రకరకాల ఉద్యమాలు జరిగినా యూరప్ మీడియా పట్టించుకోదని అన్నారు.

కొన్ని ఉద్యమాలు గాంధీగిరి చేస్తే చాలన్నట్లు ఉంటాయని లెనిన్‌లాగ పోరాటాలు వద్దన్నట్లుంటాయని, అట్లాంటి నిర్మాణాలు లేని ఉద్యమాలు, ఆ తర్వాత కూలిపోతాయని, అందుకే ప్రజలకు

మోసం జరుగుతోందని అన్నారు. 70 ఏళ్ళ క్రితం సామ్రాజ్యవాదం నశించాలన్న ఆశయాన్ని కమ్యూనిస్టు పార్టీ స్వీకరించిందని, అదే నిర్మాణయుత ఉద్యమాలకుండే భవిష్యత్ దృష్టి అని అన్నారు.

దండకారణ్యాన్ని చూస్తే అవి అరబ్ ప్రాంతంకంటె విశాలమైందని, అక్కడ ఓ ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా మావోయిస్టు పార్టీ ఆధ్వర్యంలో జరుగుతున్నదని ఆయన చెప్పారు.

అవినీతి మీద యుద్ధం చేస్తున్నానంటున్న అన్నా హజారే దానికి మూలమైన వ్యవస్థను మార్చాలంటే ఒప్పుకోడని, అటువంటి ప్రదర్శనలకు ప్రాధాన్యత ఇచ్చే దళారీ మీడియా ప్రపంచవ్యాప్తంగా జరిగిన అన్ని ప్రదర్శనల కంటే మిన్నగా మన దగ్గర జరిగిన మిలియన్ మార్చ్‌ను గుర్తించదని అన్నారు. అదే ట్యునీషియాలో జరిగితే దాన్ని గొప్పగా చూపిస్తారని చెప్పారు.

ఈ సెషన్ నిర్వహించిన కామ్రేడ్ అరుణ్ సామ్రాజ్యవాద అవసాన దశ పీడిత ప్రజల ఆశ అని, అమెరికాలో వెల్లువెత్తిన అలజడికి నిర్మాణాలు లేవని, అదే భారతదేశానికి ఒక విప్లవ పార్టీ ఆధ్వర్యంలో ప్రజా పోరాటాల నిర్మాణం ఆలంబనగా ఉందని, దానికి మద్దతు కూడగట్టాల్సిన అవసరం ఉందని అన్నారు.

కామ్రేడ్ అరసవెల్లి కృష్ణ నిర్వహించిన సెషన్‌లో 'దండకారణ్యంలో విప్లవ కళాసాహిత్య సృజన' అంశంపై కామ్రేడ్ రాంకి మాట్లాడారు.

ముప్పై రెండేళ్ళ క్రితం, 80లో ఉత్తర తెలంగాణ నుండి 'పెద్ది శంకరన్న పోరెల్లి పోంగో...' అనే గేయంతో ప్రారంభమైన దండకారణ్య సాహిత్య సృజన విశాలమైన పోరాట కాన్వాస్ మీద చరిత్రను రికార్డ్ చేసిందని అన్నారు. దండకారణ్య సాహిత్యోద్యమకారులు ప్రేమ్‌చంద్, అడివి బాపిరాజు లాంటి పాత తరాన్ని చదివినవారు, గద్దర్ పాటలతో, విరసం ఉపన్యాసాలతో ప్రేరణ పొందినవారు కారని దండకారణ్య సాహిత్యోద్యమ చరిత్రలో రాసుకున్న విషయాన్ని గుర్తు చేశారు.

మనిషికి, మనిషికి ఉండే ఘర్షణను భూస్వామ్యం ఐక్యతగా కొనసాగిస్తే, మార్క్సిజం దాన్ని ఘర్షణ కేంద్రంగా పరిష్కరిస్తుందని అన్నారు. దండకారణ్య సాహిత్య సృజన ఎందుకు విజయవంతం అవుతున్నదంటే- ఆ సాహిత్యం స్టాలిన్ చెప్పినట్లు రూపంలో జాతీయతను-సారంలో విప్లవాత్మకతను తీసుకుని ముందుకు సాగుతోంది.. మావో చెప్పినట్లు 'ప్రజల్నుంచి-ప్రజలకు' అనే సిద్ధాంతాన్ని ఆచరించి చూపుతోందని అన్నారు.

తొలినాళ్లలో ఆంధ్రప్రదేశ్‌తోపాటు మహారాష్ట్రలోని మూడు జిల్లాల్లో ఉన్న ఉద్యమం నేడు మహారాష్ట్ర, చత్తీస్‌గడ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, బీహార్, మధ్య ప్రదేశ్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల్లోకి పాకి ఈశాన్య, దక్షిణ భారతమంతా విప్లవోద్యమం విస్తరించిందని, ఆ అన్ని ప్రాంతాల్లో సాయుధ పోరాటం జరుగుతున్నట్లే సాహిత్యోద్యమం నిర్మాణమైందని వివరించారు.

ఇటీవల భారత దేశానికి వచ్చిన స్వీడిష్ మార్క్సిస్టు మేధావి యాన్‌మిర్డాల్ మావోయిస్టు నాయకత్వంలోని ఆదివాసి ప్రజలతో సంభాషించారని, రష్యా, చైనాల తరువాత భారతదేశ విప్లవోద్యమమే ప్రపంచానికి దిక్సూచిగా నిలవనున్నదని అన్నారని గుర్తు చేశారు. అంతేకాదు భారతదేశ ప్రజలతోపాటు ప్రపంచవ్యాప్త పీడిత ప్రజానీకం ఇక్కడ సాగుతున్న విప్లవోద్యమానికి బాసటగా నిలిచి ఆ ఉద్యమాన్ని కాపాడుకోవాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పిన సంగతిని గుర్తు చేస్తూ ఇప్పుడు రచయితలు, బుద్ధి జీవుల కర్తవ్యం విప్లవోద్యమాన్ని ఎత్తిపట్టడమేనని అన్నారు. దండకారణ్య సాహిత్యం తొలినాళ్ళలో సృజన, అరుణతారలలో అచ్చయ్యాయని, ఇప్పుడు అరుణతార దండకారణ్య సాహిత్యాన్ని నిరంతరం వెలుగులోకి తెస్తున్నదని అన్నారు.

చివరి సెషన్‌ను కా. కోటయ్య నిర్వహించగా 'యుద్ధ సమయంలో బుద్ధిజీవుల పాత్ర'పై కామ్రేడ్ కాశీం మాట్లాడారు.

యుద్ధ సమయంలో బుద్ధిజీవులు గతంలో ఎటువంటి పాత్ర పోషించారో చరిత్రలోంచి అనేక ఉదాహరణలతో వివరించారు. వలసవాదానికి వ్యతిరేకంగా, తెలంగాణ సాయుధపోరాట కాలంలో జరిగిన అన్ని ఉద్యమాల్లో రచయితలు, కళాకారులు క్రియాశీల పాత్ర పోషించారని గుర్తు చేశారు. ఇప్పుడు నిర్బంధం యుద్ధంగా మారిందని, ఈ యుద్ధ సమయంలో కళాకారులు, రచయితలు ప్రజా యుద్ధం పక్షాన నిలబడాలని పిలుపు నిచ్చారు.

మహాసభల చివర్లో బహిరంగ సభకు కొత్త కార్యదర్శి కామ్రేడ్ పి. వరలక్ష్మి అధ్యక్షత వహించారు.

నూతన కార్యదర్శి తన అధ్యక్షోపన్యాసంలో- మేం యుద్ధం గురించే మాట్లాడుతాం. అది మావోయిస్టుల కోసమో, ఆదివాసీల కోసమో కాదు. భారతదేశ భవిష్యత్తు కోసం అని ఆమె అన్నారు. సోనిసోరి సంఘటన ఎంతటి అమానుషమో వివరిస్తూ, ఈ రోజు సామాన్యులకు పోరాటం తప్ప మరోమార్గం లేదన్నారు.

వక్త కామ్రేడ్ సి.ఎస్.ఆర్. ప్రసాద్ మాట్లాడుతూ 'కొంతమంది రచయితలు అన్నట్లు విరసం ఖచ్చితంగా రాజకీయాలను మాట్లాడే సాహిత్య సంస్థ. రాజకీయాలు మాకు లేవు అని చెప్పేవాళ్ళు చేస్తున్నవి, కచ్చితంగా బూర్జువా రాజకీయాలే. విరసం నిషేధ కాలంలో నిర్బంధంలో, రాజ్యం పెట్టిన కేసుల సందర్భంలో రాజకీయాలు మాట్లాడమని చెప్పలేదు. రాజకీయ విశ్వాసం కచ్చితంగా కలిగి ఉంటామని చెప్తూనే అన్నింటిని తిప్పికొట్టాం అని' గుర్తు చేశారు.

విరసం బలహీనపడిందని విమర్శలు చేస్తున్న బూర్జువా మేధావులకు సమాధానంగా, విరసం నవయవ్వన తేజంతో దూసుకుపోతుందని చెప్పడానికి, యువ శాస్త్రవేత్త వరలక్ష్మి కార్యదర్శిగా ఎన్నికవ్వడం ఒక సూచిక అన్నారు. అట్లాగే మహాసభల వేదిక మీద ఇరవైకి పైగా అన్ని ప్రక్రియల్లో ఆవిష్కరించుకోవడమే నిదర్శనం అన్నారు.

కామ్రేడ్ కళ్యాణరావు మాట్లాడుతూ 'వేదాంత కంపెనీ వేదాంతం చెప్పే సంస్థ కాదని, వేదకాలం నుండి ఇప్పటిదాక నేలగర్భంలో దాగియున్న బాక్సైట్, మాంగనీసు, ఇనుము మొదలైన విలువైన ఖనిజ సంపదనంతా దోచుకుంటున్న సంస్థ అని' అన్నారు. 'దేశ సంపదనంతా కార్పొరేట్ బహుళజాతి సంస్థలకు ఈ దేశ పాలకులు దోచిపెడుతూ ఉంటే, అదంతా దేశ ప్రజలకు దక్కాలని చెప్పే ఏకైక పార్టీ మావోయిస్టు పార్టీ అని' ఆయన అన్నారు.

'గ్రీన్‌హంట్ పేరుతో ప్రభుత్వం చేస్తున్న యుద్ధం మావోయిస్టుల మీద కాదని', అది ఆదివాసుల మీద, అంటే ప్రజల మీద యుద్ధం అని స్పష్టం చేశారు. మావోయిస్టులు హింసావాదులు కాదని, ఈ దేశంలో హింసావాదులెవరైనా ఉన్నారంటే, వాళ్లు గాంధేయవాదులని

## సభలలో ఆవిష్కరించిన పుస్తకాలు

| క్ర.సం. | పుస్తకం-రచయిత | ప్రచురణ | ఆవిష్కరించినవారు |
|---|---|---|---|
| 1. | పరామర్శ - నల్లూరి రుక్మిణి (సాహిత్య వ్యాసాలు) | విరసం | ఎం. రత్నమాల |
| 2. | వివేచన- వి. చెంచయ్య (సాహిత్య వ్యాసాలు) | విరసం | సివిఎస్ఆర్ ప్రసాద్ |
| 3. | గుమ్మెట మోత - పాణి (నవల) | విరసం | జి. కళ్యాణరావు |
| 4. | బలహీనుడి బలం - కా. పటేల్ సుధాకర్ రచనలు | విరసం | క్రాంతి |
| 5. | ప్రజలపై యుద్ధం-గ్రీన్‌హంట్ విధ్వంసం | విరసం | సి. కాశీం |
| 6. | ఆఖరి కుందేలు - ఉదయమిత్ర కథలు | పాలమూరు అధ్యయన వేదిక | ఆర్. శశికళ |
| 7. | కఫన్ - ఇక్బాల్ కథలు | పాలమూరు అధ్యయన వేదిక | రవిచంద్ర |
| 8. | జంగిడి - మార్క వెంకట్రాములు కథలు | పాలమూరు అధ్యయన వేదిక | అరుణ్ |
| 9. | మాకూ కలలున్నాయి-ఎం. రాఘవాచారి వ్యాసాలు | పాలమూరు అధ్యయన వేదిక | పాణి |
| 10. | అడుగులు - సుచరిత & వెంకటేశ్వరశర్మ | పాలమూరు అధ్యయన వేదిక | డి. ఉదయభాను |
| 11. | ఛూటే ఏరిన రచనలు | దిక్సూచి ప్రచురణలు | ఎన్. వేణుగోపాల్ |
| 12. | గెరిల్లా యుద్ధం-మార్క్సిజం; | దిక్సూచి ప్రచురణలు | ఎన్. వేణుగోపాల్ |
| 13. | చైనా ప్రజా విముక్తి సైన్యం; | దిక్సూచి ప్రచురణలు | ఎన్. వేణుగోపాల్ |
| 14. | నడుస్తున్న దారి | భాస్కర్ స్మృతి ప్రచురణలు | రవి |
| 15. | తడి ఆరని నేల - అరసవెల్లి కృష్ణ | పాలపిట్ట | ఉదయ్ |
| 16. | మహోదయం - కెవిఆర్ | కె.వి.ఆర్, శారదాంబ స్మారక కమిటీ | కాకరాల |
| 17. | లాంగ్‌మార్చ్ (దీర్ఘకవిత) - కెనరీ | విరసం | కిరణ్ |
| 18. | జ్ఞాపకాలు-డా. కె. సుబ్బనాచారి | జన విజ్ఞాన వేదిక | వి. చెంచయ్య |
| 19. | ఆంధ్రప్రదేశ్ రాడికల్ విద్యార్థి సంఘం సంక్షిప్త చరిత్ర : 1974-92 | విరసం | సి. కాశీం |
| 19. | వరంగల్ విద్యార్థి ఉద్యమాలు | విరసం | సి. కాశీం |
| 20. | జంగల్‌నామ-సత్నాం | మలుపు ప్రచురణలు | ఎం. రాఘవాచారి |
| 21. | మన్యం వెలుగులు (వడ్యాపూర్ చంద్రమౌళి, కరుణ) | దిక్సూచి | |
| 22. | ఎర్ర నక్షత్రం (కా. కిషన్‌జీ యాదిలో) | | టి. సుదర్శన్ |
| 23. | ధృవతారలు (పాటల సిడి) | జననాట్యమండలి | టి. సుదర్శన్ |

అన్నారు.

ఐదో షెడ్యూలు ఆదివాసీల రక్షణ చట్టమని, దాన్ని ఉల్లంఘించి, ఆదివాసీ ప్రాంతాన్నంత వనరుల స్టోరేజులాగ భావించి, బహుళజాతి సంస్థలకు అప్పగిస్తూ దాన్నంత ఎం.ఓ.యూ.ల కారిడార్‌గా మార్చేస్తున్నవారు గాంధేయవాదులమని చెప్పుకుంటున్నారని అన్నారు.

దేశానికి ఏకైక అతిపెద్ద ప్రమాదం మావోయిస్టులు అన్న ప్రధాని మన్మోహన్‌సింగే నిజానికి దేశానికి అతిపెద్ద ప్రమాదకారి అని అన్నారు. వాళ్ల అర్థంలో ఆర్థిక వ్యవస్థను సరి అయిన దిశలో పెట్టడం అంటే, తీసుకుపోయి జిందాల్‌ల చేతిలో పెట్టడమేనని కా. కళ్యాణరావు అన్నారు.

విరసం సర్వసభ్య సమావేశం చేసిన తీర్మానాలను బహిరంగ

వ్యాసం

కర్నూలు మహాసభల ప్రసంగపాఠం

# ఆదివాసీ ప్రాంతాల్లో వనరుల దోపిడి- సామ్రాజ్యవాదం

- పి. వరలక్ష్మి

ఇది గ్రీన్‌హంట్ సందర్భం. 'విరగ్గాస్తున్న వెన్నలను రాజ్యం వెంబడిస్తోంది, ఆత్మవిశ్వాసంతో అరణ్యం తిరగబడుతోంది' అని ఈ సందర్భాన్ని అభివర్ణిస్తూ ఈ వేదికపై రాసుకున్నాం. ఈ వేట లక్షలకోట్లు విలువజేసే ప్రకృతి సంపద కోసమేనన్న విషయం ఇప్పుడు కొత్తగా చెప్పనవసరం లేదు. ఈ వేట మధ్యభారతదేశంలోనే కాదు. ప్రపంచవ్యాప్తంగా శతాబ్దాల తరబడి ప్రకృతి ఒడిలో జీవిస్తున్న అన్ని ఆదివాసీ సమూహాలపై జరుగుతున్నది. ఒక అంచనా ప్రకారం 70దేశాల్లో 370 మిలియన్ల మూలవాసులు ఇటువంటి వేటవల్ల నిర్వాసితులయ్యారు. వారు మధ్యఆఫ్రికాలోని బయాకా అడవుల్లో కలపకోసం, నికరాగువాలోని మిస్‌కిటోలో బంగారం కోసం, కెనెడాలోని డెనె, క్రీ ప్రాంతాల్లో యురేనియం కోసం తమ సొంత గడ్డపై నుండి తరిమివేయబడ్డారు. చేపలవేటకోసం రష్యాలోని చికుచీ, ఎస్కిమో ఆదివాసులు నిర్వాసితులయ్యారు. గడ్డి మైదానాల కోసం, కాఫీ ప్లాంటేషన్ల కోసం, చమురు పైప్‌లైన్ కోసం ఆదివాసులు నివసించే అమేజాన్, వియత్నాం, నైజీరియా ప్రాంతాలు ధ్వంసం చేయబడ్డాయి. ఇవి ఉదాహరణలే. ప్రపంచవ్యాప్తంగా వనరులకోసం పెట్టుబడి సాగిస్తూవస్తున్న వేటకు అంతే లేదు. ఇప్పుడు ఒరిస్సా నియంగిరి కొండలనుండి బాక్సైట్ వెలికితీయడానికి స్థానిక డోంగ్రియా కోందులను, అట్లాగే మధ్యభారతదేశంలోని దండకారణ్యవ్యాప్తంగా నిక్షిప్తమై ఉన్న 28 రకాల ఖనిజాల కోసం గోండు, సంథాల్, ముండా, హో, ఒరాన్ తెగల ఆదివాసులను వెళ్ళగొట్టే ప్రయత్నమైనా అటువంటిదే. తేడా అల్లా ఇక్కడి ప్రజలు మావోయిస్టు పార్టీ అనే ఒక పటిష్టమైన రాజకీయ నిర్మాణంలో సమీకృతమై పోరాడ[illegible]న్నారు.

సామ్రాజ్యవా[illegible], దేశాల ఆర్థిక వ్యవస్థను పోషించేలా ప్రపంచవ్యాప్తంగా నేడు అన్ని దేశాల ప్రభుత్వాలు పరిశ్రమలను, వ్యవసాయాన్ని తయారు చేసుకోడంలో తలమునకలుగా ఉన్నాయి. సామాజిక శాస్త్రాలు ప్రపంచంలో రెండు రకాల దేశాల గురించి చెప్తుంటాయి. అవి అభివృద్ధి చెందిన దేశాలు, అభివృద్ధి చెందని దేశాలు. ప్రపంచ మార్కెట్ల వల్ల ధనిక దేశాల కేంద్రం నుండి వాటి చుట్టూ ఉండే పేద దేశాల్లోకి సాంకేతి పరిజ్ఞానమూ, దానితోపాటు సంపదా ప్రవహిస్తుంది అని స్వేచ్ఛా మార్కెట్ ఆర్థికవేత్తలు చెప్తుంటారు. అందుకని వీళ్ళు పేద దేశాలను ప్రపంచ వ్యవస్థలో భాగం కమ్మని కూడా చెప్తారు. దాని వల్ల జరిగేది మాత్రం వీళ్ళు చెప్పేదానికి పూర్తి విరుద్ధంగా ఉంటుంది. అభివృద్ధి చెందని దేశాల నుండి సంపద వెలికి తీయబడి అది ధనికదేశాల కేంద్రంలోకి ప్రవహిస్తుంది. అది ఆ కేంద్రంలో ఆర్థికవృద్ధిని, సంపదను నిరంతరం పెరిగేలా చేస్తుంది. అత్యధికంగా నదులు, ఖనిజ వనరులు, మానవ వనరులూ కూడా ఉన్న దక్షిణార్థ భూగోళంలో ఎక్కువ భాగం అభివృద్ధి చెందని దేశాలుగా, ఇవేవీ లేని ఉత్తరార్థ భూగోళంలో ధనిక దేశాలుగా ఉండడం మనకు కనపడుతుంది. ఇదిలా ఉంటే ఆర్థిక సంక్షోభం ప్రపంచవ్యాప్తము అవుతుంటే, ప్రపంచ పెట్టుబడి కొత్త మార్కెట్లకోసం మరింతగా అన్వేషిస్తోంది. బడా కంపెనీలు ఇప్పటిదాకా వినియోగంలోకి రాకుండా ప్రకృతి గర్భంలో ఉన్న వనరులపై కన్నువేసి ఆయా ప్రాంతాలను తమ గుప్పిట్లోకి తీసుకునే ప్రయత్నాలను ముమ్మరం చేశాయి.

పెట్టుబడి సహజసూత్రం అపరిమిత విస్తరణ. ఉత్పత్తి పెరుగుదల, భారీ ఉత్పత్తి, మరింత భారీ ఉత్పత్తి... ఇట్లా ఉంటుంది పెట్టుబడిదారీ విధానం నడక. ఇటు వంటి ఉత్పత్తి ఎక్కువెక్కువ వనరులను డిమాండ్ చేస్తుంది. సరుకు విలువలో ముడి పదార్థాలు, పరికరాలు, శ్రమ విలువ కలగలిసి ఉంటాయని అర్థశాస్త్రం చెప్తుంది. ఉత్పత్తిని పెంచడం కోసం పెట్టుబడి సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేస్తుంది. సాంకేతిక పరిజ్ఞానం పెరిగేకొద్దీ పరికరాల విలువ పెరుగుతుంది. శ్రమవిలువ తగ్గుతుంది. ముడిపదార్థాల విలువా తగ్గుతుంది. నిజానికి ప్రకృతి వనరులను ఏ ప్రాతిపదికపై విలువ గట్టగలం అనేది ప్రశ్నే. అయితే కొత్తకొత్త సాంకేతిక పరిజ్ఞానంతో

---

సభలో కార్యదర్శి చదివి వినిపించారు. తెలంగాణ విద్యార్థులు, ఉద్యోగులపై పెట్టిన అక్రమకేసుల ఎత్తివేత; కవ్వాల్ టైగర్ ప్రాజెక్టు రద్దు; అంబేద్కర్ విగ్రహాల కూల్చివేతలపై ఖండన మొదలైన తీర్మానాలను సభ ఆమోదించింది.

మహాసభల్లో పుస్తకాల ఆవిష్కరణ కార్యక్రమం రుక్మిణి అరసవెల్లి కృష్ణల నిర్వహణలో జరిగింది.

సౌహార్ద్ర సందేశాలిచ్చిన వారిలో బి. జ్యోతి-చైతన్య మహిళా సంఘం, జాన్-ప్రజా కళా మండలి, వై. వెంకటేశ్వరరావు-దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం, బి.కొండారెడ్డి-ప్రగతిశీల కార్మిక సమాఖ్య, జి. శ్రీనివాసాచారి-డి.టి.ఎఫ్, సమతా రోష్ని-ప్రజాస్వామ్య రచయిత్రుల వేదిక, అల్లాబక్ష్-ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, పోతన-అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, టి. వెంకట్-తెలంగాణ విద్యార్థి వేదిక, టి. మల్లేశ్వర్-టి.ఎన్.టి. పోస్టల్ యూనియన్, పోరిక ఉదయసింగ్ నాయక్-తెలంగాణ నంగారాభేరి, డి.ఎస్.ఎన్. తుమ్మి-పోస్టల్ ఎంప్లాయీస్ యూనియన్ తదితరులు ఉన్నారు.

రచయితలు, కళాకారులతోపాటు వివిధ వృత్తి సంఘాలు, ప్రజాసంఘాల్లో పని చేస్తున్న కార్యకర్తలు, ఆలోచనా పరులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు 500 మందికిపైగా హాజరైన రెండు రోజుల విరసం 23వ రాష్ట్ర మహాసభలు విప్లవ సందేశాన్ని ప్రజలకందించాయి.



త్వరత్వరగా సంపదను వెలికి తీయడం సాధ్యమవుతుంది. పెట్టుబడి ఎక్కువ లాభం కోసం చవక ముడిపదార్థాల కోసం వేట సాగిస్తుంది. అట్లా వలసల చరిత్రంతా వనరులు కొల్లగొట్టడం మీదే ఉంది. ఎంత ఎక్కువ వనరుల వాడకం జరుగుతుందో అంత ఎక్కువ స్థానిక సామాజపు విధ్వంసం, ప్రకృతి విధ్వంసం జరుగుతుంది. 18, 19వ శతాబ్దాల్లో పెట్టుబడిదారీ దేశాలు నాగరికత పేరుతో, అనాగరికులను నాగరికులుగా తీర్చిదిద్దే బృహత్ కర్తవ్యాన్ని మీదేసుకున్నామని చెప్తూ తమ వలస దోపిడిని సమర్థించుకునే వాదాలు తీసుకొచ్చాయి. అమెరికాలో ఇప్పటికీ కొలంబస్ డే జరపడం వాళ్ళ అహంకారానికి నిదర్శనం.

వలసలు అంతమయ్యాక వనరులపై సామ్రాజ్యవాదుల ఆధిపత్యం కొత్త పద్ధతిలో కొనసాగింది. మార్కెట్ల కోసం యుద్ధాలు, వలసలు, దోపిడి రూపాల్లో గుణాత్మక మార్పు వచ్చింది. స్వతంత్ర్య దేశాల్లో మార్కెట్ల చొరబాటు ద్వారా స్థానిక మార్కెట్లపైనేగాక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో సామ్రాజ్యవాదుల ఆధిపత్యం పెరిగి దోపిడి మరింత ప్రణాళికాబద్ధమైంది. దీనికోసం దళారీవర్గం ఉండనే ఉంది. సామ్రాజ్యవాద మార్కెట్ ప్రయోజనాలను కాపాడే విధంగా దళారీవర్గంతో చేసుకున్న ఒప్పందాలు చాలా దేశాలకు స్వాతంత్ర్యం ఇవ్వడానికి ముందస్తు షరతులయ్యాయి. ఒక రకంగా పేరుకు దేశాలు స్వాతంత్ర్యం పొందినా అవి ఒక ప్రపంచ గుత్త పెట్టుబడి చట్రంలో బందీ అయ్యాయి. ఈ విధంగా వనరుల దోపిడికి శాశ్వత మార్గాలు ఏర్పడ్డాయి. భారతదేశం విషయంలో ఇది అక్షరాలా అమలయ్యింది. ప్రపంచంలో ఒక సోషలిస్టు కేంద్రం ఉన్నంత వరకూ మన ప్రభుత్వానికి ఒక సోషలిస్టు ముసుగైతే ఉండేది. అది పోయాక పాలకవర్గాలు బహిరంగంగా పెట్టుబడి ప్రయోజనాలతోనే ముందుకొచ్చాయి. పూర్తిగా సామ్రాజ్యవాద అనుకూల విధానాలు తయారైపోయాయి. 91నుండి సంస్కరణల పేరుతో నూతన ఆర్థిక విధానాలు, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు వచ్చేశాయి. వనరుల విషయానికొస్తే ప్రభుత్వాలకు చట్టాల పేరుతో ప్రకృతి సంపదమీద ఎలాగూ అధికారం ఉంటుంది. మూల వాసులకు వాళ్ళ భూమిపై హక్కులు స్థిరపరిచే రక్షణ చట్టాలైతే ఉన్నాయిగాని అవి పేరుకే. తాము చేసిన చట్టాలనే ప్రభుత్వాలు నిస్సిగ్గుగా ఉల్లంఘిస్తున్నాయి. ఉదాహరణకు రాజ్యాంగం షెడ్యూల్ 5 ప్రకారం గిరిజన భూములను ఇతరులకు అమ్మకూడదు. కాని ఆదివాసీ భూములు అన్యాక్రాంతమవుతూనే ఉన్నాయి. దీని కోసం దొంగపెళ్ళిళ్ళు చేసుకోడం దగ్గరి నుండి నకిలీ పత్రాలు, తప్పుడు సర్వేల వరకూ చేయని ఫీట్లు లేవు. ప్రభుత్వమే కబ్జాల తొలగింపు పేరుతో, అటవీ సంపదను రక్షించే పేరుతో, సంక్షేమం పేరుతో అటవీ భూములను ఆదివాసుల నుండి కాజేస్తోంది. సరళీకరణ విధానాలు వచ్చాక ఇది మరింత పెరిగింది.

ఇక దళారీ పాలకవర్గం ఎంత బహిరంగంగా ముందుకొచ్చిందంటే అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్) సూచించిన వ్యక్తి మనదేశ ఆర్థిక మంత్రి అవుతాడు, తర్వాత ప్రధానీ అవుతాడు. హోంమంత్రి చిదంబరం వేదాంత సంస్థకు నాన్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్‌గా ఉండి రాజీనామా చేసి ఆర్థికమంత్రి అయ్యాడు. అలా మంత్రి అయిన వెంటనే ఇలా వేదాంత గ్రూపు కంపెనీల్లో ఒకటైన స్టెర్‌లైట్ షేర్లను కొనేలా మారిషస్ కంపెనీకి ఎఫ్‌డిఐ (విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి) అనుమతులిచ్చాడు. అందుకే ఈయన అటు ఎన్‌డిఎయు ప్రభుత్వంలోనైనా, ఇటు యుపిఎ ప్రభుత్వంలోనైనా హోంమంత్రిగా ఉండగలడు. ఇటువంటి ప్రభుత్వం సామ్రాజ్యవాద, బడా పెట్టుబడిదార్ల ప్రయోజనాల కోసం జనాన్ని చంపుతున్నదంటే ఆశ్చర్యమేముంది? దండకారణ్య ప్రకృతి సంపదను బహుళజాతి కంపెనీల చేతుల్లో పెట్టడానికి ఈ ప్రభుత్వం ఎంతగా ఉవ్విళ్ళూరుతున్నదంటే అది టాటాలతో ఒప్పందాలు కుదుర్చుకున్న కొద్దిరోజులకే 2005లో దంతెవాడలో స్థానిక ప్రభుత్వ అండతో ప్రైవేటు హంతకముఠా సల్వాజుడుంను ప్రారంభిస్తుంది. కేంద్రంలో, రాష్ట్రంలో వేరువేరు పార్టీలు అధికారంలో ఉన్నా సామ్రాజ్యవాద ప్రయోజనాల కొరకు రెండూ అరమరికలు లేకుండా కలిసిపోతున్నాయి.

పశ్చిమ బెంగాల్, జార్ఖండ్, ఒరిస్సా, ఛత్తీస్‌గఢ్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రల గుండా విస్తరించిన దండకారణ్య ప్రాంతాన్ని రెడ్ కారిడార్‌గా అభివర్ణిస్తుంటారు. ఇప్పుడది ఎంఒయూ (వాణిజ్య ఒప్పందాల) కారిడార్. ఈ ప్రాంతంలో విస్తారంగా పరుచుకుని ఉన్న ఖనిజసంపదను తవ్వుకోడానికి టాటా, ఎస్సార్, జిందాల్, వేదాంత వంటి కంపెనీలు దళారీ పాలకులతో ఒప్పందాలు కుదుర్చుకున్నాయి. ఇక వెంటవెంటనే సైన్యం, ప్రైవేటు హంతకముఠాల కనుసన్నలలో బూటకపు ప్రజాభిప్రాయ సేకరణలు జరిపి, పర్యావరణ అనుమతులూ పొంది మైనింగ్ పరిశ్రమలకు సర్వం సిద్ధం చేశారు. అడ్డుగా మిగిలింది మావోయిస్టులే. అత్యంత సహజంగా వారు ప్రజల పక్షాన నిలబడ్డారు. బహుళజాతి కంపెనీలతో కుదుర్చుకున్న ఒప్పందాలను అమలు చేయడానికి అత్యంత తీవ్రమైన ప్రతిఘటనను ఎదుర్కొంటున్న ప్రభుత్వం 2009 సెప్టెంబర్‌లో గ్రీన్‌హంట్ ఆపరేషన్ ప్రారంభించింది. ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్‌లలో మోహరించిన సైన్యం కంటే ఎక్కువ బలగాలను ఇక్కడ మోహరించారు. వందలాది గ్రామాలను తగులబెట్టినా, జైళ్ళన్నీ ఆదివాసులతో నింపేసినా, ఎంతో మందిని ఊచకోతకోసినా ప్రజలు ప్రతిఘటిస్తూనే ఉన్నారు. ప్రభుత్వం యుద్ధాన్ని తీవ్రతరం చేస్తూ 2011 జనవరి నుండి రెండోదశ గ్రీన్‌హంటును మొదలు పెట్టింది.

ప్రభుత్వం గ్రీన్‌హంట్ వంటిది లేనే లేదంటుంది. అయితే అభివృద్ధికి మావోయిస్టులు అడ్డుగా ఉన్నారని, వాళ్ళను నిర్మూలించాలని నేరుగానే అది చెప్తూనే ఉంది. మన్‌మోహన్ సింగ్ దేశ అంతర్గత భద్రతకు మావోయిస్టులు అతిపెద్ద ముప్పు అని ప్రకటించాడు. ఇక ఆదివాసీ హక్కుల గురించి, చట్టాల గురించి, షెడ్యూల్ 5 గురించి మాట్లాడేవాళ్ళు అభివృద్ధి నిరోధకులే కాదు, మావోయిస్టు సానుభూతిపరులని కూడా అనిపించుకుంటున్నారు. ఇప్పుడు అభివృద్ధి గురించి హోంమంత్రి మాట్లాడతాడు. దేశ వనరులన్నీ వినియోగంలోకి తేవాలని, వాటిని ఎంత తొందరగా సొమ్ముచేసుకుంటే అంతగా దేశాభివృద్ధికి దోహదం చేయడమని చిదంబరం అంటున్నాడు. అభివృద్ధి అంటే ఎవరి అభివృద్ధి అనే ప్రశ్న ఉండనే ఉంటుంది. అయితే ప్రభుత్వం చెప్పే ఆర్థికాభివృద్ధి వల్ల దేశ స్వరూపమే మారిపోతుందని మధ్యతరగతిని భ్రమల్లో ముంచారు. వనరులన్నీ వినియోగంలోకి తేవడం జరిగితే అదెలా

ఉంటుందో ఆఫ్రికా దేశాలను చూస్తే అర్థమవుతుంది. ఈ రోజు నోకియా, మోటరోలా, ఎరిక్‌సన్, సోనీ మొదలైన కంపెనీల సెల్‌ఫోన్లు, కంప్యూటర్ల వంటి ఎలక్ట్రానిక్ పరికరాలకు అవసరమైన కోల్టన్ అనే పదార్థం 80 శాతం ఆఫ్రికా దేశాలనుండే వస్తోంది. అట్లనే లిథియం అయాన్ బ్యాటరీల్లో వాడే కోబాల్ట్ 80 శాతం ఆఫ్రికా దేశాలనుండే వస్తోంది. అమెరికాకు అవసరమయ్యే చమురు 24 శాతం ఇక్కడి నుండే వస్తోంది. ఇది దక్షిణాసియా దేశాల నుండి అమెరికాకు ఎగుమతయ్యే చమురు శాతం కన్నా ఎక్కువ. ఇట్లా బహుళజాతి కంపెనీల కోసం వనరుల్ని వెలికితీసిన ఈ దేశాలన్నీ నేడు దుర్భర దారిద్ర్యంలో ఉన్నాయి. విస్తార సంపద వల్లే ఆఫ్రికా బానిసత్వంలో మగ్గుతున్నదంటే అతిశయోక్తి కాదు. ఇక్కడి ప్రజలు విషాన్ని తింటూ, విషాన్ని తాగుతూ, విషాన్ని శ్వాసిస్తూ చస్తూ బతుకుతున్నారు. వనరులున్న దేశాలపై పెత్తనం కోసం అమెరికా ఎన్ని సైనిక కుట్రలు జరిపిందో లెక్క లేదు. అది 8లక్షల మందిని పొట్టనబెట్టుకున్న 1994 రువాండా జాతుల ఘర్షణకు కారణమైంది. అదే సమయంలో సూడాన్‌లో సైనిక కుట్రలు జరిపింది. 90ల దాకా ఎందుకు? మొన్నటికి మొన్న ఆఫ్రికన్ యూనియన్ ఏర్పాటులో కీలక పాత్ర పోషించిన గడాఫీకి ఏమయ్యిందో చూశాం.

ఆఫ్రికా దేశాలవరకూ పోనవసరం లేదు. గనుల చుట్టూ కమ్ముకున్న దేశీయ, అంతర్జాతీయ మాఫియా, గనుల తవ్వకాల చుట్టూ భారతదేశవ్యాప్తంగా జరుగుతున్న విధ్వంసాన్ని చూస్తే అర్థమవుతుంది. సబ్‌సహారన్ ఆఫ్రికాలో ఉన్న 26 దేశాల పేదల కన్నా మనదేశంలో 8 రాష్ట్రాల్లో ఎక్కువ మంది పేదలున్నారు. వీళ్ళందరినీ అభివృద్ధిలో భాగం చేస్తామని ప్రభుత్వం అనవచ్చు. అసలు అభివృద్ధి అంటూ ఉన్నా, అది ఏ అర్థంలోనైనా సరే, తమ ఉత్పత్తి విధానంతో, జీవన విధానంతో పొసగని అభివృద్ధి నమూనాలోకి వీళ్లని తీసుకుపోవడం సాధ్యం కాదు. అదే సాధ్యమైతే విస్థాపన సమస్య ఇంత గంభీరంగా ముందుకు రాదు. దీనికన్నా ప్రజలు నివసించే భౌగోళిక పరిస్థితుల్లోనే వాళ్ళు తరతరాలుగా పోగు చేసుకున్న జ్ఞానాన్ని అభివృద్ధి చేసి అక్కడి నుండి వారి జీవన విధానాన్ని, జీవన ప్రమాణాలను మెరుగుపరచడం ద్వారా నిజమైన అభివృద్ధిని సాధించవచ్చని, అందులో ప్రజల క్రియాశీలక భాగస్వామ్యం ఉంటుందని ఈరోజు దండకారణ్యంలో జనతన సర్కార్లు నిరూపిస్తున్నాయి. సర్వస్వాన్ని ఊడ్చిపడేసి, నిర్మించే సామ్రాజ్యవాద అనుకూల అభివృద్ధి నమూనాను కాదని ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను నిర్మించుకుంటున్నందుకే దండకారణ్య ఆదివాసులపై ప్రభుత్వం దేశ చరిత్రలోనే అతిపెద్ద సైనికదాడిని మొదలుపెట్టింది. ఆదివాసులు తమ వీరోచిత ప్రతిఘటన ద్వారా జల్, జంగల్ జమీన్‌లపై తమ హక్కులను రక్షించుకోవడమే కాదు, మొత్తం దేశసంపదను, దేశాన్నీ బహుళజాతి సంస్థలు కాజేయకుండా అడ్డుకుంటున్నారు. కాబట్టి గ్రీన్‌హంట్ సమస్య మావోయిస్టులదో, ఆదివాసులదో కాదు, మొత్తం దేశానిది. దీని పట్ల బుద్ధిజీవులు, రచయితలు, ప్రజాస్వామికవాదులు మౌనంగా ఉండడం బాధ్యతారాహిత్యమే కాదు, నేరం కూడా.



లేఖ :

**ప్రియమైన విరసం మిత్రులకు, లాల్‌సలాం!**

కా. కిషన్‌జీ మీద విరసం రాసిన కరపత్రం చదివాను. దాని మీద కొన్ని అభిప్రాయాలు రాస్తున్నాను.

1. 1981లో బస్తర్‌లో మల్లోజుల వేణుగోపాల్ ద్వారా ప్రవేశించిన పీపుల్స్ వార్ పార్టీ 1985 నాటికి ఒక శక్తిగా మారిందని రాశారు. వాస్తమేమిటంటే వేణుగోపాల్ ద్వారా బస్తర్‌లోకి దళాలు ప్రవేశించలేదు. ఇలా రాయడం సరైనది కాదు. దిగజారిపోయిన మురళి (శివాజి) నాయకత్వంలో దళాలు ప్రవేశించాయి.
2. పీపుల్స్‌వార్ ఏర్పడినాక 'దండకారణ్య పర్‌స్పెక్టివ్'తో కా. మల్లోజుల వేణుగోపాల్ అని రాశారు. అది సరైనది కాదు.
3. 'కామ్రేడ్ భూపతి (మల్లోజుల వేణుగోపాల్) నాయకత్వంలో నిర్మాణమవుతున్న' అని రాశారు. అలా రాయడం సరైనది కాదు.
4. విరసం కరపత్రంలో 'ప్రజా యుద్ధంలో సగభాగమైన మహిళలు' అనే దానిలో కా. మల్లోజుల కోటేశ్వరరావు స్మృతిలో రాసిన దానిలో బతికి ఉన్న వ్యక్తులను హైలెట్ చేయడం పార్టీ అవగాహనకు భిన్నమైనది.

2011 అక్టోబర్‌లో జరిగిన డి.కె. పార్టీ సమావేశంలో పై విషయాలను ఈ విధంగా సమీక్షించింది. డి.కె. నుండి వస్తున్న పుస్తకాలలో కొందరు కామ్రేడ్స్ సాహిత్యపరంగా చేస్తున్న రచనలలో ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న కొద్దిమంది వ్యక్తుల పాత్రను హైలెట్ చేసే ఒక తప్పుడు ధోరణి తలెత్తింది. అలాగే పత్రికలలో ప్రచురిస్తున్న కొన్ని రిపోర్టులలో కార్యకర్తల పేర్లు, ఫోటోలు వేయడం సాంకేతికంగా సరైనది కాదు. మహిళా ఉద్యమ చరిత్రపై కెఎఎంఎస్ వెలువరించిన పుస్తకం ముందు మాటలో వ్యక్తులుగా కొందరు పార్టీ నాయకులను పొగుడుతూ రాయడం కూడా సరైనది కాదు.

ఇట్లాంటి పద్ధతి 'ప్రజలే చరిత్ర నిర్మాతల'నే మార్క్సిస్టు అవగాహన నుండి వైదొలగి వ్యక్తులనే హీరోలుగా చూసే భావ ధోరణికి గురైన ఫలితమేనని పార్టీ సమీక్షించుకున్నది. పార్టీలో వ్యక్తి వాదం, అహంభావం మరింతగా పెరగడానికి దారితీసే ఈ పెడ ధోరణికి వ్యతిరేకంగా పార్టీ శ్రేణులను దిద్దుబాటు చేసుకోవాలని కూడా పార్టీ నిర్ణయించింది.

ఇట్లు

**ఆత్రం రామారావు**

వ్యాసం

కర్నూలు మహాసభల ప్రసంగపాఠం

# గ్రీన్ హంట్ - విధ్వంస రూపాలు

- ఆర్. రాజానందం

'ప్రజల చేతుల్లో పాలకుల తుపాకులకు సమాధానం చెప్పగల మంత్రదండం ఉంది'. అంటాడు మావో. దండకారణ్యంలో లేదా మొత్తంగా మధ్య భారతంలో 'జల్, జంగల్, జమీన్' కోసం జరుగుతున్న ఆదివాసీ పోరాటాలను అణిచివేయడానికి గ్రీన్‌హంట్ పేరుతో లక్షలాది సైన్యం దింపి అనేక రూపాలలో ఆదివాసీల జీవితాలను ధ్వంసం చేస్తున్నది రాజ్యం. అయినా ఆదివాసీ ప్రజలు పాలకుల పారా మిలటరీ బలగాల తుపాకులను ఎదుర్కొంటూనే ఉన్నారు. అందుకే గ్రీన్‌హంట్‌లో విధ్వంసం రూపాల గురించి చెప్పేకంటే ముందు రాజ్యంహింసా రూపాలను ఎందుకు ఎక్స్‌టెండ్ చేసుకుంటూ పోతుంది. ఎవరి కోసం ఎవరిపైన విధ్వంసం కొనసాగిస్తుంది. ఆ విధ్వంసంలో క్రూరత్వం పెంచి పైశాచిక ఆనందం పొందుతుందనేది మనం పరిశీలించాలి. అంటే మనం లీలా మాత్రంగానైనా అక్కడి ప్రజల పోరాటాలను మొదటి నుండి తరమవలసిన అవసరం ఉంది.

ప్రజలు (ఆదివాసీ ప్రజలు) తమ అవసరాల కొరకు వారి ఆకాంక్షల కొరకు పోరాటం చేసిన ప్రతి సందర్భంలో రాజ్యం వారిపై నిర్భందం చేసి వారి పోరాటాలను అణిచివేయాలని ప్రయత్నించింది. ప్రజలు నిర్బంధాన్ని ఎదిరిస్తూ నిలబడుతూ మరో పోరాటానికి సిద్ధమవుతున్నారు. ఆ విధంగా 'ఆపరేషన్ గ్రీన్‌హంట్ కంటే ముందే రాజ్యం 5 ఫేస్‌లలో ప్రజలపై తన విధ్వంసాన్ని కొనసాగించింది.

అట్లా చూసినప్పుడు 1980 నుండి 1985 వరకు మొదటి ఫేస్ 1986 నుండి 1991 వరకు రెండవ ఫేస్ 1992 నుండి 1996 వరకు మూడవ ఫేస్ 1997 నుండి 2004 వరకు నాలుగవ ఫేస్, 2005 నుండి 2009 వరకు ఐదవ ఫేస్ నిర్భంద దాడిని రాజ్యం కొనసాగించింది. ఈ మొత్తం ఫేస్‌లను ప్రజలు తిప్పికొట్టారు. కనుక 2009 నుండి ఆపరేషన్ గ్రీన్‌హంట్ మొదటి ఫేస్ 2011 నుండి ఆపరేషన్ గ్రీన్‌హంట్ రెండవ ఫేస్ కొనసాగిస్తున్నారు. మనము ఒక్కోఫేస్‌లో రాజ్య నిర్భంధం ప్రజల తిరుగుబాటును చర్చించుకుంటే మంచిది.

1980-85లలో దండకారణ్యం మొత్తం జంగ్లాతువాళ్లు, కాంట్రాక్టర్ల దౌర్జన్యం కొనసాగేది. అడవిలో పుట్టి అడవిలో పెరిగిన ఆదివాసీలకు ఈ దేశ మూలవాసులకు అడవిపైన హక్కులేని బతుకులు, అడవిలో చిన్నపుల్ల కూడా తీసుకోలేని దయనీయ బతుకులు. బతుకు వెళ్లదీయటం కోసం అటవీ ఉత్పత్తులపైనే ఆధారపడి సేకరణ దశలో ఉన్న జీవితాలు అటువంటి జీవితాలపై ఫారెస్ట్ వాళ్ల, కాంట్రాక్టర్ల దౌర్జన్యాలు కొనసాగేవి. వాటిని నిలువరించడం కోసం అక్కడి ప్రజలను చైతన్యం చేయడం కోసం కొంత మంది యువకులు ఆంధ్రప్రదేశ్ నుండి బస్తర్ (దండకారణ్యం)కు పోయారు. ఆ సందర్భంగానే 1980 నవంబర్ 2న పెద్ది శంకర్ ఎన్‌కౌంటర్ జరిగింది. అంటే ప్రజలను చైతన్యం చేసి వారికి అండగా ఉండేవారు ఎవరూ బ్రతకకూడదని ప్రభుత్వం పాలసీ. దండకారణ్యం మొత్తం ఆ యువకులు దొంగలని, పిల్లలను ఎత్తుకపోయి బలిస్తారని వారిని నమ్మవద్దని ప్రచారం చేసింది రాజ్యం.

ప్రజలకు మద్దతుగా ఫారెస్ట్ అధికారుల వ్యతిరేక పోరాటాలు చేశారు. ఫలితంగా ఫారెస్ట్ వాళ్లు అడవి వదిలి వెళ్లిపోయారు. గిట్టుబాటు ధరల పోరాటం తూనికాకు రేట్ల పోరాటం, కూలీ రేట్ల పోరాటం, వెదురు రేట్ల పోరాటం చేశారు. ప్రజలు అన్ని పోరాటాల్లో ముందుకు కదిలారు. ఉద్యమాలు విస్తరణను అడ్డుకోవడానికి రాజ్యం బలగాలను దింపింది. గొల్లిపల్లి, కిస్టారం ఏరియాలలో పోలీస్ క్యాంపులు ఏర్పాటు చేసుకున్నారు.

1986-1991 మధ్య కొనసాగిన రెండవ దాడిలో రాజ్యం ఇన్‌ఫర్‌మేషన్ నెట్‌వర్క్ పెంచుకున్నారు. క్యాంపులు ఏర్పాటుచేసుకుని ప్రజలను అరెస్టు చేసి అక్రమ నిర్భందంలో ఉంచడం, జైళ్ళలో పెట్టడంలాంటి చర్యలకు పాల్పడింది. ప్రజలు మూకుమ్మడిగా ఎదుర్కొన్నారు. కొంతకాలం సంక్షోభంలో పడిన ప్రభుత్వం అటు తరువాత 92 నుండి బస్తర్‌లో ఉన్న 'మాంజీలందరినీ ఆర్గనైజ్ చేశారు'. అప్పటికే ఉద్యమాల వలన మాంజీ ప్రాబల్యం తగ్గిపోయినందువల్ల ప్రభుత్వానికి వారు సహకరించారు. మాంజీలంటే 50-100 గ్రామాలకు అధిపతి. దీన్ని మాంజి పరగణ అంటారు. ఒక్క బస్తర్‌లోనే 100 మంది మాంజీలుంటారు.

వారందరికీ అధ్యక్షుడు మహేంద్రఖర్మ తండ్రి. ఇతని ఆధిపత్యంపోయింది. అందుకే రాజ్యంతో కుమ్మక్కై జనజాగరణ సమితీని ఏర్పాటు చేసి వెంటనే 50 గ్రామాలను తగలబెట్టారు. 100 గ్రామాలో పంటలను తగలబెట్టారు. 50 మందిని జైళ్ళలో పెట్టారు. అనేక మందిపై అత్యాచారాలు చేశారు. కాళ్ళు, చేతులు నరికివేశారు. చాలా మందిని చంపి సిలువ వేశారు. 91, 92, 93లలో గడ్చిరోలిలో జనజాగరణ మేళలు పెట్టి దాదాపు 100 మందిని చంపేశారు. ఇక్కడ మేళ అంటే వాళ్ళతో ఏకీభవించని ప్రజలను చంపడమే. ఈ విధ్వంసాన్ని ఎదుర్కోవడానికి ప్రజలు సిద్ధపడి 96 జనవరి నుండి ఏప్రిల్ వరకు ఎదురుదాడి చేశారు. 'జన జాగరణ సమితి' తన మేళలను ఆపేసుకుంది. ప్రజలకు ఆత్మస్థైర్యం వచ్చింది. రాజ్యంకు దానికి సహకరిస్తున్న వారికి వ్యతిరేకంగా పోరాడాలనే అవగాహన ప్రజలకు పెరిగింది. ఒక దాడిని ఒక విధ్వంసాన్ని ఎదుర్కోవడానికి ప్రజలకు ఒక్కోరకమైన పోరాట రూపం అవసరమైంది.

1997లో మరోసారి జనజాగరణ మేళను జరపదలిచారు.

ప్రజలు వాటిని తిరస్కరించడం ఎదురుతిరగడం వలన వాటిని నిలిపి దండకారణ్యంలో పెద్ద ఎత్తున సంస్కరణలు మొదలుపెట్టారు. రోడ్డు, స్కూల్‌లు, ఆశ్రమ పాఠశాలలు, విద్యుత్ 10వ తరగతి పాస్ అయితే పంచాయితీ సెక్రటరీ, అంగన్‌వాడీ వర్కర్లు గ్రామ సేవకులు, ఇంటర్ పాస్ అయితే టీచర్లుగా నియమించారు. ఇలా నియమించబడిన యువతి, యువకులు స్టేట్ నెట్‌వర్క్‌లోకి వెళ్ళారు. వీరందరినీ పోలీస్ ఇంటలిజెన్స్‌తో లింక్ చేశారు. పోలీస్ క్యాంపులు పెంచారు. ప్రజా సమస్యల కోసం జనజాగరణ సమితి విధ్వంసంకు వ్యతిరేకంగా పోరాడిన ప్రజల ఇన్‌ఫర్‌మేషన్ ఈ నెట్‌వర్క్ ద్వారా తెలుసుకుని వారిని క్రూరంగా అణిచివేసే పని రాజ్యం చేసింది. అలాగే లోహం డీ గూడా (ఇనుప ఖనిజం, అభ్రకం గనులు) చార్‌గామ్ (ఇనుప గనులు) నిక్కో, పాస్కో, టాటా, జిందాన్, మిటర్ లాంటి మల్టీనేషనల్ కంపెనీలను అప్పగించారు. దేశ సంపదను దోచుకోబోతున్న ఈ కంపెనీలకు వ్యతిరేకంగా పోరాటం చేస్తున్న ప్రజల నాయకుల సమాచారం తెలుసుకుని అణిచివేయడానికి ఈ నెట్‌వర్క్ ఉపయోగపడింది.

ఇదంతా ఒక ఎత్తైతే 2004 నవంబర్‌లో మన్మోహన్‌సింగ్ 'దేశ అంతరంగిక భద్రతకు మావోయిస్టులు పెనుముప్పు' అని స్టేట్‌మెంట్ తరువాత ప్రభుత్వ దాడిలో మార్పు వచ్చింది. క్రూరత్వం పెరిగింది. ప్రైవేటు సైన్యం పెంచుకున్నారు.

2005 జూన్ 5న సల్వాజుడుం ఏర్పాటుచేసి జూన్ 18న తాడిమేని గ్రామంపై దాడిచేసి ఇళ్ళను తగలబెట్టారు. జూన్ 19న మాటువాడలో సంతకు వచ్చిన ప్రజలను బలవంతంగా నిర్బందించి మీటింగ్ పెట్టి ప్రజలను తీసుకొని కొత్రుపాలెంకు దాడికి పోయారు. ఇళ్ళను తగలబెడుతుంటే ప్రజలు ఎదురుతిరిగి 12 మందిని బంధించారు. జూలైలో గ్రామాలపై దండయాత్ర మొదలుపెట్టి వందలాది మంది జుడూం కార్యకర్తలు పారామిలటరీ బలగాలు, కోబ్రా, నాగా పోలీసులు కలిసి గ్రామాలపై పడి గ్రామాలకు గ్రామాలు తగలబెట్టడం, మహిళలపై అత్యాచారాలు, హత్యలు చేయడం, లూటీలు చేయడమేకాక తండ్రుల ముందు పిల్లలను, పిల్లల ముందు తల్లులను అత్యాచారాలు చేశారు. పైశాచిక ఆనందం అనుభవించారు. వారి ఉద్దేశ్యం ఏమిటంటే అడవిలో ఆదివాసీలు ఉండకూడదు. ప్రజలందరు రోడ్లపై ఉన్న పోలీస్ కాంన్సంట్రేషన్ క్యాంప్‌లలో ఉండాలి. దీనినే చిదంబరం 'నీళ్లలో చేపలు ఉన్నాయి. నీళ్లను తోడి పోయండి' అంటాడు. ఈ స్టేట్‌మెంట్ తరువాత 860 గ్రామాల తగలబెట్టారు. ఒక్కో గ్రామాన్ని రెండు సార్లు, మూడు సార్లు కూడా తగలబెట్టారు. వేల సంఖ్యలో ఇళ్ళను తగలబెట్టి, 1080 మంది ప్రజలను చంపి శబరి, ఇంద్రావతి నదులలో వందలాది శవాలను పడేశారు. ఆ శవాలు దొరకవు. ఆర్‌గుట్ట గ్రామానికి చెందిన కుడ్డిపెంటేను నిర్బందించి తీసుకపోయి అత్యాచారం చేసి హత్యచేసి ముక్కలుముక్కలుగా నరికి సంచిలో మూటగట్టి శబరిలో పడేశారు. ఎర్రబోరు, గొల్లపల్లి, కిష్టారం, కుంటలాంటి ప్రాంతాలలో జుడూం క్యాంపులు ఏర్పాటు చేసుకున్నారు. 2006 జూలై 10న ఎర్రబోరుపై ప్రజలు మూకుమ్మడి దాడి చేస్తే అందులో 33 మంది ఎస్‌పిఒలు చనిపోయారు. ఈ సంఘటన తరువాత ఎస్‌పిఒలకు ఆయుధాలు ఇచ్చారు. 2008 నాటికి క్యాంపులలో ఉన్న జనం వెనక్కు వెళ్లారు. ఎస్‌పిఒలు మాత్రమే మిగిలారు. దాదాపుగా ఆరువేల మంది ఎస్‌పిఒలు ఉండవచ్చు.

2009లో సెంట్రల్ కమాండ్‌తో బలగాలను దింపి ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను ప్రారంభించారు. ఇందులో భాగంగా దేశ వ్యాప్తంగా స్పాటర్స్‌ను నియమించారు. లక్షలాది మంది పారా మిలటరీ బలగాలను దండకారణ్యంలోకి తీసుకొచ్చారు. ఆంధ్రప్రదేశ్‌కు వలసపోయిన వారిని వారికి అనుకూలంగా మలుచుకొని పోరాటాలు చేస్తున్న ప్రజల సమాచారం తెలియజేయడానికి రహస్య పోలీసులను నియమించారు. జుడూం క్యాంపులను ఏర్పాటు చేసి వారితో పారా మిలటరీకి అనుసంధానం చేశారు. ఈ క్యాంప్‌లలో మొత్తం 30 వేల మంది ఆదివాసీలు ఉండవచ్చు. దండకారణ్యంలో ఆదివాసీ జనాభా 5 లక్షల మంది అందులో 30 వేల మందిని మాత్రమే జూడుం క్యాంప్‌లలో ఉన్నారు. మిగిలిన వారంతా ఉద్యమాలను అంటిపెట్టుకుని ఉద్యమాలకు అండగా ఉంటున్నారు. దీనికే మన మేధావులు 'ఆదివాసీ సమాజంలో అంతర్ యుద్ధం' అంటున్నారు. ఆ మాట వాస్తవాలను వక్రీకరించడమే అవుతుంది. సిఆర్‌పిఎఫ్ నుండి 70 వేల మంది యువకులను తీసి కోబ్రాగా ఏర్పాటుచేసి వీరికి జంగిల్ వార్ ఫేర్‌లో ఇజ్రాయిల్, అమెరికా నుండి ఆఫీసర్స్‌ను పిలిపించి ట్రెనింగ్ ఇప్పించారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్ తర్వాత మొదటి దాడి 900 మంది పారా మిలటరీ బలగాల చేత 15 కిలో మీటర్ల పరిధిలోని వేచ్చేపాల్, వేటిపాల్, మర్రు, వర్రెపాల్, తిమ్మోనార్, మిర్తుల్, కుద్చేలిగ్రామాలపై దాడిచేసి గ్రామాలను 3, 4 రోజుపాటు లూటీ చేస్తూ తగులబెట్టారు. వెచ్చేపాల్‌లో సంతకు వచ్చినవారిని నలుగురిని చంపేశారు.

జనవరి 2009న దంతెవాడ జిల్లా గొల్లపల్లి పోలీస్ స్టేషన్ పరిధిలోని సింగారం గ్రామంపై సల్వాజుడూం, కోబ్రా, సిఆర్‌పిఎఫ్ బలగాలను దాదాపుగా 300 మంది దాడి చేసి 18 మందిని హత్య చేశారు. అందులో నలుగురు మహిళలు కూడా ఉన్నారు. 9వ తేదీన మీడియాలో మాత్రం 18 మంది మావోయిస్టులు హతం అనే శీర్షికన వార్త ప్రచురితం అయింది. అదేవిధంగా 2009 సెప్టెంబర్‌లో సింగన మడుగుపై దాడిచేసి మావోయిస్టుల ఆయుధాల ఫ్యాక్టరీ స్వాధీనం చేసుకున్నట్లుగా ప్రకటించారు. ఆ ఆయుధాల ఫ్యాక్టరీ స్వాధీనంలో ఒక్కరు కూడా చనిపోకపోతే ఎట్లా అనుకున్నారో ఏమో. పక్క గ్రామానికి చుట్టాలకు కల్లు తేవడానికి పోయి వస్తున్న దేవాల్‌ను పట్టుకుని చంపేశారు. అదే సమయంలో మరో 300 మంది పక్కనే ఉన్న గసన్‌పల్లి గ్రామంలో రెండవ దాడి చేసి అనేక ఇళ్లను తగులబెట్టారు. 'దూదిమొయే' అనే 70 సంవత్సరాల వృద్ధురాలిని అతి దారుణంగా చంపేశారు. మాడివి అడమాల్, మాడివి జోగాల్, మడకం చులాల్, మూకే, కోవాసిపోజే. బీమే (12 సంవత్సరాలు) గ్రామ నడిబొడ్డున ఆదివాసీలు సంప్రదాయ నృత్యం చేసుకునే మైదానంకు తీసుకవచ్చి అందరినీ నగ్నంగా చేసి పురుషుల మర్మాంగాలను కోసేసి, మహిళలపై సామూహిక అత్యాచారాలు చేశారు. ఈ దేశ పౌరులకు రక్షణ కల్పిస్తామని, రక్షణగా ఉంటామని చెబుతున్న సైన్యం ఆదివాసీల జీవితాలతో వారి శరీరాలతో

ఆదుకుంటున్నాయి.

2009 అక్టోబర్‌లో గోంపాడు గ్రామంపై 700 మంది బలగాలు దాడిచేసి 'కట్టంకన్నమ్మ' ఆమె భర్తను బంధించి, ఆమెపై అత్యాచారం చేసి భర్తను చంపేశారు. తల్లి ఎదలపై చేయిపెట్టుకుని పాలుతాగుతున్న బాలుడి వేల్లు, ఆమె ఎదలతో పాటు తెగిపడ్డాయి. తల్లిని చంపి ఆమె శవంపై బాలుడ్ని పడేసి వెళ్లిపోయారు. ఇంతటి విధ్వంసానికి ప్రతిచర్యగానే ఏప్రిల్ 6, 2010న ముకురం దగ్గర దాడి జరిగింది. 76 మంది సిఆర్‌పిఎఫ్ బలగాలు చనిపోయారు. దీన్ని ప్రతిహింస అనక ఏమంటాం? ఈ సంఘటనతో దేశ వ్యాప్తంగా కూబింగ్ నిలిపి వేశారు. మరోవైపు సల్వాజుడూంను రద్దు చేయవల్సిందిగా దేశ అత్యున్నత న్యాయస్థానం ఆదేశించింది.

ఈ నేపథ్యంలో సల్వాజుడూం స్థానంలో కోయకమాండోస్‌ను కోయ బెటాలియన్‌ను ఏర్పాటుచేసి వారికి శిక్షణ పేరుతో 30 వేల మంది సైన్యంను ప్రత్యక్షంగా దండకారణ్యంలోకి దింపి ఏయిర్‌బేస్‌లు మానవ రహిత విమానాలు ఏర్పాటుచేసుకుంటూ ఆపరేషన్ గ్రీన్‌హంట్ రెండవ ఫేస్‌ను జూలై 2010లో మొదలుపెట్టారు. మొదటి ఫేస్‌లో గృహ దహనాలు, అత్యాచారాలు, లూటీలు, హత్యలు ఇలాంటి భయంకరమైన విధ్వంసాలు కొనసాగాయి. రెండవ ఫేస్‌లో వాటితో పాటు మానవ రహిత విమానాలు, ఏయిర్‌ఫోర్స్‌తో అనుసంధానిస్తూ బలగాల దాడి కొనసాగుతున్నది. 2011 మార్చి 17న జరిగిన చింతల్‌నార్ సంఘటన రెండవ ఫేస్‌లో భాగంగా జరిగిందే. ప్రపంచానికంతటికి చింతల్‌నార్‌లో భారీ ఎన్‌కౌంటర్‌గా మీడియాకు ప్రచారం చేసిన సంఘటన వాస్తవంగా జరిగింది. మానవ మృగాల రాక్షస క్రీడ 15 కిలోమీటర్ల పరిధిలోని తాడిమెట్ల, మోర్‌పల్లి, తిమ్మాపూర్ గ్రామాలపై ఒక్కో గ్రామంలో 300 మంది బలగాలు ఏయిర్‌ఫోర్స్‌లో అనుసంధానించుకుంటూ ఉదయం 7 గంటలకే దాడి మొదలుపెట్టి గ్రామాలకు గ్రామాలనే తగలబెడుతూ దొరికిన వారిని బందీలుగా చేస్తూ మహిళలపై అత్యాచారాలు చేస్తూ భీభత్సం సృష్టించారు. ప్రధానంగా రెండవ ఫేస్‌లో మానవ రహిత విమానాలు ఏరియల్ సర్వే బేస్ చేసుకుని 20 కిలోమీటర్ల పరిధిలో వలయాకారంలో వేల సంఖ్యలో ఆ ప్రాంతాన్ని చుట్టుముట్టి వారి దాడిని కొనసాగిస్తున్నారు. డిసెంబర్ 19, 2011న మరియు జనవరి 10, 2012న కేడేవాల్ అనే గ్రామం (సుకుమా జిల్లా)లో తొమ్మిది యుద్ధ హెలిక్యాప్టర్ల ద్వారా 900 మంది సైన్యం (ఏయిర్‌ఫోర్స్) దాడి చేసి 12 మందిని తీసుకెళ్ళారు. వారిలో 8 మందిని వదిలారు. నలుగురి జాడ నేటికీ తెలియడం లేదు. మానవ రహిత విమానాలు అడివిచుట్టూ సంచరిస్తూ ఆదివాసీ సమాజాన్ని భయాందోళనకు గురిచేస్తున్నాయి. వాటి ఏరియల్ సమాచారం ఆధారం చేసుకుని ఏరియల్ ఫైరింగ్ చేస్తున్నారు. దీనివల్ల మనిషి రాజ్యాంగం కల్పించిన జీవించే హక్కు కోల్పోవడంతోపాటు స్వేచ్ఛగా సంచరించే హక్కు కూడా కోల్పోతున్నాడు. రైట్‌టు ప్రైవసీ లేకుండా పోతుంది. ఈ విమానాల శబ్ధం వినపడిన వెంటనే ప్రజలు వారి పనిని వదిలి పెట్టి భయం భయంగా చెట్ల చాటుకు పరిగెదుతున్నారు. నిత్యం భయం గుప్పిట్లో బతుకుతున్నారు. హెలిక్యాప్టర్ల ద్వారా బాంబింగ్ చేయాలనే ఆలోచన కూడా రెండవ ఫేస్‌లో ఉంది. అందుకే ఆపరేషన్ గ్రీన్‌హంట్ అంటే 'డిస్‌ప్లేస్‌మెంట్ ఆఫ్ ఆదివాసి అండ్ జినోసైడ్ ఆఫ్ ట్రైబల్' మొత్తం జాతిని నిర్మూలించే దుర్మార్గమైన చర్యకు రాజ్యం పూనుకుంది.

అందులో భాగమే అడ్మినిస్ట్రేషన్ (పరిపాలన) దగ్గరగా ఉండడం కోసం జిల్లాలను చిన్న చిన్న జిల్లాలుగా విడదీస్తున్నారు. మొదట బస్తర్‌ను విడదీశారు. నేడు దంతేవాడ నుండి సుకుమ జిల్లాను వేరు చేశారు. చిన్న చిన్న జిల్లాలు ఉంటే బలగాల మోహరింపు ఎక్కువ చేయవచ్చు. అదే విధంగా బలగాల కాన్సన్‌ట్రేషన్ పెంచవచ్చుననే ప్రభుత్వ ఆలోచన. వాస్తవంగా చెప్పాలంటే భారత సైన్యమే ప్రత్యక్షంగా దేశ సంపదను కాపాడుతున్న భారత పౌరుల మీద యుద్ధం చేస్తున్నది. ప్రస్తుతం పోలీస్ ఇంటరాగేషన్‌లో కూడా మార్పులు తెచ్చారు. మనిషిని 24 గంటలు ప్రశ్నలు ప్రశ్నలు ప్రశ్నలే. ప్రశ్నలతో మనిషిని మానసికంగా క్రుంగదీస్తున్నారు. ఇదొక మైండ్ గేమ్.

మొత్తానికి రెండవ ఫేస్‌లో ప్రభుత్వ విధ్వంసం చాలా భయంకరంగా ఉండబోతుంది. దీని తరువాత మొత్తం ఏడు ఫేస్‌లలో గ్రీన్‌హంట్‌ను కొనసాగించాలనేది ప్రభుత్వ నిర్ణయం. ఒక్కోఫేస్ నుండి మరొక ఫేస్‌కు పోయే కొద్ది రాజ్యం యొక్క క్రూరత్వం పెంచుకుంటూ మరోవైపు ఎల్ఐసి (లో ఇన్‌ఫ్లేక్టివ్‌కాంప్లెక్స్) పాలసీని అమలు చేసుకుంటూ రాజ్యం తన దాడిని కొనసాగిస్తుంది. ఇవాల దేశం మొత్తంగా జరుగుతున్న ఎన్‌కౌంటర్లన్నీ కూడా గ్రీన్‌హంట్‌లో భాగంగానే జరుగుతున్నాయని మనమెందుకు మాట్లాడుకుంటున్నామంటే గ్రీన్‌హంట్‌లో భాగంగానే దేశవ్యాప్తంగా స్పాటర్స్‌ను నియమించారు. ఆయా స్పాట్‌లలో ఉన్నవారు. అక్కడకు వచ్చే ఉద్యమకారులను గుర్తించి సమాచారం తెలియజేస్తారు. ఉద్యమకారులను పట్టుకొచ్చి కాల్చిచంపి ఎన్‌కౌంటర్ కథ చెబుతున్నారు.

అసలు ఇంత విధ్వంసం ఎందుకు చేస్తున్నారో? ఆదివాసీ సమాజాన్ని అంతం చేసి దుర్మార్గమైన చర్యలకు ప్రభుత్వం ఎందుకు పూనుకుంది అని ప్రశ్నించుకుంటే ఆదివాసీ కాళ్ళకింది భూమి పొరల్లో ఖనిజ సంపద ఉంది. సంపదనంతటిని బహుళజాతి కంపెనీలకు అప్పనంగా కట్టబెట్టడానికి ప్రభుత్వం ఎంఒయులు చేసుకుంది. ఒక్కపాత బస్తర్‌లోనే 92 ఎంఒయులు చేసుకుందంటే ఎంతపెద్ద ఎత్తున దేశ సంపదను దోచిపెడుతున్నారో అర్థమవుతుంది. ఆ దోపిడీని ఆదివాసీలు అడ్డుకుంటున్నారు. ఈ దేశ సంపద ఎల్లలు దాటకుండా కాపాడుతున్నారు. ప్రభుత్వం మాత్రం దోపిడీని కాపాడడానికి ఆదివాసీలపై విధ్వంసాన్ని కొనసాగిస్తుంది. ప్రభుత్వాలే దోపిడీని కొనసాగిస్తూ ఆ దోపిడీని అడ్డుకుంటున్న వాళ్లపై అభివృద్ధిని అడ్డుకుంటున్నారనే దుష్ప్రచారం చేస్తుంది. పైగా 'దండకారణ్యం'లో శాంతి పరిరక్షణ కొరకే బలగాలు ప్రయత్నిస్తున్నాయని, అందుకే బలగాలను పెంచుతున్నామని ప్రచారం చేస్తూ మధ్య తరగతిని పక్కదారి పట్టించే ప్రయత్నం చేస్తుంది.

ప్రభుత్వం కొనసాగిస్తున్న విధ్వంసం వలన వారి జీవితాలను, మన ప్రాణాలను, ఆస్తి నష్టాలే కాక వారి సంస్కృతి కూడా ధ్వంసం అయిపోతున్నది. ఈ విధ్వంసం ఇలాగే కొనసాగితే వారి సంస్కృతికి వారసత్వం లేకుండా పోతుంది. ఈ విధ్వంసాన్ని సమాజం ముందుకు తీసుకురావాలనుకునే 'సోనిసారి'లాంటి వాళ్ళను చెప్పుకోవడానికే

### కర్నూలు మహాసభల ప్రసంగపాఠం

# దండకారణ్య అభివృద్ధి నమూనా ప్రగతి భావన

- పాణి

ఈ శీర్షికలో అభివృద్ధి, ప్రగతి అనే రెండు పదాలున్నాయి. దండకారణ్యంలో మావోయిస్టుల నాయకత్వంలో ఆదివాసులు చేపట్టిన అభివృద్ధి నమూనాను విశ్లేషించడానికి ఈ రెండు భావనలను వాటి కచ్చితమైన అర్థంలో ఆసరా చేసుకోవాలి. ఇలాంటి ప్రయత్నం ఏదైనా పండిత చర్చగా కాకుండా ఆచరణ యోగ్యమైన పునాది మీద సాగాలి. ఎందుకంటే మార్క్సిస్టులకు సంబంధించినంత వరకు ఏ ఆలోచనకైనా ఆచరణాత్మక ప్రయోజనమే గీటురాయి. ఆచరణయోగ్యంకాని మేధో ప్రదర్శనగాని, శాస్త్రీయమైన కచ్చితత్వం లేని భావజాల ప్రేరిత సంవాదనగాని మార్క్సిజానికి సరిపడదు.

ఈ రెండు జాగ్రత్తలు తీసుకుంటూ నాకు అప్పగించిన అంశంలోకి నేరుగా వెళ్లిపోతాను. దండకారణ్య అభివృద్ధి నమూనా - ప్రగతి భావన అనే ఈ విషయంపై మాట్లాడటానికి నేను ఒక చట్రాన్ని తయారు చేసుకున్నాను. ఇది ఈ అంశంపై సమగ్ర పరిశీలనకు ఎంత వరకు ఉపయోగపడుతుందోగాని, ఈ సందర్భంలో నా ప్రసంగానికి మాత్రం బాగా సరిపోతుందనే నమ్మకం ఉంది. 1. దండకారణ్యంలో అమలవుతున్న ప్రత్యామ్నాయ అభివృద్ధి వివరాలు. 2. అభివృద్ధి, 3. ప్రగతి, 4 గ్రీన్‌హంట్ సందర్భంలో ప్రత్యామ్నాయ అభివృద్ధి చర్చ అనే నాలుగు విభాగాలు ఈ పరిశీలనా చట్రంలో ఉన్నాయి.

ఇంకోలా చెప్పాలంటే దండకారణ్యంలో ఇప్పటికే అమలవుతున్న ప్రత్యామ్నాయ అభివృద్ధిపై విశ్లేషణ నుంచి... గ్రీన్‌హంట్ సందర్భంలో ప్రత్యామ్నాయం గురించిన చర్చను ముందుకు తీసుకపోవడం అనే ఆచరణాత్మక అన్వేషణకు అభివృద్ధి, ప్రగతి అనే రెండు భావనలపై మార్క్సిస్టు విశ్లేషణ ఊతం ఇస్తుంది. అంటే - అభివృద్ధి, ప్రగతి అనే కాళ్లపై ఈ పరిశీలనా చట్రం నిలబడి ఉంటుంది. ఇంకా చాలా విషయాలకు ప్రాధాన్యత ఉన్నా నేను ఈ చట్రానికి పరిమితమవుతాను. అందువల్ల కొన్ని విషయాలను వ్యూహాత్మకంగా పక్కన పెట్టాల్సి వస్తుంది. దీన్ని గమనించాలని మనవి.

దండకారణ్య ఉద్యమం ఆధునిక భారతదేశ చరిత్రలో చాలా విశిష్టమైనది. బహుశా అంత విస్తృతి, లోతు, సుస్థిరత ఉన్న ఉద్యమం మరొకటి లేనట్టే. వలసవాదానికి, భూస్వామ్యానికి వ్యతిరేకంగా వందల ఏళ్ల నుంచి భారత ఉప ఖండంలోని మైదాన ప్రాంత ప్రజలు చేసిన ఎన్నో ఉజ్వల పోరాటాల కన్నా, తరతరాలుగా ఆదివాసులు చేస్తూ వచ్చిన పోరాటాలకన్నా కూడా ఇవ్వాల్టి దండకారణ్య

---

జుగుప్స కలిగే విధంగా హింసిస్తున్నారు. సోనిసొరి చత్తీస్‌ఘడ్‌లో ఒక టీచర్. ఈమె అక్కడి పోలీసుల వేధింపులు భరించలేక ఢిల్లీలో ఉన్న మిత్రులకు విషయం చెప్పుకోవడానికి పోయింది. ఆమెను వెంటాడిన పోలీసులు ఢిల్లీలో అరెస్టు చేసి తీవ్రమైన చిత్రహింసలు పెట్టి అత్యాచారం జరిపారు. అపస్మారక స్థితిలో ఉన్న ఆమెను వైద్య పరీక్షలు జరిపించగా ఆమె మర్మాంగాల్లో రాళ్లు దొరికాయి. ఇంతకంటే భయంకరం ఏముంటుంది. ఆమెను హింసించిన పోలీసు అధికారికి రాష్ట్రపతి అవార్డు ఇచ్చి సత్కరించింది. మన ప్రజాస్వామ్య ప్రభుత్వం.

వాస్తవంగా ఆపరేషన్ గ్రీన్‌హంట్ ప్రారంభించిన 5 సంవత్సరాలలో అక్కడి ఉద్యమాలను నిర్మూలించాలనేది కేంద్ర ప్రభుత్వ లక్ష్యం. ఆ లక్ష్యం నెరవేరడానికి అతి ప్రాచీనమైన ఒక మానవ సముదాయాన్ని నిర్మించడానికి సిద్ధపడింది. ఇందు కోసం గత మే నెలలో బి గ్రేడ్ స్థాయి సైన్యాన్ని దండకారణ్యంలో దింపారు. గత ఆరు సంవత్సరాలుగా సైన్యాధికారులే మార్గదర్శకత్వం వహిస్తున్నారు. కాంకేర్, ఉత్తర్ చత్తీస్‌ఘడ్‌లలో కౌంటర్, టెర్రరిజం, జంగిల్ వార్‌ఫేర్ స్కూళ్లను ఏర్పాటుచేసి అనేక సార్లు అమెరికా, కన్సూలేట్ అధికారులు ఇక్కడికి వచ్చి వెళ్లారు. కనుక భారత ప్రజల మీద కొనసాగుతున్న యుద్ధం అమెరికా సామ్రాజ్యవాదుల కనుసన్నల్లో కొనసాగుతుంది. అందుకే ఇది సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఆదివాసీలు చేస్తున్న యుద్ధం. భవిష్యత్తులో ఎంఒయులు కుదుర్చుకున్న కంపెనీలే ఆర్మీని సప్లైయ్ చేస్తారు. ఈ ప్రైవేటు సెక్యూరిటీ ఫోర్స్‌ను లీగలైజ్ చేసే ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. ఇప్పటికే ఆఫ్ఘనిస్తాన్, పాలస్తీనాలలో కంపెనీల ప్రైవేటు సైన్యం ఉద్యమించే ప్రజలను అణచివేస్తున్నాయి. ఇదే విధానంను దండకారణ్యంలో అమలు చేయడానికి ఆలోచనలు కొనసాగుతున్నాయి. ఇప్పుడైతే సల్వాజుడూం చట్టవిరుద్ధమని కనుక రద్దుచేయాలని కోర్టులు మాట్లాడుతాయి. కానీ ప్రైవేటు సైన్యం వస్తే కోర్టులు కూడా మాట్లాడలేవు. అయినా వీటన్నింటిని ఎదుర్కోవడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారు. బయట ఉన్న మేధావులు మాత్రం యుద్ధం చేస్తున్న క్రమంలో ప్రజల వైపు నుండి జరిగే తప్పులను వెతుకుతున్నారు.

ఆపరేషన్ గ్రీన్‌హంట్ ఏడు ఫేజ్‌లు అంతమయ్యే వరకు ఇంకా భీకర యుద్ధం జరిగే ప్రమాదముంది. ఆ యుద్ధాన్ని ఆపడానికి బయట ఉండే మనం ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలి. యుద్ధం జరుగుతున్న సందర్భంలో జరిగే విధ్వంసాన్ని ఎప్పటికప్పుడు ప్రచారం చేయవల్సిన అవసరం మనందరి మీద ఉంది. ఆదివాసులను అడవి నుండి తరిమివేసి అక్కడి వనరులను, ఖనిజాలను బహుళజాతి కంపెనీలకు అప్పజెప్పడానికి తన ప్రజలపైనే యుద్ధం ప్రకటించిన ప్రభుత్వాన్ని నిలదీయాలి.



ఉద్యమానికి చాలా ప్రత్యేకతలు ఉన్నాయి. ప్రపంచంలో పెట్టుబడికి ప్రత్యామ్నాయం లేదని వాల్‌స్ట్రీట్ శక్తులు విర్రవీగుతున్న సమయంలో దండకారణ్య పోరాటం గొప్ప ఉత్సాహాన్ని ఇస్తోంది. సోవియట్ యూనియన్, జనచైనా కూలిపోయాక ఈ నేల మీద విప్లవానికి చోటు ఉన్నదా? అని తర్కించుకొనే సంశయజీవులకూ, నిరాశావాదులకూ దండకారణ్యం జేగీయమానమైన ఉదాహరణ. అందువల్లనే ప్రపంచవ్యాప్తంగా ఆలోచనాపరులను, పోరాట ప్రజలను దండకారణ్యం ఆకట్టుకుంటోంది.

అయితే ఇందులో రాజకీయ అంశతోపాటు, ఎక్కువగా భావజాల ప్రేరితమైన ఉద్వేగం కూడా సహజంగానే ఉంటుంది. ఇది పోరాట ప్రజలకు చాలా అవసరం. అయితే ఈ రెంటినీ దాటి సైద్ధాంతికంగా దండకారణ్య ఉద్యమంలోని విశిష్టతలు, ప్రత్యేకతలు ఏమిటి? వాటిలోకి తొంగి చూడాలంటే మన సిద్ధాంత ఒరవడిలో ఏమైనా మార్పుచేర్పులు అవసరమా? వీటిని గుర్తించడం వల్ల భారత ప్రజలు అనన్య త్యాగాలతో నిర్మిస్తున్న ఈ విప్లవోద్యమానికి ఏదైనా మేలు జరుగుతుందా? అనే ప్రశ్నలు వేసుకోవచ్చు. వాటన్నిటికీ ఇక్కడే సమాధానం రాబట్టలేం. అయితే దండకారణ్య అభివృద్ధి నమూనా– ప్రగతి భావన అనే అతి కీలకమైన అంశాన్ని చర్చించుకొనేటప్పుడు మన ఆలోచనాసీమలో ఈ ప్రశ్నలకు కాస్త చోటు ఉంచుకొని ముందుకుపోవడం బాగుంటుంది.

1. దండకారణ్యంలో అమలవుతున్న ప్రత్యామ్నాయ అభివృద్ధి వివరాలు:

భారత పాలక వర్గాలు 1990లలో ప్రపంచీకరణ అనే నూతన ఆర్థిక విధానాలను ప్రారంభించిన సమయంలోనే దండకారణ్యం ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా ముందుకు వచ్చింది. తెలుగుదేశం పార్టీ నేతృత్వంలో ఆంధ్రప్రదేశ్ ప్రపంచబ్యాంకు ప్రయోగశాలగా మారిపోయాక, ప్రభుత్వం చేపట్టిన రకరకాల అభివృద్ధి పథకాలపై తీవ్ర చర్చ జరుగుతున్న కాలమది.

1995లో ఆనాటి పీపుల్స్‌వార్ స్పెషల్ కాంగ్రెస్ ఉత్తర తెలంగాణ, దండకారణ్యాలను గెరిల్లా జోన్లుగా అభివృద్ధి చేయాలని తీర్మానించింది. విప్లవ పార్టీ నిర్వహించే ప్రతి నిర్మాణ సమావేశమూ ఆ పార్టీ చరిత్రలో కీలకమైనదే. ఈ స్పెషల్ కాన్ఫరెన్స్‌కు కూడా ఆనాటి పీపుల్స్‌వార్ చరిత్రలో చాలా ప్రత్యేక స్థానం ఉంది. ఒక రకంగా ఆ పార్టీ ఆధ్వర్యంలో నడుస్తున్న విప్లవోద్యమాన్ని ఒక ముఖ్యమైన మలుపు తిప్పిన మహా సభ అది. పేరులో విశేషణంగా స్పెషల్ అని ఉండడం కాదు, మొత్తంగానే విప్లవోద్యమానికి అత్యవసరమైన అవగాహనను, కార్యక్రమాన్ని ఆ మహాసభ అందించింది.

దున్నేవారికే భూమి అనే నినాదం ఇరుసుగా అప్పటికి పాతికేళ్లుగా సాగిన వ్యవసాయక విప్లవ కార్యక్రమం ఒక దశ నుంచి మరో గుణాత్మక దశలోకి సాగుతున్న కాలంలో మారుతున్న పరిస్థితులను అతి సన్నిహితంగా చూసి విప్లవపార్టీ రూపొందించిన కార్యక్రమం అది. స్థానిక వనరులు, ప్రజల సమిష్టి కృషి, స్వావలంబనపై ఆధారపడిన ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను ఉత్పత్తిదాయకమైన ప్రజల చేతిలో ఆయుధంగా పెట్టిన మహా సభ అది.

అట్లా ప్రజా ప్రత్యామ్నాయమనే మాటకు ఆచరణాత్మక విప్లవ కార్యక్రమం రూపొందింది. ఇవాళ మనం చర్చిస్తున్న అన్ని విషయాలనూ, నిర్బంధాన్నీ, తెలంగాణ - ఆంధ్ర- రాయలసీమల్లో విప్లవోద్యమం దెబ్బతినడాన్ని కూడా ఈ నేపథ్యంలో చూడకపోతే సవ్యంగా అర్థం కావు.

ఒక రకంగా దేశంలో అభివృద్ధి నమూనాల చర్చ కూడా అప్పటి నుంచి వేగం పుంజుకుంది. వలసానంతరం మిశ్రమ ఆర్థిక విధానంలో ప్రణాళికాబద్ధ అభివృద్ధిని చేపట్టిన భారత పాలకవర్గాలు 1990ల నాటికల్లా నూతన ఆర్థిక విధానాలను తీసుకువచ్చాయి. సుమారుగా ఇవి రెండూ రెండో ప్రపంచ యుద్ధం తరువాత ప్రపంచ పెట్టుబడిదారీ విధానం పనితీరులో వచ్చిన మార్పులను సూచిస్తాయి. యుద్ధాలు, ఆర్థికమాంద్యం, వలస వ్యతిరేక పోరాటాలు అనే సంక్లిష్టమైన దశలో ప్రపంచ పెట్టుబడిదారీ విధానం తీవ్ర సంక్షోభంలో చిక్కుకొని, దాన్నుంచి బైటపడడానికి తయారు చేసుకున్న కొత్త ప్రపంచ ఆవరణకు సంబంధించినవి ఇవి.

అంతే కాదు. వలసానంతరం దేశంలో అంతర్గతంగా జరిగిన మార్పులను కూడా ఈ విధానాలు సూచిస్తాయి. మిశ్రమ ఆర్థిక విధానం, ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానం అనే వాటి నుంచి నూతన ఆర్థిక విధానాల దాకా భారత పాలకులు ప్రయాణించారు. ఈ నూతన ఆర్థిక విధానంలోని నూతనత్వం ఏమిటి ? నూతన అనే విశేషణంలో దాగి ఉన్న అంతరార్థం ఏమిటి ? అనేవి సాధారణ ప్రజలు తమ జీవితానుభవం ద్వారా అతి కొద్ది కాలంలోనే తెలుసుకున్నారు.

సరిగ్గా ఆ సమయంలోనే మావోయిస్టుల నేతృత్వంలో ప్రత్యామ్నాయ అభివృద్ధికి రూపకల్పన జరిగింది. బూర్జువా వర్గాలు చేపట్టిన ప్రయోగానికి ప్రత్యామ్నాయంగా మావోయిస్టుల ఆధ్వర్యంలో ప్రజలు ఉత్తర తెలంగాణ, దండకారణ్య అభివృద్ధి నమూనాను ముందుకు తెచ్చారు. ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో ముడిపడి ఉన్న భారత ఆర్థిక వ్యవస్థకు ప్రత్యామ్నాయాన్ని నిర్మించాలనే ఆశయంతో ఈ నమూనా తయారైంది.

కాబట్టి ఇవాళ మనం ప్రత్యామ్నాయం అనే మాటను ఇంత విశాలమైన, గంభీరమైన అర్థంలో అంటున్నామని మర్చిపోవడానికి వీల్లేదు. మార్క్సిస్టులు ప్రత్యామ్నాయమనే మాటను తప్పక ఇట్లాగే వాడాలి.

ఇంకోలా చెప్పాలంటే పెట్టుబడిదారీ విధానానికి సోషలిజం ప్రత్యామ్నాయమనే స్ఫూర్తితో ఈ మాట ఉపయోగిస్తున్నామనే ఎరుక చాలా అవసరం. దండకారణ్యంలోని అభివృద్ధి నమూనా గురించి మాట్లాడడానికి, మొత్తంగానే పెట్టుబడిదారీ విధానానికి దేశ వ్యాప్తంగా అవసరమైన ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాల గురించిన లోతైన విమర్శనాత్మక విశ్లేషణకు ఈ ఎరుక ఊతం ఇస్తుంది.

అప్పుడు దండకారణ్యం అభివృద్ధి నమూనా గురించి రాజకీయ పరిభాషలో చెప్పడమేకాక దాన్ని ఒక సామాజిక ప్రయోగంగా గుర్తించగలం. రూపొందుతూ ఉన్న ఒక సామాజిక వ్యవస్థను

సుస్థిరంగా నిలిపి ఉంచగల అంశాల వైపు నుంచి, అవకాశాల వైపు నుంచి ఆ నమూనాను విశ్లేషించడానికి వీలుంటుంది.

స్పెషల్ కాన్ఫరెన్స్‌లో ఉత్తర తెలంగాణ, దండకారణ్య ఉద్యమాలను ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా పునాది మీద పురోగమింప చేయాలనే నిర్ణయం కొత్త సామాజిక వ్యవస్థకు అవసరమైన నిర్మాణరూపాలను ముందుకు తెచ్చింది. ఉత్తర తెలంగాణ జిల్లాల్లో గ్రామరాజ్య కమిటీలు, గ్రామ అభివృద్ధి కమిటీలు, సహకార సంఘాలు, పంచాయతీ సంఘాలు అనే నిర్మాణాల ద్వారా జీవితంలోని అన్ని రంగాల్లో ప్రజల సమిష్టి ఆచరణ మొదలైంది. పాలకవర్గం తన అభివృద్ధి నమూనాలో భాగంగా రకరకాల అభివృద్ధి పథకాల పేరుతో ప్రజలను చేరువ చేసుకుంటున్న సమయంలో విప్లవోద్యమం ప్రజలను పోరాటాల్లో దృఢంగా నిలబెట్టడానికి, వాళ్ల మౌలిక అవసరాలు తీర్చడానికి ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను తీసుకొని వచ్చింది.

ఉత్తర తెలంగాణలో ఈ ప్రయత్నం గురించి తెలుసుకోడానికి అమరుడు నల్లా ఆదిరెడ్డి(శ్యాం) రాసిన రెండు వ్యాసాలు ఉపయోగపడుతాయి. ఉత్తర తెలంగాణ ఉద్యమం గురించి, ప్రత్యేకంగా నిజామాబాద్ ఉద్యమం గురించి ఆనాటికే ఆయన చాలా మంచి పరిశీలనలు చేశారు. ప్రత్యామ్నాయ అభివృద్ధి అనేదానికి ఉండే విస్తృతి గురించి అందులో రాశారు. దాని సారాంశం ఏమంటే- ప్రజల దైనందిన అవసరాలు అర్థవంతంగా తీరడం, వాళ్ల నైపుణ్యాలు పెరగడం, వనరులను సరైన అవగాహనతో ఉపయోగించుకోవడం, అంతిమంగా ఉత్పాదకత పెంచుకోవడం. ఈ పనులు చేయడానికి అవసరమైన నిర్మాణాలను, వాటి పని విధానానికి అవసరమైన పద్ధతులను తయారు చేసుకోవడం.

కానీ ప్రత్యామ్నాయ కార్యకలాపాల్లో వర్గపోరాటం లోపించి ఆర్థికవాదం ప్రబలుతున్నదనే ముఖ్యమైన పరిశీలన ఆయన చేశారు. గ్రామ రాజ్య కమిటీలో సభ్యులుగా ఉన్నవారే ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ తిరుగుతూ గవర్నమెంట్ పథకాలను గ్రామానికి తీసుకరావడానికి ప్రయత్నిస్తున్నారని కూడా ఆయన రాశారు. ఇది ఆర్థికవాద వ్యక్తీకరణ అన్నమాట.

ప్రత్యామ్నాయ అభివృద్ధి అనే సామాజిక ప్రయోగంలో ఎదురైన అతి ముఖ్యమైన సమస్య ఇది. ఉత్తర తెలంగాణ ఉద్యమం దెబ్బతినడానికి ఎన్నయినా కారణాలు ఉండవచ్చు. చాలా గంభీరమైన అలాంటి విషయాలను బైటి నుంచి అంచనా వేయడం సాధ్యం కాదు. నిర్బంధం మొదటి నుంచీ ఉన్నదే అయినా ప్రత్యామ్నాయ అభివృద్ధి దిశగా కృషి మొదలయ్యాక అణచివేత చాలా తీవ్రస్థాయికి వెళ్లింది.

దేశవ్యాప్తంగా విప్లవోద్యమం మీద అమలైన నిషేధ, నిర్బంధాల వెనుక ప్రత్యామ్నాయ అభివృద్ధి అమలు అనేది చాలా కీలకం. 'అభివృద్ధి'ని కేంద్రం చేసుకొని అధికారాన్ని సుస్థిరం చేసుకోవాలని, దోపిడీకి మేలు ముసుగు తొడగాలని పాలకవర్గం అనుకున్నాక ప్రత్యామ్నాయాన్ని సహించలేకపోయింది. దారుణమైన నిర్బంధానికి, కుట్రలకూ పాల్పడింది.

ఉత్తర తెలంగాణ ఉద్యమం వెనక్కిపోవడానికి ఇదొక ముఖ్య కారణం. అయితే ఈ ఒక్కటే ఏకైకం కాదు. శ్యాం గుర్తించినట్లు ... వర్గపోరాటం లోపించి ఆర్థికవాదం పొడసూపడానికి కారణం ఏమిటి? అనే ప్రశ్న కూడా వేసుకోవాల్సిందే. బూర్జువా రాజకీయ, ఆర్థిక వ్యవస్థల ప్రభావం గట్టిగా ఉన్నచోట ఈ రకమైన సమస్య ఎదురైందని ఊహించవచ్చు.

ఇందులో రెండు అంశాలున్నాయి. ఒకటి: 1990ల తర్వాత బూర్జువా రాజకీయ వ్యవస్థ చాలా క్రియాశీలమైంది. రెండు: బూర్జువా రాజకీయార్థిక వ్యవస్థ అనేక రూపాల్లో విస్తరించింది. వీటిని నల్లమల చెంచు ఆవాసాల వైపు నుంచి అర్థం చేసుకోవడం తేలిక. అత్యంత వెనుకబడిన, ఆదిమ తెగ అయిన చెంచు గూడేల్లోకి కూడా బూర్జువా రాజకీయ వ్యవస్థ, రాజకీయార్థిక వ్యవస్థ 1990ల నుంచి వెళ్లిపోయాయి. సమాజంలోని మారుమూల జన సముదాయాలన్నీ కూడా బూర్జువా వ్యవస్థల బాహువుల మధ్యకు వెళ్లిపోయాయి. బూర్జువా రాజ్యం, ఆర్థిక వ్యవస్థ అంతక ముందటి మందగమనాన్ని వదిలించుకొని క్రియాశీలమై కాకులు దూరని కారడవుల్లోకి కూడా వెళ్లిపోయాయి. వలసానంతరం రాజ్యాంగం ద్వారా హామీ పడి, అంత వరకు నిర్లక్ష్యం చేసిన జన సముదాయాలను పట్టించుకోక తప్పని అనివార్యమైన వొత్తిడికి రాజ్యం గురైంది. దీనికి ఆ సమూహాల పోరాటాలే కారణం. దీంతో రాజ్యం యాక్టివ్‌గా మారి ఆ ప్రాంతాల్లోకి వెళ్లాల్సి వచ్చింది. అంతకంటే యాక్టివ్‌గా మార్కెట్ వెళ్లిపోయింది. రాజ్యం ఆదివాసీలను ఓటర్లగా మార్చివేస్తే, మార్కెట్ వాళ్లను వినియోగదారులుగా మార్చివేసే ప్రక్రియ మొదలుపెట్టింది. కార్పొరేట్ శక్తులు ఏకంగా వాళ్లను నిర్వాసితులను చేసే వ్యూహంతో వెళ్లాయి. ఈ పరిణామం ఒక్కో ప్రాంతంలో ఒక్కో స్థాయిలో, ఒక్కో రూపంలో జరిగింది.

ఇట్లా వేగవంతమైన, లోతైన పరిణామాలు జరుగుతున్న సమాజమనే మొత్తంలో భాగంగా విప్లవకారుల ప్రత్యామ్నాయ ప్రయత్నాలను అర్థం చేసుకోవాలి. శ్యాం చేసిన పరిశీలనలు ఈ వైపు నుంచి చూడాలి. ప్రత్యామ్నాయ ప్రయత్నాల్లో ఆర్థిక వాదం పొడసూపడానికి, పాలకవర్గ అభివృద్ధి నమూనా ప్రభావం చూపడానికి కారణం ఇదే. బూర్జువా వ్యవస్థలకు కేటాగా మనం ప్రత్యామ్నాయం నిర్మించడం లేదు...అనే అవగాహన చాలా గాఢమైన వెలుగును పంచుతుంది. మామూలుగానైతే ఇది చాలా చిన్న విషయం అనిపిస్తుంది. ఆ స్థాయిలో కూడా మాట్లాడుకోవచ్చు. కానీ శ్యాం రాజకీయ నిర్మాణ పార్శ్వాల్లో గుర్తించిన విషయాలకు సైద్ధాంతిక కోణం కూడా ఉంది.

ఆ వైపు నుంచి చూస్తే ప్రత్యామ్నాయం గురించి అవసరమైన ఆలోచనలు చాలా చేయవచ్చు. ఉత్తర తెలంగాణలో ప్రత్యామ్నాయ ప్రయత్నం అర్ధాంతరంగా నిలిచిపోవడానికి, దండకారణ్యంలో పురోగమించడానికి కూడా కారణాలు దొరుకుతాయి. అట్లాగే దండకారణ్యంలో రూపొందుతున్న ప్రత్యామ్నాయం ముందు కూడా ఏమైనా సమస్యలున్నాయా? అనే వైపు ముందస్తుగా చూపు సారించే వీలు దొరుకుతుంది.

ఉత్తర తెలంగాణ మీద ఉన్న తాకిడి దండకారణ్యం మీద కూడా ఉంది. బూర్జువా రాజ్య వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థ దండకారణ్యంలోకీ చొరబడడానికి ప్రయత్నించింది. అయితే 1980 నుంచే అక్కడ బలమైన రాజకీయ ఉద్యమం ఉన్నందు వల్ల పరిస్థితి చాలా భిన్నంగా ఉన్నది. పదహేనేళ్లకల్లా అక్కడ ఉద్యమం చాలా ఉన్నత స్థాయికి వెళ్లి ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా శరవేగంగా దండకారణ్యమంతా విస్తరించింది. అతి కొద్ది కాలంలోనే అదొక పటిష్టమైన వ్యవస్థగా నిలదొక్కుకోగలిగింది.

బూర్జువా వ్యవస్థల ప్రభావం దండకారణ్యం మీద కూడా ఉన్నా, భౌగోళికంగా, సామాజికంగా కూడా ఉత్తర తెలంగాణ కంటే దండకారణ్యం వాటికి దూరం. దీంతో ప్రత్యామ్నాయ ప్రయత్నాలకు అక్కడిలా అవరోధాలు ఎదురుకాలేదు. ఆదివాసీ సామాజిక వ్యవస్థ - బూర్జువా వ్యవస్థ వేర్వేరు సామాజిక దశలకు సంబంధించినవి. వాటి మధ్య సంఘర్షణ చాలా తీవ్రంగా సాయుధరూపం తీసుకున్నది.

బూర్జువా వ్యవస్థలు దండకారణ్యం ఛాయలకు కూడా వెళ్లలేదనే వాదన చేస్తే దండకారణ్యంలో సాగుతున్న విప్లవ ప్రక్రియను లోతుగా వివరించే అవకాశం కోల్పోతాం. అక్కడికి పెట్టుబడి, రాజ్యం ప్రవేశించడానికి అనేక కుటిల ప్రయత్నాలు చేస్తోంది. ఆదివాసీ సమాజాన్ని తన ఆధీనంలోకి తెచ్చుకోవాలనేగాక అక్కడ నిర్మాణమవుతున్న ప్రత్నామ్నాయ వ్యవస్థలను ధ్వంసం చేయడం కూడా బూర్జువా వ్యవస్థల లక్ష్యం. దీనిని సాల్వాజుడుం చేసిన అకృత్యాల కోణంలో చూస్తే.. ఛత్తీస్‌ఘడ్‌లోఅంతులేని మానవహననం, హింస మాత్రమేగాక ప్రత్యామ్నాయ వ్యవస్థలను, ప్రక్రియలను ధ్వంసం చేయాలనుకోవడం మనకు అర్థం అవుతుంది.

ఆ సంఘర్షణలో కొంత నష్టం జరిగినా ప్రత్యామ్నాయ పునాది నిలిచే ఉన్నది. ఆపరేషన్ గ్రీన్‌హంట్ రెండో దశలోకి చేరుకున్నాక కూడా అభివృద్ధి వ్యవస్థలు నిరాటంకంగా పని చేస్తునే ఉన్నాయని ఉద్యమం నుంచి వస్తున్న నివేదికలు చెప్తున్నాయి.

2. అభివృద్ధి..:

అభివృద్ధి అంటే ఏమిటి? అనేదానికి బూర్జువా అర్థాలు చాలా ఉండొచ్చు. కానీ మార్క్సిస్టులు ఉత్పత్తి శక్తుల అభివృద్ధి, లేదా ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి దోహదపడే ఆవరణ రూపొందడం అనే అర్థంలోనే చూస్తారు. ఉత్పత్తి శక్తులకు నిరంతరాయంగా అభివృద్ధి చెందే స్వభావం ఉంటుంది. చాలా ప్రత్యేకమైన పరిస్థితుల్లోనే ఉత్పత్తిశక్తుల అభివృద్ధి కుంటుపడే అవకాశం ఉంటుంది. బైటి నుంచి దొరికే ప్రేరణ కూడా ఒక ప్రాంతంలోని ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి దోహదపడవచ్చు.

దండకారణ్యంలోకి విప్లవకారులు వెళ్లడానికి ముందూ, ఆ తర్వాతా ఆ సమాజంలో వచ్చిన మార్పులను ఉత్పత్తి శక్తుల అభివృద్ధిగా చూడవచ్చు. ఆచారాలు, తెగ కట్టుబాట్లు, పోడు వ్యవసాయ పద్ధతులు మొదట్లో బలంగా ఉండేవి. విప్లవకారులు వెళ్లాక నీటి యాజమాన్యం, పంటల్లో మార్పులు, సాగు భూమి విస్తరణ, ధాన్యం నిలువ చేసుకోవడం మొదలైన నూతన ప్రక్రియల్లో ఆదివాసులు భాగమయ్యారు. వీటి వల్ల దిగుబడి పెరిగే ఉంటుంది. అది కొత్త వ్యవస్థలను నిర్మించడానికి, పని చేయించడానికి దోహదపడింది. మార్కెట్ లేదు కాబట్టి మిగులు తిరిగి వ్యవసాయానికి వాడుకోగా ఇంకా విద్య, వైద్యం మొదలైనవాటికి వెచ్చించే అవకాశం కలిగింది. దాంతో వాళ్ల జీవనసరళిలో, చైతన్యంలో మార్పు వచ్చింది. ఇదంతా అభివృద్ధి.

దండకారణ్యంలోని ప్రత్యామ్నాయ అభివృద్ధిని ఉత్పత్తిశక్తుల అభివృద్ధిలో భాగంగా చూడాలి. అయితే దండకారణ్యంలో ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని మొత్తం భారత సమాజంలో జరుగుతున్న ఉత్పత్తిశక్తుల అభివృద్ధిలో భాగంగా చూస్తామా? లేదా? అనే ప్రశ్న కూడా వేసుకోవడం మంచిది.

అయితే- వర్గపోరాటమే అభివృద్ధి అనే భావన మార్క్సిస్టు శిబిరంలో ఉంది. దీని ప్రకారం... విప్లవోద్యమం నడిచే ప్రాంతాల్లో, వర్గపోరాట అవగాహనతో జరిగే మార్పులే అభివృద్ధి అనీ, మిగతా అంతా వృద్ధి అనీ చెప్తూ ఉంటారు. రైళ్లు, ఫ్యాక్టరీలు, విద్యుత్, ఆధునిక పద్ధతిలో వ్యవసాయం మొదలైనవన్నీ వృద్ధికి చిహ్నాలని, అభివృద్ధి జరగడమంటే చైతన్యంలో మార్పు రావడం మాత్రమే అనే వాదనలు దీని నుంచి వస్తాయి. అప్పుడు నిరంతర మార్పుల మధ్య సాగుతున్న సామాజిక పరిణామాలను వివరించడంలో కొన్ని చిక్కు సమస్యలు తలెత్తుతాయి.

ఉదాహరణకు వలసవాదులు వేసిన రైల్వే మార్గాలను ఉత్పత్తిశక్తుల అభివృద్ధిగా లేదా దానికి అవసరమైన ఆవరణ రూపొందడంగా చూస్తామా? లేక కేవలం వృద్ధిగా చూస్తామా? అనే ప్రశ్న ఎదురవుతుంది. బ్రిటిష్ రైలు మార్గాల పొడవునా అనేక భౌతిక, బౌద్ధిక మార్పులు జరిగాయి. కేవలం వర్గపోరాట క్షేత్రంలో జరిగే మార్పులే అభివృద్ధి అనుకుంటే ఈ పరిణామాలను వివరించడం సాధ్యం కాదు. అభివృద్ధి అనేది జరిగితే అది అనివార్యంగా మానవ చైతన్యంలో, భావజాలంలో వ్యక్తం కావాలనే గీటురాయి తీసుకుంటే ఉత్పత్తి శక్తుల అభివృద్ధి అంటే మానన చైతన్యంలో మార్పు అనే అర్థం రూఢిపరిచినట్లవుతుంది. దీని వల్ల భౌతికవాదమే సంక్షోభంలో పడిపోతుంది. ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ... మానవ చైతన్యానికి నేరుగా సంబంధం పెట్టడం వల్ల చిరకాలంగా భారతదేశంలో ఉత్పత్తిశక్తులు పురోగమించలేదనే నిర్ధారణ బైటికి వస్తుంది. ముఖ్యంగా చాలా సంక్లిష్టంగా, విస్తృత స్థాయిలో సాగిపోతున్న సమాజ పరిణామానికి సంబంధించిన చాలా విషయాలు మరుగునపడిపోతాయి. పైన ప్రస్తావనకు వచ్చిన దండకారణ్య అభివృద్ధి నమూనాలో, వలసవాద అభివృద్ధిలో చైతన్యం వ్యక్తమైనా ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని నేరుగా అన్ని సమయ సందర్భాల్లో చైతన్యంలో, భావజాలంలో నిర్ణాయకంగా చూడడానికి లేదు. ఉత్పత్తి శక్తుల అభివృద్ధి చాలా సంక్లిష్టమైన మాధ్యమాల గుండా మానవ చైతన్యంలో వ్యక్తమవుతుంది. ఫలానా స్థాయిలో ఉన్న ఉత్పత్తిశక్తుల అభివృద్ధి అదే స్థాయిలో వెనువెంటనే చైతన్యంలోకి అనువాదం అవుతుందని చెప్పలేం.

ఇట్లా చూడకపోతే దీన్నంతా వృద్ధి అనుకొనే ప్రమాదం ఉంది. వృద్ధి అనేది పరిమాణాన్ని సూచిస్తుంది. అందులో నెగిటివ్ కోణం

కూడా ఉంటుంది. ఈ ప్రమాణాలతో అభివృద్ధిని చూడడం వల్ల సామాజిక పరిణామాల్లోని కీలక విషయాలు విస్మరణకు గురయ్యే ప్రమాదం ఉంది.

కాబట్టి .. వర్గపోరాట శక్తుల ప్రమేయం లేని ప్రాంతాల్లోని ఉత్పత్తిశక్తుల మార్పులను కూడా అభివృద్ధిగా చూడాలి. అయితే ఈ రెండు రకాల మార్పులు వర్గ ప్రయోజనాలతో ముడిపడి ఉంటాయి. పరస్పర విరుద్ధ ప్రాతిపదికల మీద సాగేవి కాబట్టి విరుద్ధమైన అభివృద్ధి నమూనాలయ్యాయి. మొత్తం మీద ఉత్పత్తి శక్తుల అభివృద్ధి అనేది సామాజిక చరిత్రకపురోగమనానికి సంబంధించింది.

దండకారణ్యంలో ఉత్పత్తి శక్తుల అభివృద్ధి చైతన్యంలో కూడా వ్యక్తమైనా... దేశంలోని వేర్వేరు ప్రాంతాల్లో వేర్వేరు స్థాయిలో ఉన్న ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలో భాగంగా దండకారణ్యాన్ని కూడా చూడాలి. దానికి ఈ చర్చ ఉపయోగపడుతుంది. దండకారణ్యంలోని మార్పులను బైటి ప్రాంతాల మార్పులతో ముడిపెట్టి మొత్తంలో భాగంగా చూడడం బాగుంటుంది.

నిజానికి వర్గపోరాటంతో సంబంధం లేకుండా కూడా ఆదివాసీ ప్రాంతాల్లో అనేక మార్పులు జరుగుతూ వచ్చాయి. కసంక్షేమ రాజ్యం అనే భావన రంగంమీదికి వచ్చాక ఆదివాసుల అవసరాలు తీర్చడం అనే సాకుతో ఆ ప్రాంతాల్లో రాజ్యం జోక్యం చేసుకోవడం ప్రారంభించింది. దీనికి సంక్షేమరాజ్య భావనేగాక, ఆదివాసుల పోరాటాల వల్ల కలిగిన వొత్తిడి కూడా కారణం. కానీ రాజ్యం ఆ పని చేయజాలదు. అప్పుడు ప్రగతిశీల ఆలోచన ఉన్నవాళ్లు ఆదివాసులను రాజ్యం పట్టించుకోవడంలేదనే విమర్శ పెట్టాల్సి వస్తోంది. అది రాజ్య స్వభావాన్ని తెలిపే విమర్శ.

ఆదివాసీ ప్రాంతాల్లోకి పెట్టుబడి ప్రవేశించాక చాలా నెమ్మదిగా అయినా ఆదివాసులను శ్రమ శక్తి అమ్ముకునే వాళ్లుగా మార్చే ప్రక్రియ మొదలైంది. ఇది గ్రామాల్లో వలె వేగంగా, ప్రస్ఫుటంగా కనిపించదు. ఆదివాసీ సమాజాల్లోని ప్రత్యేకతలు, పరిమితుల వల్ల పెట్టుబడి వాళ్లను నిర్వాసితులను చేసినంత ఉధృతంగా శ్రామికులుగా మార్చలేదు. నిజానికి నిర్వాసితులు కావడమంటే సాంప్రదాయక జీవితానికి, అనూచాన ఉత్పత్తి విధానానికి దూరమైపోవడం. పాత కాలంలో రాజరిక శక్తులు, వలసవాదుల చొరబాటును ఆదివాసులు గట్టిగా ప్రతిఘటించిన సందర్భాలున్నట్లే.. ఆడవిలో తమ స్వస్థానాన్ని వదులుకొని ఆదివాసులు ఇంకా లోతట్టు ప్రాంతానికి వెళ్లిపోవడం కూడా జరిగింది. వాళ్ల లోతైన జీవన మూలాల వల్ల - ఇవాళ జరుగుతున్న విస్థాపనకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ఆదివాసులు ఉద్యమిస్తున్నా సంప్రదాయ జీవితానికి దూరమైపోవడం అనే విషాదకర ప్రక్రియ కకూడా మెల్లగా మొదలైంది. ఈ ఉద్యమాలు పాలక వర్గ అభివృద్ధికి వ్యతిరేకంగా సాగుతున్నా.. కొన్ని సమూహాలైనా అనివార్యంగా మార్కెట్లో శ్రమశక్తిని అమ్ముకోవాల్సిన దుస్థితికి నెట్టివేయబడతాయి.

అయితే ఈ విధ్వంసానికి వ్యతిరేకంగా ఆదివాసుల సంస్కృతిని, వాళ్ల పాత ఆర్థిక వ్యవస్థను వైభవీకరించి అట్లాగే కాపాడాలి అనే వాదన వినిపిస్తోంది. దీని సారాంశం ఏమంటే.. ఆదివాసులు తమ ప్రాచీన జీవన మూలాల దగ్గరే ఉండిపోవాలని. ఇది ఆధునిక పూర్వవాదన. ఇవాళ ఆదివాసులకు సంఘీభావంగా వినిపిస్తున్న అనేక స్వరాల సైద్ధాంతిక ఆలంబన ఇదే. ఆదివాసుల హక్కుల పరిరక్షణకు ఇలాంటి వాళ్లు చాలా దృఢంగా నిలబడతారు. ఆదివాసుల పోరాటం న్యాయమైనదని గట్టిగా వాదిస్తారు. వాళ్ల మీద అణచివేతను ధాటీగా ప్రశ్నిస్తారు. ఈ విషయంలో వాళ్లు ఆదివాసులకు, విప్లవోద్యమానికి సన్నిహిత మిత్రులు. వాళ్లతో స్నేహాన్ని కొనసాగిస్తూనే సైద్ధాంతికంగా వాళ్లది ఆధునిక పూర్వ వైఖరి అని చెప్పాల్సి ఉంటుంది.

ఆదివాసుల విషయంలో ఇంకో వాదన కూడా ఉంది. ఇది పైన చెప్పిన వైఖరిని తీవ్రంగా విమర్శిస్తుంది. అదేమంటే - ఆదివాసులను వ్యవస్థలో భాగం చేయకుండా అట్లా అడవికి పరిమితం చేయడం ఏమిటి? వాళ్లూ అభివృద్ధి చెందవద్దా? అని. దీని అర్థం ఏమంటే - బూర్జువా ఆధునికత అనే మురికి గుంటలోకి ఆదివాసులు కకూడా రావాలి. అదే వాళ్ల జీవితాన్ని ఉద్ధరిస్తుంది. దీని అర్థం ఏమంటే వాళ్లను బూర్జువా ఆధునికత అనే ఈ విధ్వంస ప్రక్రియలోకి నిర్దాక్షిణ్యంగా తోసివేయడమే. ఇది బూర్జువా ఆధునిక వాదన. మొదటిది ఉత్పత్తిశక్తుల అభివృద్ధిని తిరస్కరిస్తుంది. రెండోది బూర్జువావర్గ ప్రయోజనాల ప్రాతిపదిక మీద సాగే అభివృద్ధిలో ఆదివాసులను భాగం చేసి, తద్వారా తన ప్రయోజనాలు ఈడేర్చుకోవాలనుకుంటుంది.

ఇవి రెండూ సిద్ధాంతపరంగా పరస్పర విరుద్ధంగా కనిపించినా చెరో వైపు నుంచి మావోయిస్టులకు సమాన దూరంలో ఉంటాయి. అయితే ఆధునిక పూర్వ వైఖరి ఉండే వాళ్లలో కొందరైనా రాజకీయంగా విప్లవకారులకు సన్నిహితులవుతారు. అయితే వాళ్లలో ఎవరైనా ఒక ప్రశ్న వేసే అవకాశం ఉంది. 'పెట్టుబడి ఆదివాసీ జీవన మూలాలను, వాళ్ల కాళ్ల కింది సహజ సంపదను కొల్లగొడుతోందని విమర్శిస్తున్నారు గదా... మావోయిస్టులు రాజ్యానికి వస్తే వాటిని పరిరక్షిస్తారనే హామీ ఉంటుందా?' అని.

ఇది దీర్ఘకాల సమాజ పరివర్తనకు సంబంధించిన విషయం. వేర్వేరు జన సమూహాలు చారిత్రకంగా చేసిన ప్రయాణం, వాళ్ల సామాజిక స్థితిగతుల్లోని ప్రత్యేకతలు, సాంస్కృతిక నైపుణ్యం దృష్టిలో పెట్టుకుంటూనే విప్లవమంటే నిరంతరం అర్థవంతమైన పరివర్తన అని మార్క్సిస్టులు నమ్ముతారు. ఈ అన్ని ప్రత్యేకతలను పరిగణనలోకి తీసుకుంటూనే సమాజాన్ని సోషలిజం దిశగా నడపాల్సి ఉంటుంది. సమాజమంతా సోషలిజం దిశగా ప్రయాణించినా ఆదివాసులు ఆధునికపూర్వ దశలోనే ఉండిపోవాలా? వాళ్లు తమ సాంస్కృతిక ప్రత్యేకతలను నిలబెట్టుకుంటూనే సోషలిజం కోసం చేసే ప్రయాణ దిశలోకి ఎలా వస్తారు? అనే ముఖ్యమైన ప్రశ్నను ఈ చర్చ లేవదీస్తుంది. ప్రగతి గురించి మార్క్సిస్టు వైఖరి వల్ల విప్లవకారులు ఈ రెంటినీ వ్యతిరేకిస్తారు.

(ఇంకా ఉంది)



వ్యాసం

# జగిత్యాల నుండి జంగల్ మహల్ వరకు కిషన్‌జీ పోరాట జ్వాలలు

- షంషేర్

తెలంగాణలో ప్రతి అడుగు పోరాట ప్రాంతమే. నాటి తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో శతృవుతో పోరాడుతూ, ఎందరో వీర వనితలు, వీరులు నేలకొరుగుతూ తమ రక్తంతో తెలంగాణ చరిత్రను రాశారు. భారత విముక్తి కోసం తెలంగాణ ప్రజల బిడ్డలు ఈ నాటికీ తెలంగాణను తమ రక్తంతో తడిపేస్తూనే ఉన్నారు. ఇది ఈనాటిది కాదు తరతరాల, పోరాటపు త్యాగాల చరిత్ర...

"నీ కాలు మొక్కుతా, నీ బాంచెన్ దొరా" అంటూ ఎవరు కనపడ్డా కాళ్ళమీద పడి సాష్టాంగ నమస్కారాలు చేసే తెలంగాణ ప్రజలు... నాగేటి చాళ్ళ రగిలిన రైతాంగ పోరాటాలతో, తమ దాస్య శృంఖాలాలు తెంచుకోను, రాజ్యాధికారం హస్తగతం చేసుకోను పోరాట బావుటాను ఎత్తిపట్టి ఎన్ని ఆటుపోట్లు ఎదురైనా, ఏటికి ఎదురు ఈదుతూ పురోగమిస్తూనే ఉంది తెలంగాణ- తన ప్రజాయుద్ధ నవ్వడులతో దేశాన్ని తన మార్గంలో విముక్తి మార్గంలో పురోగమించమని ఎలుగెత్తి చాటడమే కాదు... పిడికిలి బిగించి రెడ్ సెల్యూట్స్‌తో ఆహ్వానిస్తుంది. ఆశీర్వదిస్తుంది. ఆదరించి అక్కున చేర్చుకుంటుంది. ఎర్రజెండాను చేతికి అందిస్తుంది.

శత్రువునెదిరించడంలో తెలంగాణ యోధుల ధైర్య సాహసాలు, చిత్రవధలపాలు అవుతున్నప్పుడు మృతవీరులు చూపిన అకుంఠిత దీక్ష, దృఢ సంకల్పం, ఉద్యమ ప్రతిష్టను కాపాడడంలో వీరవనితలు, వీరయోధులు ప్రదర్శించిన పట్టుదల కథలు కథలుగా చెప్పుతారు తెలంగాణ వీర ప్రజానీకం.

శతాబ్దాలుగా దొరల దోపిడి, పీడన కింద నలిగిపోతున్న తెలంగాణ రైతాంగం సంఘటితమై, దాస్య విమోచనకు వీరోచితంగా పోరాడారు. వేల సంఖ్యలో ప్రజలు-భూస్వాముల దోపిడిని, వెట్టిచాకిరిని, ప్రతిఘటిస్తూ ప్రత్యక్ష కార్యచరణలోకి దిగారు. భూస్వాములు గుండాలతో, తుపాకులతో ప్రజలను రక్తపాతంతో ముంచెత్తారు. అయినా వెరవలేదు తెలంగాణ జనం... "నక్సల్బరీ ఏకీరస్తా" అంటూ నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల చైతన్యం పొందిన యువకుడు మల్లోజుల కోటేశ్వరరావు. కరీంనగర్ పల్లెపల్లె తిరిగిండు. రైతాంగానికి విప్లవ రాజకీయాలు చెప్పిండు. వారి కండల్లో కండ అయ్యిండు. వాళ్ళ రక్తంలో రక్తంలా కల్సిపోయి... వెన్నెల రాత్రిల్లో గొంగడి భుజాన వేసుకుని కరీంనగర్ పల్లెపల్లె తిరిగి రైతాంగాన్ని సమీకరించి దొరలగడులకు నిప్పు పెట్టిండు...

నక్సల్బరీ, శ్రీకాకుళల
పోరాట వారసత్వాన్ని
గుండెల్లో పదిలపర్చుకొని
జగిత్యాల జైత్రయాత్రకు
రూప కల్పన చేసిన వాడు
జైత్రయాత్ర జైత్రయాత్ర
జగిత్యాల జైత్రయాత్ర
దండయాత్ర దండయాత్ర
దోపిడిపై దండయాత్ర

1978 సెప్టెంబర్ 8న జగిత్యాల పట్టణం రైతు కూలీ నినాదాలతో మారు మోగింది... చిన్న నిప్పురవ్వ దావాగ్నిగా మారి...కరీంనగర్ - ఆదిలాబాద్ నాగేటి చాళ్ళ రైతాంగ పోరాటాలుగా రగిలి, ఉవ్వెత్తున ఎగిసిపడుతూ ఆంధ్ర రాష్ట్రాన్ని అలుముకున్నాయి. గోదావరి-ప్రాణహితలు దాటి దండ కారణ్యానికి విస్తరించాయి. అప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కార్యదర్శి మల్లోజుల కోటేశ్వరరావు (ప్రహ్లద్) ద్విగుణీకృత ఉత్సాహంతో ఆంధ్ర రాష్ట్ర ఉద్యమాన్ని నలుమూలలా విస్తరించాడు.

పల్లెల్లో, పట్టాణాలలో
ఎక్కడ చూసిన రాడికల్స్
దోపిడి గుండెల్లో
పిడి బాకులు రాడికల్స్...
ఇంద్రవెల్లిలో
గోండన్నల అమరత్వం
రగల్ జెండాగా
ఎగరవేసారు...
బాయి దొరల దౌర్జన్యాలతో
నలిగిపోయిన కార్మికులు
దొంగ ట్రేడ్ యూనియన్లతో
మోసపోయిన కార్మికులు
సింగరేణి కార్మికుల సమ్మెలు, సైరన్ మోతతో
సింగరేణి కార్మికుల సమాఖ్య ఆవిర్భావం...
కార్మిక, కర్షక, విద్యార్థి, మేధావి ఐక్యతతో
ఉద్యమాలు ఎగిసిపడుతూ చెట్టపట్టాలేసినాయ్...

జగిత్యాల పోరాటం... కరీంనగర్, ఆదిలాబాద్ రైతాంగ పోరాటం రాజ్యం కంట్లో నలుసు అయ్యింది. సింగరేణి కార్మిక సమాఖ్య ఒక లక్షాముప్పైవేల మందితో నల్లా ఆదిరెడ్డి, గజ్జెల గంగారాం, కట్ల మల్లేశ్‌ల నాయకత్వంలో విప్లవ కార్మికోద్యమం నిర్మాణమైంది. రెండు దశాబ్దాలకుపై కార్మికుల హక్కుల కోసం సమరం చేసి, సమరశీల పోరాట సంస్థగా, కార్మికోద్యమా సంస్థగా ఎగిసిపడింది.

తెలుగు ప్రజల ఆత్మగౌరవం అంటూ

నక్సలైట్లే దేశభక్తులని
గద్దెనెక్కిన కాషాయధారి రామారావు
డెమోగాశి...
రైతాంగ పోరాటాలు మిన్నంటి లేచాయ్
కార్మికులు కదంతొక్కారు
విద్యార్థులు విప్లవించారు
నిప్పులు చెరిగె నిర్బంధం

తెగువతో తెగించి పోరాడుతున్న తెలంగాణలో ఎన్.టి. రామారావు నెత్తురు పారించిండు. మోఘ్యాల్ని మేఘాలలో కలిపేసారు. కొడవగంటి సుదర్శన్‌ను మాయం చేసారు. చంద్రగిరి తండాలో మామిడాల హరిభూషణ్, చెన్నూర్‌లో పల్లె కనకన్న ఎందరెందరో వీరుల అమరత్వం... ఇంటింట ఒకర్ని కట్టేసి కాల్చి చంపిన ఆగదు ఆగదు ఆగదు విప్లవమని ఎలుగెత్తిచాటారు తెలంగాణ ప్రజానీకం.

సరిహద్దులు చెరిపిన శంకరన్న
బెల్లంపల్లి కార్మికుల ముద్దుబిడ్డ
దండకారణ్యంలో దండ్లు కట్ట
పయనమై ప్రాణహితను దాటి
ప్రజాయుద్ధానికి ప్రాణమిచ్చిన శంకరన్న

నిర్బంధం నిప్పులు చెరుగుతుంటే... దండకారణ్య ఉద్యమాన్ని విస్తరిస్తూ, సంఘటితపర్చ రాంజీ ప్రయాణం... ఆదిలాబాద్ రాంజీగొండు బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించి నిర్మల్‌లో ఉరికంబమెక్కిన గొండు వంశపురాజు... కోటేశ్వర్ రాంజీని ఆదర్శం చేసుకున్నాడు. ఆదివాసీ అదవన్నలతో, అక్కలతో ప్రజాసైన్యం నిర్మాణానికి దండకారణ్యానికి తరలిన రాంజీ...

మిలటరీ నిపుణుడుగా
ప్రజాయుద్ధ సైన్యానికి నేతగా
సైనిక క్రమశిక్షణకు కామ్రేడ్ రాంజీ పెట్టింది పేరు.

తొలి యుద్ధ శిక్షణలో కామ్రేడ్ గజ్జెల గంగారాం నెత్తుటి త్యాగాలను కామ్రేడ్ రాంజీ ఎన్నటికీ మర్చిపోలేదు. సైనిక శిక్షణ శిబిరాలలో రాంజీ రాజకీయ టీచర్‌గా గెరిల్లాలకు ప్రజాయుద్ధపు పాఠాలు, గెరిల్లా ఎత్తుగడలు బోధించాడు. 'లైట్ ఈజ్ ద నైట్ ఎనీమి' అని రాంజీ చెప్పిన బోధనలు ఈనాటికి గెరిల్లాలు, క్యాడర్లు గుర్తు చేసుకుంటారు.

విప్లవం అతని శ్వాస
సాయుధ పోరాటం అతని మార్గం
మావోయిస్టు సిద్ధాంతాన్ని
ఆచరణకు అన్వయించినవాడు
మానవ చైతన్యాన్ని పురివిప్పి
శత్రువు ఎదపై నాట్యం చేయించినవాడు
చరిత్ర గతిని మార్చివేయ
కదం కదం కలిపి పోరాట కేతనం
ఆవిష్కరించినవాడు...
ఇప్పవనాల గాలి
వెదురు పొదుల సంగీతాన్ని
తుడుం మోతలను
విప్లవ తరంగమై లేపి
గిరిజనుడి విల్లుబాణాన్ని
శత్రువు గుండెలపైకి సంధించినవాడు
తూర్పు పవనం వీచేనోయ్
తూర్పు దిక్కు ఎరుపెక్కెనోయ్ అంటూ

వింధ్య పర్వతాలు దాటి ఉత్తర భారత్‌లో అడుగుపెట్టాడు రాంజీ... నక్సల్బరీ, శ్రీకాకుళ విప్లవోద్యమాల వెనుకంజ తర్వాత ముక్క చెక్కలైన మార్క్సిస్టు-లెనినిస్టు గ్రూపులను, వ్యక్తులను, సమైక్యం చేయడంలో... ముఖ్యంగా నక్సల్బరీ కాలం నుండి విడివిడిగా ఉన్న పీపుల్స్‌వార్ ఎం.సి.సిల మధ్య ఐక్యతను సాధించడం కోసం ఎంతగానో కృషి చేసాడు. ఆ క్రమంలో ఆయన నిర్వహించిన పాత్ర భారత విప్లవోద్యమ చరిత్రలో చిరస్థాయిగా నిలుస్తుంది.

జగిత్యాల నుండి జంగల్ మహల్ వరకు
ప్రజా యుద్ధంలో అద్భుతాలను సృష్టించిన వాడు
ఎత్తిన ఆయుధాన్ని దించని మావోయిస్టు
ప్రజాయుద్ధపు నేత...
ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి
ఆయన కేడర్లకు ప్రీతి పాత్రుడు
చరిత్రలో ధ్రువతార....

అందుకే కోటేశ్వరరావు రాజ్యం కంట్లో నలుసు... రాజ్యానికి కల్లోలం సృష్టించడంతో ప్రారంభించి, అంతర్గత ప్రమాదంగా పరిణమించేదాక ఎదిగాడు. మైదానాల్లో దళిత, బడుగు వర్గాలను వర్గ పోరాటంలో సమీకరించడం ప్రారంభించి, దండకారణ్యం నుండి జంగల్ మహల్ వరకు ఆదివాసులను మావోయిస్టులుగా మార్చే వరకు ఎదిగాడు... పెద్దపల్లి నుండి ఢిల్లీదాకా, జగిత్యాల నుండి లాల్‌గడ్ వరకు విప్లవ ప్రస్థానం చేసాడు కిషన్‌జీ...

అతడు
అసిధారపై నడుస్తూ
చరిత్రలో అతని దీర్ఘయాత్ర
2011 నవంబర్ 24న ముగిసింది...
అతడు...
అమరుల చరిత్ర పుటలో
రికార్డు చేసుకున్న సార్థకుడు...
చరిత్ర చెక్కిలిని ముద్దాడిన
సాహసిక యోధుడు...
ఆ యోధునికి ఎర్రరెని జోహార్లు.

దీర్ఘకాలిక ప్రజాయుద్ధం దారిపొడుగునా ఈ త్యాగాల చరిత్ర నడకలో అక్కడక్కడ తళుక్కున మెరిసే నక్షత్రాల్లాగా కనబడుతూనే ఉంటాడు మల్లోజుల కోటేశ్వరరావు. అమరత్వాన్ని ముద్దాడి అమరుల్లో కలిసిపోయాడు కిషన్‌జీ. కష్టాలో, కన్నీళ్లలో, ఓటమిలో, విజయాల్లో మనకు అమరుల అమరత్వపు గాథలు ఉత్తేజకరంగా వినబడుతూనే ఉంటాయి.

(కా. మల్లోజుల కోటేశ్వరరావు (కిషన్‌జీ) స్మృతిలో) 

వ్యాసం

# ఆరిపోని ఆశయ జ్వాల భగత్‌సింగ్

- క్రాంతి

మార్చి 23 ఒక చారిత్రాత్మక దినం. విప్లవవీరులు భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, రాజగురుల అమరత్వపు దినం. ఈయేటికి వాళ్లు అమరులై 81 సంవత్సరాలు నిండాయి. ఈ సందర్భంగా ఆ మృతవీరులకు యావత్ దేశం వినమ్రంగా నివాళిని అర్పించింది.

ఈ సందర్భంగా 'అరుణతార' పాఠకులకు భగత్‌సింగ్ చరిత్రను అందిస్తున్నాం.

"ఇంక్విలాబ్ జిందాబాద్!" – దేశ రక్త నాళాల్లో ఈ నినాదాన్ని ప్రవహింపచేసిన వాడు భగత్‌సింగ్. ఆయన బ్రిటిష్ సామ్రాజ్యవాదుల గుండెల్లో విస్ఫోటనయ్యాడు. దేశ భవిత కొరకు తన నవ యవ్వనాన్ని పణంగా పెట్టాడు.

షహీద్ భగత్‌సింగ్‌ది పంజాబ్ రాష్ట్రంలోని సంగ్రూం జిల్లా ఖోఖర్‌కలాన్ గ్రామం. అతని తల్లిదండ్రులు విద్యావతి, కిషన్‌సింగ్‌లు. వారిది స్వాతంత్ర్య సమరయోధుల కుటుంబం. 1907 సెప్టెంబర్ 28న భగత్‌సింగ్ పుట్టాడు. అప్పటికి ఆయన తండ్రీ, బాబాయిలూ జైల్లోనే ఉండినారు. అటువంటి కుటుంబంలో పుట్టిన కారణంగా సహజంగానే భగత్‌సింగ్‌పై చిన్నతనంలోనే స్వాతంత్ర్య పోరాట ప్రభావం పడింది. ఆ ప్రభావం వల్లనే అతడిలో పసితనంలోనే బ్రిటిష్ వ్యతిరేకత, స్వాతంత్ర్య కాంక్ష మొలకెత్తింది. మొలకెత్తడమే కాదు చిన్నతనంలోనే తన స్వాతంత్ర్య భావన స్పష్టమైన పరిణితిని పొందిందనడానికి ఎన్నో ఉదాహరణలను చరిత్రకారులు చెప్తారు.

జలియన్‌వాలాబాగ్ దమనకాండ జరిగినప్పుడు భగత్ పన్నెండేళ్ల వయసులో ఉన్నాడు. ఆ దమనకాండ గురించి విని అతడు ఎవరికీ చెప్పకుండా జలియన్‌వాలాబాగ్ వెళ్లి నెత్తుటితో తడిసిన అక్కడి మట్టిని తీసుకువచ్చి ఒక పాత్రలో ఉంచి పూజ చేశాడట. 'నా సోదరుల మరణానికి బ్రిటిష్ వారిపై ప్రతీకారం తీర్చుకుంటాన'ని ప్రతిజ్ఞ చేశాడట. భగత్‌సింగ్ తమ్ముడి కూతురు వీరేంద్ర సంధు భగత్‌సింగ్ జీవిత చరిత్రను రాసింది. ఆమె రాసిన దాన్ని బట్టి కూడా ఉత్తేజపూరితమైన భగత్‌సింగ్ బాల్య చరిత్ర కొంత తెలుస్తోంది. సాధారణంగా బళ్లో చదువుకునేప్పుడు పెద్దయ్యాక ఏం చేస్తావు అనే చర్చలు వస్తుంటాయి. పిల్లలు తమకు గొప్పగా అనిపించిన దాన్ని ఆదర్శంగా తీసుకొని పెద్దయ్యాక అదవుతాం, ఇదవుతాం అని చెప్తుంటారు. అలాగే భగత్‌సింగ్ నాలుగో తరగతిలో ఉన్నప్పుడు ఇలాంటి చర్చ వచ్చినప్పుడు, ఒకరు ఉద్యోగం చేస్తామనీ, ఒకరు వ్యాపారం చేస్తామనీ, ఒకరు పెళ్లి చేసుకుంటామనీ చెప్తుంటే భగత్ మాత్రం 'పెళ్లి చేస్కోవడం కూడా ఒక పనేనా! నేను చచ్చినా పెళ్లి చేసుకోను, బ్రిటిష్ వారిని ఈ దేశం నుండి వెళ్లగొడతాను' అనేవాడట. ఆంగ్లేయులతో పోరాడుతున్నందుకుగాను భగత్‌సింగ్ బాబాయి ప్రవాసంలో ఉండేవాడు. ఆ సమయంలో భర్త కోసం ఏడుస్తున్న తన చిన్నమ్మను నాలుగేళ్ల భగత్ 'బాధపడకు, బ్రిటిష్ వాళ్లను పారదోలి నేను బాబాయిని తీసుకువస్తాను' అని ఓదార్చేవాడట. అతను ఎనిమిదేళ్ల వయసులో ఉన్నప్పుడు ఒక రోజు అతని చెల్లి ఒక మత గ్రంథంలోని పేజీని తెచ్చి అతనికి ఇచ్చిందట. దాన్ని పూర్తిగా చదివి 'తెల్లవాళ్లతో పాటు మతం కూడా మన దేశంలో పెద్ద గందరగోళం సృష్టించింది. అందువల్ల తెల్లవాళ్లతో పాటు మతాన్ని కూడా దుంపనాశనం చేయాలి' అని అంటూ ఆ కాగితాన్ని నేలకేసి కొట్టి దాన్ని కాళ్లతో చిదిమేశాడంట. ఇవన్నీ చదువుతుంటే అంత చిన్న వయసులోనే అతనిలోని అంత బలీయమైన స్వాతంత్ర్య కాంక్ష, పలు విషయాల్లో స్పష్టత అబ్బురంగా తోస్తుంది.

ఇంత చిన్న వయసులోనే స్పష్టమైన రాజకీయ వైఖరిని కల్గిఉన్న భగత్‌సింగ్ పదిహేనేళ్ల వయసులోనే చురుకైన ఆచరణకు దిగాడు. 1920లో ప్రారంభమైన సహాయ నిరాకరణ ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నాడు. 1922లో చౌరీచౌరా ఘటన జరిగిన తర్వాత ఆ దాడిని తప్పుపడుతూ గాంధీ సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ఆపేశాడు. గాంధీ చర్య సరైంది కాదని భగత్‌సింగ్ భావించాడు. అయినప్పటికీ విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నాడు. అందులో భాగంగా అప్పటి దాకా తాను చదువుతున్న బ్రిటిష్ ప్రభుత్వ నిధులతో నడిచే పాఠశాలను బహిష్కరించి నేషనల్ స్కూల్లో చేరాడు. ఆ తర్వాత కొద్ది కాలానికే అతనికి గాంధీ సిద్ధాంతాల పట్ల విశ్వాసం పోయింది. గాంధీ మార్గంలో దేశానికి స్వాతంత్ర్యం రాదని గుర్తించాడు. అప్పుడప్పుడే దేశంలో మొలకెత్తుతున్న విప్లవ భావాల పట్ల ఆకర్షితుడయ్యాడు. ఆ మార్గంలో నడవదలుచుకున్నాడు. దానితో బడిని వదిలేసి స్వాతంత్ర్య సమరంలోకి దూకాడు. కాన్పూరుకు వెళ్లి విప్లవకారులతో సంబంధాలు పెట్టుకున్నాడు. వివిధ ప్రాంతాలు తిరిగాడు. పదిహేడేళ్ల వయసులో లాహోర్ కేంద్రంగా పని చేస్తుండిన 'నవజవాన్ భారత్ సభ' అనే విప్లవ సంస్థకు కార్యదర్శి అయ్యాడు. అప్పటికి ఈ సంస్థకు చెందిన పలువురు నేతలు ఉరిదీయబడ్డం వల్ల భగత్‌సింగ్ ఈ స్థానాన్ని చేపట్టవల్సి వచ్చింది. భగత్‌సింగ్ ఆచరణ, అతని కుటుంబ నేపథ్యం సంస్థకు అతని పట్ల విశ్వాసాన్ని కలుగజేసింది.

కార్యదర్శి అయిన తర్వాత పంజాబ్ అంతటా అతను విప్లవ జ్వాలల్ని వ్యాపింపజేశాడు. అలా బ్రిటిష్ గుండెల్లో ప్రకంపనలు సృష్టించాడు. దాంతో భగత్‌సింగ్‌ను అరెస్ట్ చేయాలని బ్రిటిష్ వాళ్లు కుట్ర పన్నారు. తప్పుడు కేసు మోపి అతన్ని అరెస్ట్ చేశారు. కొద్ది కాలం తర్వాత అతడు జామీనుపై విడుదలయ్యాడు.

జైలు గోడలు అతనిలోని విప్లవదీక్షను ఏమాత్రం సడలించలేక పోయాయి. జైలు నుంచి వచ్చిన తర్వాత తన కార్యకలాపాలను మరింత ఉధృతం చేశాడు. దేశవ్యాప్త సంస్థ అయిన 'హిందుస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్'లో చురుకైన పాత్రను పోషించాడు. ఈ

క్రమంలో అతనికి చంద్రశేఖర్ ఆజాద్, సుఖ్‌దేవ్, రాజగురు, భగవతీ చరణ్ వంటి విప్లవవీరులు సన్నిహిత సహచరులయ్యారు.

ఈ క్రమంలో 'హిందుస్థాన్ రిపబ్లిక్ అసోసియేషన్' 1928లో 'హిందుస్థాన్ సోషలిస్ట్ రిపబ్లిక్ అసోసియేషన్'గా మారింది. ఈ పేరును మార్చడంలో భగత్‌సింగ్ కీలకమైన పాత్ర వహించారు. దీనికి కారణం ఆనాటికి అతను మార్క్సిజం వైపు ఆకర్షితుడు కావడమే. ఆనాటి నుండి సోషలిజం స్థాపన ఈ సంస్థ లక్ష్యంగా మారింది. అంటే బ్రిటిష్ వాళ్లను తరిమేయడం మాత్రమే వారి లక్ష్యం కాదు. బ్రిటిష్ వాళ్లను తరిమేసిన తర్వాత దేశంలో సోషలిజాన్ని స్థాపించాలన్నది వారి లక్ష్యం.

దేశంలోని రాజకీయ పరిస్థితులను అధ్యయనం చేయడానికి బ్రిటిష్ ప్రభుత్వం సైమన్ కమిషన్‌ను నియమించింది. ఈ కమిషన్‌కు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా 'సైమన్ గో బ్యాక్' అనే ఆందోళన చెలరేగింది. అందులో భాగంగా 1928 అక్టోబర్‌లో కాంగ్రెస్ పార్టీలో అతివాదిగా పేరున్న లాలా లాజ్‌పతిరాయ్ ఆధ్వర్యంలో సైమన్‌ను బయటకు రానీయకుండా రైల్వే స్టేషన్ వద్ద ఆందోళన జరిగింది. ఆ ఆందోళనను అణచివేసే ఉద్దేశంతో స్కాట్ అనే పోలీసు అధికారి ఆదేశాలను అందుకున్న సాండర్స్ అనే పోలీస్ అధికారి, లాలా లాజ్‌పతిరాయ్‌ను లాఠీతో విచక్షణారహితంగా కొట్టడంతో అతను చనిపోయాడు. ఈ ఘటన దేశాన్ని మరింత ఉడుకెత్తించింది. యావత్ భారత ప్రజానీకం భగ్గుమని మండింది.

ఈ హత్యకు ప్రతీకారంగా భగత్‌సింగ్, రాజగురు, జయగోపాల్‌లు 1928 డిసెంబర్ 17న సాండర్స్‌ను చంపారు. అతన్ని చంపిన తర్వాత ఒక ప్రకటనను విడుదల చేశారు. అందులో 'ఒక మనిషి రక్తం చిందించినందుకు మా విచారాన్ని వ్యక్తం చేస్తున్నాం. ఇది విప్లవ వేదికపై ఒక బలి. దేశానికి ముక్తి, విముక్తి తీసుకురావాలంటే, ఒక మనిషి మరొక మనిషిని కొల్లగొట్టడం అసాధ్యం చేయాలంటే, ఈ బలి, ఈ వైయక్తిక బలిదానం తప్పవు. విప్లవం వర్ధిల్లాలి' అని తమ దృక్పథాన్ని వెల్లడించారు.

ఆ తర్వాత ఈ విప్లవవీరులు నేషనల్ అసెంబ్లీ (ఈనాటి పార్లమెంటు వంటిది)లో బాంబులు వేయడం ద్వారా తమ రాజకీయాలను దేశమంతటా వ్యాపింప చేయాలనుకున్నారు. అదే సమయంలో బ్రిటిష్ ప్రభుత్వం రెండు ప్రజావ్యతిరేక బిల్లులను తయారు చేసింది. వాటికి నామమాత్రంగా ఆమోద ముద్రను పొందడం కోసం 1929 ఏప్రిల్ 8న ఆ బిల్లులను అసెంబ్లీలో ప్రవేశ పెట్టదల్చుకుంది. దేశమంతా వ్యతిరేకిస్తున్న ఈ బిల్లులను ప్రవేశపెట్టే సందర్భాన్ని అసెంబ్లీలో బాంబులు వేయడం కోసం ఎన్నుకున్నారు. ఈ చర్యలో భగత్‌సింగ్ ప్రత్యక్షంగా పాల్గొనాలని నిర్ణయమైంది. పథకం ప్రకారం భగత్‌సింగ్, బటుకేశ్వర్ దత్ ప్రేక్షకుల స్థానాల్లో కూర్చొన్నారు. ఆ రోజున బిల్లులు ప్రవేశపెట్టగానే సభలోని భారతీయ ప్రతినిధులు వాటిని తోసిపుచ్చారు. అయినప్పటికీ ఆ బిల్లులు చట్టాలయి పోయినట్టుగా వైస్రాయి ప్రకటించాడు. వెంటనే భగత్‌సింగ్, దత్‌లు బాంబులు విసిరి 'ఇంక్విలాబ్ జిందాబాద్', 'సామ్రాజ్యవాద్ ముర్దాబాద్' అంటూ నినాదాలు చేశారు. ఆ తర్వాత వారు తమ వద్దనున్న కరపత్రాలను అసెంబ్లీ నిండా వెదజల్లారు. ఆ కరపత్రం చివర్లో ఇలా వుంది. 'ఈ దేశానికి ఉజ్వల భవిష్యత్తు ఉండాలని మేము భావిస్తున్నాం. అందరికీ సమానంగా సంపూర్ణమైన శాంతి, స్వాతంత్ర్యాలు లభించాలని ఆకాంక్షిస్తున్నాం. వాటిని సాధించడానికి ఇంతటి హింసాత్మకమైన చర్యలకు పూనుకోవలసి రావడం మమ్మల్నెంతగానో బాధిస్తోంది. ఒక మనిషిని మరో మనిషి పీడించే స్థితికి చరమగీతం పాడాలంటే అది విప్లవం ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. ఎంతో కొంత రక్తం చిందకుండా దాన్ని సాధించడం సాధ్యం కాదు'. బాంబులు వేసిన తర్వాత తప్పించుకునే అవకాశం ఉన్నప్పటికీ వాళ్లు తప్పించుకోలేదు. ఎందుకంటే తాము బాంబులు ఎందుకు వేశారో తామే బహిరంగంగా ప్రకటించుకోవాలనుకున్నారు కనుక. అరెస్ట్ అయితే తమను ఉరి తీస్తారేమోనని వాళ్లు ఊహించారు. అయినప్పటికీ తమ రాజకీయాలను వ్యాపింపజేయడం కోసం వారు ప్రాణాలను పణంగా పెట్టదల్చుకునే అరెస్ట్ అయ్యారు.

బ్రిటిష్ ప్రభుత్వాన్ని, 'ప్రభుత్వంగా' బ్రిటిష్ 'న్యాయస్థానాలను' న్యాయస్థానాలుగా భగత్‌సింగ్ తదితరులు ఏనాడూ గుర్తించలేదు. అందుకని బాంబులు వేసిన కేసులో వారు ఎటువంటి ప్రతివాదనలూ దాఖలు చేయలేదు. అయితే కోర్టులో కొన్ని ప్రకటనలు చేయడం ద్వారా వారు విప్లవ రాజకీయాలను విశేషంగా ప్రచారం చేశారు. వారిని కోర్టుకు తీసుకువచ్చినపుడు 'ఇంక్విలాబ్ జిందాబాద్' అని నినాదాలు చేసేవారు. ఇంక్విలాబ్ అనే పదానికి అర్థం ఏంటని జడ్జి అడిగితే, దానికి భగత్‌సింగ్ తన సుదీర్ఘ వాంగ్మూలంలో 'విప్లవం అంటే బాంబులూ, పిస్తోళ్ల సంస్కృతి కానే కాదు, అన్యాయం మీద ఆధారపడి ఉన్న వర్తమాన సామాజిక వ్యవస్థ మార్పు చెందాలన్నదే విప్లవం వల్ల మేం ఆశిస్తున్నది' అన్నాడు. అలాగే 'స్వాతంత్ర్యానికి అర్థం తెల్లవారి చేతుల్లోని అధికారం నల్లవాళ్ల చేతుల్లోకి మారడం కాదు. అప్పుడది అధికార మార్పిడి అవుతుంది. తిండిగింజల్ని పండించే రైతు ఆకలితో అలమటించనప్పుడు, చేనేత కార్మికుడికి ఒంటి నిండా బట్టలేని స్థితి లేకుండా పోయినప్పుడు, తాపీ మేస్త్రీ కొంపాగోడు లేకుండా ఉండే పరిస్థితి పోయినప్పుడు నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్టు' అని చెప్పాడు. స్వాతంత్ర్యం గురించి భగత్‌సింగ్‌కున్న మార్క్సిస్టు అవగాహన తెలుస్తుందీ ప్రకటన ద్వారా.

ఈ కేసులో భగత్‌సింగ్, దత్‌లకు యావజ్జీవ కారాగార శిక్ష వేసి అండమాన్‌కు పంపాలని కోర్టు నిర్ణయించింది. కానీ ఆ తర్వాత, గతంలో జరిగిన కాకోరీ దోపిడీ కేసుతో సుఖ్‌దేవ్‌తో పాటు వీరికి సంబంధం ఉందని నేరారోపణ చేశారు. భగత్‌సింగ్ ఆ ఆరోపణ నుంచి తప్పించుకోవడానికి ప్రయత్నించకుండా, తన సహజ ధోరణిలో విప్లవ జ్వాలలను రేకెత్తిస్తూ మాట్లాడాడు. దానితో వారిని సుఖ్‌దేవ్‌తో పాటు జైల్లో పెట్టారు. బ్రిటిష్ ప్రభుత్వం నామమాత్రపు విచారణ తంతును చేపట్టి భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, రాజగురులకు ఉరిశిక్షను విధించింది.

జైల్లో ఉన్న సమయంలో భగత్‌సింగ్ విస్తృతమైన అధ్యయనం చేశాడు. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, గోర్కీ తదితరుల రచనలను అధ్యయనం చేశాడు. అంతేకాదు రచనా వ్యాసంగాన్ని కూడా కొనసాగించాడు. ఉరిశిక్షకు కొద్ది కాలం ముందే అతడు ఆంగ్లంలో రాసిన 'నేనెందుకు నిరీశ్వరవాదిని' అనే వ్యాసాన్ని 'పీపుల్' వారపత్రిక

ప్రచురించింది. ఇదొక ఉత్తేజకరమైన రచన. తన అనుభవాలు, తను చదివిన పుస్తకాల మీద అభిప్రాయాలను డైరీల్లో పొందుపరిచాడు. ఇవికాక నాలుగు పుస్తకాలు రాశాడనీ, అవి లభించడం లేదని చరిత్రకారులు చెబుతున్నారు.

జైల్లో ఉంటూ కూడా పోరాటాలకు నాయకత్వం వహించాడు. ఖైదీలందరికీ కనీస వసతులు కల్పించాలనే డిమాండ్‌తో భగత్‌సింగ్ తదితరులు 63 రోజులు నిరాహారదీక్ష చేశారు.

'మేరా రంగ్‌దే బసంతీ చోలా' అనే పాట భగత్‌సింగ్‌కు ఎంతో ఇష్టమైన పాట. జైల్లో ఉన్నప్పుడు తను తరచూ ఈ పాట పాడుతుంటే జైలు వార్డర్లు కూడా ముగ్ధులై వినేవారు.

భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, రాజగురులకు విధించిన ఉరిశిక్షను దేశమంతా గర్హించింది. ఉరిని రద్దు చేయాలని కోరుతూ బ్రిటిష్ ప్రభుత్వానికి పది లక్షల టెలిగ్రాంలు వెళ్లాయి. ఈ టెలిగ్రాంలు పంపిన వారిలో బ్రిటన్ పార్లమెంట్ సభ్యులు కూడా ఉన్నారు.

ఇక్కడ గాంధీ దుర్మార్గం గురించి తప్పక చెప్పుకోవాలి. భగత్‌సింగ్ తదితరులను 1931 మార్చి 24న ఉరితీయాలని కోర్టు నిర్ణయించింది. దానికంటే కొద్ది రోజుల ముందు ఒక ఒప్పందం విషయమై గాంధీకీ, బ్రిటిష్ వైస్రాయి ఇర్విన్‌కూ నడుమ చర్చలు ప్రారంభమైనాయి. ఆ చర్చల్లో భగత్‌సింగ్ ఉరిశిక్షను జైలు శిక్షగా మార్చమనే డిమాండ్ చేయాలనీ, లేకుంటే ఒప్పందంపై సంతకం చేయవద్దని దేశ ప్రజలేకాక, కాంగ్రెస్ పార్టీకి చెందినవారు కూడా గాంధీపై ఒత్తిడి చేసారు. సుభాష్ చంద్రబోస్ కూడా ఈ విషయంపై గాంధీపై ఒత్తిడి తెచ్చాడు. కానీ ప్రజల మనోభావాలను గాంధీ లెక్కచేయలేదు. ఇటువంటి డిమాండ్ ఏమీ లేకుండానే గాంధీ మార్చి 5న ఇర్విన్‌తో ఒప్పందంపై సంతకం పెట్టాడు.

భగత్ తదితరుల విప్లవ పంథాను గాంధీ తీవ్రంగా వ్యతిరేకించాడు. అందుకే ఉరిశిక్షను వ్యతిరేకించలేదు. అయితే ఉరిశిక్ష ప్రభావం దేశంలో ఎంత తిరుగుబాటును రేకెత్తిస్తుందోనని భయపడ్డాడు. ఇర్విన్ తన జ్ఞాపకాలను "ఫుల్‌నెస్ ఆఫ్ డేస్" అనే పుస్తకంగా రాశాడు. అందులో గాంధీతో జరిగిన చర్చలను ప్రస్తావిస్తూ 'ఆ మనిషి (భగత్‌సింగ్)ని ఉరితీస్తే, జాతీయ అమరవీరుడు అవుతాడని, వాతావరణం మొత్తం దెబ్బతింటుందని గాంధీ అన్నాడు. నేను ఏదో ఒకటి చేయకపోతే కష్టమని, దాని ప్రభావం ఒప్పందంపై పడుతుందని గాంధీ భయపడ్డాడు' అని రాశాడు.

అంతేకాదు మార్చి ఆఖరులో కరాచీలో కాంగ్రెస్ మహాసభలు ఉండినాయి. ఆ సభల వరకూ ఉరిశిక్షను వాయిదా వేస్తానని ఇర్విన్ అన్నాడు. కానీ ఆ సభలకు ముందే ఉరిశిక్ష అమలు కావాలని గాంధీ కోరుకున్నాడు. ఎందుకంటే ఆ సభల్లో కూడా ఉరికి వ్యతిరేకంగా ఒత్తిడి రావచ్చని గాంధీ భయపడ్డాడు.

నిజానికి మొదటి నుండి సామ్రాజ్యవాదులకు తొత్తుగానే వ్యవహరించిన గాంధీ నుండి ఇంతకంటే భిన్నంగా ఆశించలేం. దేశవ్యాప్తంగా ఎంత నిరసన వచ్చినప్పటికీ ఈ విప్లవవీరులను ఉరి తియ్యాలనే బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించుకుంది. అయితే ఉరితీసిన తర్వాత చోటు చేసుకోబోయే పరిణామాల గురించి భయపడింది. ఉరి తీసే రోజున జైలుకు పెద్ద సంఖ్యలో ప్రజలు తరలివస్తారనీ, వారి మృత దేహాలను చివరిసారి చూడ్డానికీ, అంతిమ యాత్రలో పాల్గొనడానికి ప్రజలు వెల్లువెత్తుతారని, ఆ సమయంలో ప్రజల్లో ఉప్పొంగే ఆగ్రహావేశాలను అదుపు చేయలేమనీ ప్రభుత్వం భయపడింది. అందుకే ఒక రోజు ముందునే అంటే 1931 మార్చి 23న రాత్రికి రాత్రే భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, రాజగురులను రహస్యంగా ఉరితీసింది. శవాలను సట్లెజ్ నదీ తీరాన రహస్యంగా కాలబెట్టడానికి ప్రయత్నించింది. అయితే అప్పటికి విషయం తెల్సిన ప్రజలు వెల్లువలా సట్లెజ్ నదీ తీరానికి చేరుకున్నారు. వారు తమ ప్రియతమ అమరుల చితిమంటను మాత్రమే చూడగలిగారు.

ఉరి తీసేనాటికి భగత్‌సింగ్ 23 ఏళ్ల నవ యువకుడు. అతను పూర్తికాలపు కార్యాచరణ ప్రారంభించింది పదహారేళ్ల వయసులో. కేవలం ఏడేళ్ల కాలంలో, అదీ ఇంత చిన్న వయసులో దేశవ్యాప్తంగా విప్లవోత్తేజాన్ని రగిలించి చరిత్రను మలుపుతిప్పి, చరిత్రపై ఎన్నటికీ చెరిగిపోని ముద్ర వేశాడు భగత్‌సింగ్. భారతదేశం అమితంగా గర్వించదగిన ఈ విప్లవ యువ తేజాలను ఆర్పివేసి దేశ భవిష్యత్తును చీకటిమయం చేయాలని బ్రిటిష్ ప్రభుత్వం కలలు కన్నది. కానీ ఈ విప్లవకారులు రగిలించిన జ్వాలను అది ఆర్పలేకపోయింది. ఆ తర్వాత నిరంతరం రగులుతూ వచ్చిన ప్రజా పోరాటాల జ్వాలలకు తట్టుకోలేక బ్రిటిష్ వాళ్లు దేశాన్ని వదిలిపోయారు.

బ్రిటిష్ వాళ్లు వెళ్లిపోయారు కానీ దేశానికి భగత్‌సింగ్ కోరుకున్న స్వాతంత్ర్యం రాలేదు. తాను అనుమానించినట్టుగా కేవలం అధికారమార్పిడి మాత్రమే జరిగింది. ఈ అధికారమార్పిడి వల్ల ప్రయోజనం పొందినదీ, పొందుతున్నదీ కేవలం దోపిడీవర్గాలే.

పేద ప్రజల బతుకులు రోజు రోజుకూ దుర్భరంగా మారుతున్నాయి. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ప్రత్యక్షపాలన లేనప్పటికీ, నేడు పలు సామ్రాజ్యవాద దేశాల పట్టు మన దేశంపై పెరిగిపోతోంది. మరీ ముఖ్యంగా అమెరికా సామ్రాజ్యవాద పట్టు పెరిగిపోతున్నది. మన దేశంలో నయావలస తరహా పరోక్ష పాలన, దోపిడీ, నియంత్రణ కొనసాగుతున్నాయి. ఈ పరిస్థితుల్లో భగత్‌సింగ్ కలలుగన్న స్వాతంత్ర్య సాధన కోసం పోరాడాల్సిన కర్తవ్యం మిగిలే ఉంది.

ఈ కర్తవ్యాన్ని ఎప్పుడో తుంగలో తొక్కిన రివిజనిస్ట్ పార్టీలు నేడు మేం భగత్‌సింగ్‌కు వారసులం అంటున్నాయి. ఇది భగత్‌సింగ్ చరిత్రకు ద్రోహాన్ని తలపెట్టడమే. అంతేకాదు, మతాన్ని భగత్‌సింగ్ చిన్నప్పటి నుండీ చివరి దాకా అసహ్యించుకున్నాడు. కానీ నేడు మతోన్మాద సంస్థయిన ఎ.బి.వి.పి భగత్‌సింగ్ తమ్ముళ్లం అని చెప్పుకోవడం సిగ్గుచేటు. ఇటువంటి వారు భగత్‌సింగ్ జయంతులూ, వర్ధంతులూ జరుపుతూ, బూటకపు నివాళులు అర్పిస్తున్నారు. ప్రజల మనసుల్లో ముద్రించుకుపోయిన భగత్‌సింగ్ ప్రభావాన్ని తమ రాజకీయ ప్రయోజనాలకు వాడుకునే కుట్రలే ఇవన్నీ.

కానీ భగత్‌సింగ్ కలలు కన్న సోషలిజం స్థాపన కొరకు విప్లవోద్యమం కొనసాగుతున్నది. భగత్‌సింగ్ ఆదర్శాన్నీ, సాహసాన్నీ, ఉత్తేజాన్నీ స్వీకరించిన ఎందరో విప్లవకారులు భగత్‌సింగ్ బాటలో దేశ విముక్తి కోసం తమ ప్రాణాల్ని తృణప్రాయంగా అర్పిస్తున్నారు. భగత్‌సింగ్ వారసత్వాన్ని సగర్వంగా కొనసాగిస్తున్నారు. ఇదే భగత్‌సింగ్‌కు నిజమైన నివాళి.



శివసాగర్ సంస్మరణలో

# తూర్పు పవనం వీచెనోయ్!

తూర్పు పవనం వీచెనోయ్!
తూర్పు దిక్కెరుపెక్కెనోయ్!
భరత భూమి కనులు తెరచి
వెలుగు రవ్వలు కురిసెనోయ్! ॥తూర్పు॥

వీపుపైన చద్దిమూట
చేతిలోన గండ్రగొడ్డలి
మనసులోన మాసియాంగు
గుండెలోన ఎర్రజెండా
రైతు బిడ్డడు లేచెనోయ్!
రైతు బిడ్డడు గెరిల్లాగా
సింహగర్జన చేసెనోయ్! ॥తూర్పు॥

గాలిలోని వాలులా
ఏటిలోని నీటిలా
నీటిలోని చేపలా
ప్రజల మధ్యన ఒకనిగా
రైతు బిడ్డడు లేచెనోయ్
రైతు బిడ్డడు గెరిల్లాగా
కదన శంఖం ఊదెనోయ్ ॥తూర్పు॥

శత్రుగెండెల విషపుబాణం
ద్రోహి పక్కలో మృత్యుశూలం
ధనిక స్వాముల మెడలు విరిచే
గండ్రగొడ్డలి చండ శౌర్యం
గండు మగటిమి నీదిరా! హోయ్...
ధర్మయుద్ధం నీదెరా! ॥తూర్పు॥

మరతుపాకులు మోగనీ
విషపు జ్వాలలు చెలగనీ
బాధలెన్నో బరువులెన్నో
చుట్టుముట్టీ రగలనీ
కొండవై నిలిచావురా! హోయ్...
దండి మార్గం నీదిరా! హోయ్....
మందిమార్గం నీదెరా! ॥తూర్పు॥

తూర్పు పవనం వీచెనోయ్
తూర్పు దిక్కెరుపెక్కెనోయ్
భతర భూమి కనులు తెరచి
వెలుగు రవ్వలు కురిసెనోయ్!

1968

# నరుడో! భాస్కరుడా!

(భాస్కరుడు సర్వనామం కాదు. నా దేశంలో వర్తమానాకాశంలో ఉదయిస్తోన్న నూతన మానవునికి మహోజ్వల సంకేతం భాస్కరుడు. భాస్కరుల్ని మింగిన రాహువులు నిజాన్ని దాస్తారు. ప్రజలు భాస్కరుని బాటనే పయనిస్తారు. భాస్కరుడు ఆచంద్రతారార్కం అజరామరం.)

నర్రెంగ సెట్టుకింద నరుడో! భాస్కరుడా!
కన్నెర్ర సేస్తివయ్యా నరుడో! భాస్కరుడా!
కన్నెర్ర సేసి నీవు నరుడో! భాస్కరుడా!
కదనాన దూకితివా నరుడో! భాస్కరుడా!

బర్రెంక సెట్టుకింద నరుడో! భాస్కరుడా!
బందూకు పట్టివయ్య నరుడో! భాస్కరుడా!
బందూకు సేతబట్టి నరుడో! భాస్కరుడా!
బంధాలు తెంచ్తివయ్య నరుడో! భాస్కరుడా!

గొట్టంకి సెట్టుకింద నరుడో! భాస్కరుడా!
గొడ్డళ్ళు నూర్తివయ్య నరుడో! భాస్కరుడా!
గొడ్డళ్ళు నూరి నీవు నరుడో! భాస్కరుడా!
గుద్దెలుగు కొట్టివయ్య నరుడో! భాస్కరుడా!

విప్పపూ సెట్టుకింద నరుడో! భాస్కరుడా!
విల్లు సారించితివా నరుడో! భాస్కరుడా!
విల్లంబు సారించి నరుడో! భాస్కరుడా!
విజయ మే అన్నావో నరుడో! భాస్కరుడా!
నీదు శౌర్యం సూసి నరుడో! భాస్కరుడా!
కళ్ళల్లో జిల్లేళ్ళు నరుడో! భాస్కరుడా!
కళ్ళల్లో జిల్లేళ్ళతో నరుడో! భాస్కరుడా!
నీ శిరసు తీస్తిరయ్య నరుడో! భాస్కరుడా!

శింగేరి గట్టుకింద నరుడో! భాస్కరుడా!
నీ శిరసు తీస్తిరయ్య నరుడో! భాస్కరుడా!
నీ శిరసు తీసి వారు నరుడో! భాస్కరుడా!
సిందులే వేస్తిరయ్యా నరుడో! భాస్కరుడా!

సిందీన నెత్తురంత నరుడో! భాస్కరుడా!
సీసాల కెత్తిరయ్యా నరుడో! భాస్కరుడా!
సీసాల్లో ఏమిటన్న నరుడో! భాస్కరుడా!
సారాని సెప్పిరయ్యా నరుడో! భాస్కరుడా!

కారీన నెత్తురంత నరుడో! భాస్కరుడా!
కడవల్ల కెత్తిరయ్యా నరుడో! భాస్కరుడా!
కడవల్లో ఏమిటన్న నరుడో! భాస్కరుడా!
కల్లాని సెప్పిరయ్యా నరుడో! భాస్కరుడా!

పారీన నెత్తురంత నరుడో! భాస్కరుడా!
పీపాల కెత్తిరయ్యానరుడో! భాస్కరుడా!
పీపాల ఏమిటన్న నరుడో! భాస్కరుడా!
పాలాని సెప్పిరయ్యా నరుడో! భాస్కరుడా!

పేరీన నెత్తురంత నరుడో! భాస్కరుడా!
పేరిళ్ళ కెత్తిరయ్య నరుడో! భాస్కరుడా!
పేరిళ్ళ ఏమిటన్న నరుడో! భాస్కరుడా!
పెరుగాని సెప్పిరయ్యా నరుడో! భాస్కరుడా!

నినుసంపి మముసంప నరుడో! భాస్కరుడా!
మాటేసి కాటేయ నరుడో! భాస్కరుడా!
మాటేసి కాటేయ నరుడో! భాస్కరుడా!
కుట్రలే పన్నారో నరుడో! భాస్కరుడా!

నీవు సూపినబాట నరుడో! భాస్కరుడా!
మాదొడ్డ బాటయ్య నరుడో! భాస్కరుడా!
నీ బాటనే మేము నరుడో! భాస్కరుడా!
బందూకు పట్టాము నరుడో! భాస్కరుడా!

బ్రెంక సెట్టుకింద నరుడో! భాస్కరుడా!
బందూకు పట్టాము నరుడో! భాస్కరుడా!
బందూకు సేతబట్టి నరుడో! భాస్కరుడా!
బంధాలు తెంచాము నరుడో! భాస్కరుడా!

అక్టోబర్ 1970

# కా. గుండేటి శంకరన్న యాదిలో

## రచన: డప్పు రమేష్

విప్లవానికి ముప్పయ్యేళ్ళు సేవజేసిన అన్నా...
రాజ్యమే పామై చాటుమాటుగా నిన్ను కాటేసిందా?
ఒరిగితివా అన్నా... మమ్ము వీడితివా అన్నా...
నిను ఏ పాము కరిచెనో మా శంకరన్నా
విప్లవ నాయకుడ్ని మింగేసినాది
వీర యోధున్నీ చంపి ఘోరం జేసింది
విప్లవానికీ అది నష్టం జేసింది... ॥ఒరిగితి॥

1. కరిమినగరు జిల్లా గోదావరి ఖనిలోన
కార్మికుల ఇంటిలో పుట్టినా కామ్రేడు
నక్సల్‌బరి పోరు శ్రీకాకుళ హోరు
తెలంగాణమంతట రాడికల్లా జోరు
రైతాంగ ఉద్యమం, విద్యార్థి ఉద్యమం
రగల్ జెండుద్యమం, రైఫోల్ల ఉద్యమం
విద్యార్థి ఉద్యమ సారథివై నీవూ... అన్నా
విప్లవ తల్లి ఒడిలోకి చేరావు... ॥విప్లవ॥

2. అజ్ఞాతములో నీవు ఆయుధం చేపట్టి
అలుపెరగనీ యుద్ధ కళలెన్నో నేర్చినవ్
ఉత్తర తెలంగాణ వర్గ పోరాటాన్ని
ఉవ్వెత్తుగా లేచే కెరటాలు జేశావు
బహిరంగ రహస్య ఉద్యమాలను నీవు
యుద్ధ నైపుణ్యంతో కనిపెట్టి నడిపావు
పరుగెత్తే లేడినీ వలవేసి పట్టాడు... అన్నా
ఓరుగల్లు జైలులో నిన్ను బెట్టాడు... ॥ఓరు॥
॥ఒరిగితివా॥

3. జైలు గోడల నుండి బెయిలు మీద వచ్చి
మళ్ళీ ప్రజాయుద్ధ రంగాన దూకావు
అదిలాబాదు జిల్లా గోండులా కలిశావు
సింగరేణి గని కార్మికుల చేరావు
విప్లవకారుల సంఖ్యను పెంచావు
రాష్ట్ర కమిటి పార్టీ నాయకుని వైనావు
ఉత్తర తెలంగాణ అధికార ప్రతినిధిగా... అన్నా
జగనన్న పేరుతో జనములో నిలిచినావు ॥జగ॥
॥ఒరిగితివా॥

4. కళలు సాహిత్యాలు విప్లవానికి అవి
సైన్యమని అన్నాడు మావో మహాశయుడు
మావో జెప్పిన మాట మదిన బెట్టుకుందు
పాణి గ్రాహికి నీవు వారసుడైనావు
షంషేర్ పేరుతో కథలు, కవితలు రాసి
సాహిత్యరంగాన పట్టు సాధించావు
విప్లవ రచయితల కాదర్శమూర్తివే... అన్నా
విప్లవ సాంస్కృతిక ఉద్యమ జోహారులే నీకు ॥విప్లవ॥
॥ఒరిగితి॥

5. ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి పార్టీ
ప్రత్యేక ప్రోగ్రాము విడుదల జేసింది
బూర్జువా పార్టీల నెండగడ్తూ పార్టీ
ఉద్యమిద్దామంటూ ప్రజలకూ పిలుపిచ్చె
విద్యార్థి ఉద్యోగ కార్మికా శక్తులను
బూర్జువా పార్టీల నొదిలి రమ్మని పిలిచే
ప్రత్యేక తెలంగాణ సాధన కోసమూ... అన్నా
జగనన్న పేరుతో ప్రకటనా లిచ్చావూ... ॥జగ॥
॥ఒరిగితి॥

6. కన్న కొడుకు మరణవార్త విన్న తల్లి
కడసారి చూపుకై తల్లడిల్లిపోయె
పార్థివ దేహాన్ని ప్రజలకూ చూపించ
అవకాశమియ్యలె ఫాసిస్టు రాజ్యమూ
గెరిల్ల సైన్యమే ఘనముగా నీ యొక్క
అంతిమ యాత్రను జరుపుకున్నారు
జోహార్లు జోహార్లు గుండేటి శంకరన్నా... అన్నా
కోట్లాది పేదలా కన్నీటి జోహార్లూ.... ॥కోట్లా॥
॥ఒరిగితి॥

# ఒక్కరోజే కాదు... ఒక్కసారే కాదు...

- ఉప్పెన

ఒక్కరోజే కాదు... ఒక్కసారే కాదు...
ఒక్కరోజే కాదు... ఒక్కసారే కాదు...
నీ జీవితాంతం వరకు... నేస్తమా...
కమ్యూనిస్టుగ బ్రతికితేనే... మిత్రమా...
ఆ గొప్ప నీకు తెలుస్తుంది... నేస్తమా...
ఆ విలువ నీకు దక్కుతుంది... మిత్రమా... ఒక్క

ఒక్కరోజు ఎవరైన ఒక్కసారి ఎక్కడైన
కమ్యూనిస్టుగా ఉండుట కష్టమేమి కానే కాదు
అన్యాయం కంటపడితే వెంటపడి తరమవచ్చు
న్యాయం కోసం పెద్ద గొంతు ఎత్తి అరవవచ్చు
నీ జీవిత లక్ష్యం... నీ జీవిత గమ్యం...
నీ జీవిత ఆశయం... నీ జీవిత కర్తవ్యం...
అన్యాయాన్నెదిరించుటే తత్వంగా మారాలి
శ్రమ జీవుల రాజ్యమే నీ ధ్యేయంగా ఉండాలి...
ఒక్క

ఓట్ల జపం చేస్తున్న పార్లమెంటరీ పక్షులు
తెల్లని పావురాలు కంటున్న కలలు ఆపి
శత్రువుతోని ఎన్నడూ చేయి నీవు కలుపద్దు
మిత్రువుని చేయి వీడి ఎన్నడూ నువ్వుండద్దు
ఆశయాల ఎర్రజెండా... ఆచరణ దుడ్డు కర్ర...
అనుభవాల పుట్టలు... త్యాగాల గుట్టలు...
వర్గ రహిత స్వర్గంకై సాగుతున్న ఈ పోరులో
ముందు వరుసలోనే నీ వంతు పాత్ర ఉండాలి ఒక్క

పేదవాళ్ళను చూస్తే ప్రేమ పొంగి పొరలాలి
ధనవంతుల మాట వింటే మంటలై మండాలి
కులమత భేదాలకు అంటరాని తనాలకు
దోపిడి పీడనలకు చరమగీతి పాడాలి
చెమటను ప్రేమించడం... సెంటును ద్వేషించడం..
కులం కుళ్లు కడగడం... మతం మత్తు దించడం...
నీ నరనరాన వర్గకసి నిత్యం ప్రవహించాలె
ఏ త్యాగానికి వెనుకాడని తెగువ నీలో ఉండాలి
ఒక్క

బోయవాడి వలలోన చిక్కుకున్న పిట్టలకు
పంజరాన బందిగున్న రామచిలుక పలుకులకు
ఎరుపుల మెరుపులను ఉరుముల గర్జనలను
గుండె నిండ నూరిపోసి ఎదురు తిరగనేర్పాలి
స్వేచ్ఛను ప్రేమించడం... శత్రువును ద్వేషించడం...
క్రాంతిని ప్రేమించడం... భ్రాంతిని ద్వేషించడం...

నీ మనస్సులోన తెల్లని మల్లెపూలు పూయాలి
నీ కండ్లల్లో ఎర్రని నిప్పు రవ్వలు కురవాలిఒక్క

నువ్ గొంతు ఎత్తుతే జనం వంత నీతో పాడాలి
గంతు వేస్తే రణం నీతో అడుగలనే కలుపాలి
నీ ఆట పాట చైతన్య దివ్వెలు వెలిగించాలి
ఉద్యమాల్లో ఉప్పెనోలే ఉరకలు వేయించాలి
నీ కలం నీ గలం... నీ రాగం నీ గానం...
నీ ఆట నీ పాట తుపాకి తుటాలై
ఈ దోపిడి గుండెల్లో దూసుకొని పోవాలి
దగాపడ్డ జనం చేత దండును కట్టించాలి
( ...రివిజనిస్టు భావాలను వెదజల్లుతు, విప్లవ స్ఫూర్తిని చైతన్యాన్ని దిగజార్చి సాయుధ పోరాట పంథాను దెబ్బతీసి పంచదార పూత పూసిన విషపు గళిన వందేమాతరం నోట వచ్చిన ఒక్కరోజైన... ఒక్కసారైన అనే పాటకు ప్రతి స్పందనగా పెన్ కౌంటర్ చేస్తూ...)

# సహ జీవనం

- తంగెళ్ల సుదర్శనం

సహ జీవనం ఇది సహ జీవనం
మనషుల మనసులు కలిసిన
సహచరుల జీవనం ॥సహ॥

కట్నాల కానుకల చరాలు లేని జీవనం
వేద మంత్రముల జాడలు కనిపించని జీవనం
సంప్రదాయ సంకెళ్ళను తెరిచిన ఈ జీవనం ॥సహ॥

ఉద్యమాల చెట్టుకు కొమ్మలవలె ఆకుల వలె
ఆకులలో పువ్వులవలె పువ్వులలో రెమ్మలవలె
ఒకరినొకరి అల్లుకొన్న ఆనంద జీవనం ॥సహ॥

మాకున్నది సిద్ధాంతము నమ్మము మీ వేదాంతం
మనిషిని మనిషిగా జూసే సమాజ మొకటుండాలని
సమసమాజ దారిలో సాగేటి జీవనం ॥సహ॥

ప్రజాస్వామ్య విలువల పరిమళాలు పంచేటి
సోషలిస్టు విలువల సొసైటీలో నిలిపేటి
కమ్యూనిస్టు విలువలతో కడదాక సాగేటి ॥సహ"

# యుద్ధం మొదలాయెరో

- జక్క గోపాల్

యుద్ధం మొదలాయెరో
గిరిజన గుండేల మీద
సిద్ధం కావాలేరో

యుద్ధం ఆపానిక ॥యుద్ధం॥

1. మూతులు నాకే మన్మోహన్
సేతులు పిసికే సోనియాగాంధీ
సేతగాని పాలనతోని
సెప్పరాని తిప్పలాయె
తిప్పలు బడి అమెరికోని
సిప్పలు కడిగి బతుకుతుండ్రు ॥యుద్ధం॥

2. గడ్డిగదామల్ల పేరిరి
గండు చీమలలా తిరిగి
నిమ్మపండ్లు చుట్టు తెనే
నేలన బుట్టిన కందా గడ్డ
కాకులు దూరని అడవిపైన
కన్నుబడే దొంగల కేమో
దోచుకోను దారిలేక
దొంగ లోలే ఎంటబడిరి

3. ఆకలైనా అడిగి తినరు
ఆపదొస్తే బాద పడరు
ఆకు అలము నూరుకొని
అపదేల్ల దిసుకుంటరు
దేవుని మీద బారమేసి
బరోసాని బతుకుతారు
బాదలు తీర్చుదేమోగాని
బతుకు మీద యుద్ధమయో ॥యుద్ధం॥

4. సల్లాగాలి వీచి తల్లి
గుండె తల్లడిల్లిపాయె
మద్ది ఊట నీళ్ళుతాగి
మంచామెక్కె తల్లిబిడ్డ
మందులించేటోడు లేడు
మందులించేటోడు లేడు
మాటలు రాని జీవు మీద
ముటకొరకు యుద్ధమంట ॥యుద్ధం॥

5. ఖనిజ సంపదతల్లి
కడుపులోన దాసిందాని
కడుపు మీద కన్నుబడి
కత్తులు నూరుతుండ్రు
లోకమెరుగని బిడ్డల మీద
కాపుకాసి కాటువేసి
గద్ద లేతుకపోయినట్టు
బిడ్డ లేతుకపోతున్నారు

*శివసాగర్ యాదిలో ఒక కవిత*

# ఉద్యమం నెలబాలుడు

ఎర్రని తూర్పు వాకిలిలో నిలుచొని
బందూక్‌లో మందు మరింతగా దట్టించి
పక్కనే ఉంచుకొని
నా రక్తంతో రాస్తున్నాను ఈ బహిరంగ లేఖ
ఈ లేఖలో జనహృదయాన్ని స్పందిస్తున్నా

డియర్! కామ్రేడ్!
ఉహూ... కాదు.....మిస్టర్ రెనగేడ్!
చల్లకొచ్చి ముంత దాయటం
నా రక్తంలో లేదు
ఉన్నది ఉన్నట్లు
కుండ బద్దలు
కొట్టినట్లు
చెప్పటం అందరికీ శ్రేయస్కరం!

నిన్న నీవు విప్లవ వీరుడివి
నేడో విప్లవ విద్రోహివి
నిన్న నా కామ్రేడ్‌వి
నేడు పక్కా రెనగేడ్‌వి.
మన గడ్డలో సాయుధ పోరాటం పొందిన
తాత్కాలిక అపజయానికి అదిరి
విముక్తి పోరాటంలోని
ఆటుపోటులకు గుండె చెదిరి
విప్లవ విద్రోహ వీలునామాపై
నిర్లజ్జగా సంతకం చేస్తున్నావ్

నీ గొంతు నీవే పిసుక్కొంటున్నావ్
నిన్ను నీవే హత్యచేసుకుంటున్నావ్
నిన్న ప్రజాపరం చేసిన నీ జీవితాన్ని
నేడు శాసనాల మురికి సందుల్లో వెదుక్కుంటున్నావ్
మరణం ముందు జాలిగా
ప్రాధేయ పడుతున్నావ్
మన ఉద్యమం నెలబాలుడు
ఆజాను బాహుడు
కాబోయే అనంత బల సంపన్నుడు
అని మరిచి పోతున్నావ్!

రెనగేడ్!
ప్రయాణం పదివేల మైళ్ళని
ముందే అనుకున్నాం అవునా?
పది అడుగులు వేశామో లేదో
అపుడే ఎందుకింత ఆయాసం?

ఈ నావ చేరవలసింది
సుదూర తీరమనీ
మార్గ మధ్యంలో
పెనుతుపానులు, సుడిగుండాలు
తప్పవనీ
ముందే అనుకున్నాం. అవునా?
నిన్న లంగరు ఎత్తామో లేదో
అపుడే ఇంత కంగారు
ఈ దోపిడీ పర్వతాన్ని
తవ్వాలని
నిన్న నడుంకట్టి
రెండు పెల్లలు
కుల్లగించామో లేదో
అపుడే వెల్లకిల పడితే, ఏం ఫాయిదా?

హిమాలయ పర్వతారోహణకు
బయలుదేరి రెండే రెండు రోజులు
అప్పుడే గుండెదడ! తోక పీకుడు!
శాపనార్థాలు! హరయోగం!

విప్లవ పోరాటం
వెల్లగుర్రం మీద స్వారీ అనుకున్నావా, స్వామీ!
పులి గుహలోకి
వెళ్ళ సాహసించిన వాడే
పులిపిల్లను పట్టి తెస్తాడు
వెయ్యి కత్తి వేట్లకు
జంకని వాడే
రాజును పదవీ భ్రష్టుణ్ణి చేస్తాడు
విప్లవ పోరాటం
నల్లేరు మీద బండి అనుకున్నావా 'భాయి!'

మా బాట నెత్తురు మడుగు
అది కన్నీటి కడలి!
మా పోరాటం తుదివరకూ
జయాపజయాల కలనేత!
అది అనంత త్యాగాల సేత!

రెనగేడ్!
ఖబడ్దార్!
నిన్న నీవు వల్లించిన సూక్తులనే
నేడుఎలుకలా సగంసగం కొరికేస్తున్నావ్
ప్రజలు నీపై వర్షించిన
అంతులేని విశ్వాసానికి విద్రోహం చేసి
కనిపించని రాజీలకు దిగి
సాయుధ పోరాటానికి సాష్టాంగ నమస్కారం చేసి
శత్రువు పెట్టే హద్దుల్లో
ముద్దులొలికే ఉద్యమాలను ఉద్ధరించాలనీ
లోక్‌సభ తోలుబొమ్మలాటలో మరో కేతిగాడు కావాలనీ
బంగారక్కతో సిగ్గువిడిచి తైతక్కలాడాలనీ
బంజరు పెంజేరు పోరాటాలకు
మాదాకబళం మహా సంగ్రామాలకు
మళ్ళీ ఢంకా బజాయించాలనీ
విముక్తికోసం గాక
భుక్తి కోసం
జనరాజ్యం కోసం గాక
నిండు భోజనం కోసం
భవతీ! భిక్షాందేహీ అనాలనీ
నేడు నీవిస్తున్న సలహాలు
చరిత్ర రథ గమనానికి
అడ్డంగా విసిరే
పనికిరాని గులకరాళ్ళు.

రెనగేడ్!
విప్లవ వీరులు చిందించిన రక్తం
తడి ఆరకముందే
తెగిన వీరుల శిరస్సులకు
ఇంకా శత్రువు చేసే మదింపు
పూర్తి కాకముందే
మా ఉజ్జ్వల పోరాట చరిత్రను
తిరగ రాద్దామనే
నీ తాపత్రయం! నీ తహ తహ!
నీ పిరికి తనానికి చిహ్నం

రెనగేడ్!
నా బొందిలో ప్రాణం ఉన్నంతవరకూ
నా రక్తంలో జీవశక్తి జ్వలిస్తున్నంతవరకూ
తుదికంటా నీ విద్రోహంతో పోరాడుతాను
నేను నేనుకాదు
నేను గిరిజనుడు సారించిన విల్లును
నేను రైతు కసితో విసిరిన గండ్రగొడ్డలిని
కలకత్తా నడివీధిలో విగ్రహ మహాత్ముణ్ణి విధ్వంసం చేసిన సమ్మెటను
ఫ్యాక్టరీపై అరుణపతాకాన్ని ఎగరేసిన కార్మిక హస్తాన్ని
పోలీస్ ఠాణాలో రైఫిళ్ళను స్వాధీనం చేసుకున్న వాణ్ణి

నేను నేను కాదు
నేను అధోలోకానికి పోతున్న
సమాజ విమానాన్ని హైజాక్ చేసినవాణ్ణి
ఖడ్గాన్ని మీటి ప్రచండ జన సంగీతాన్ని సృష్టించిన వాణ్ణి
దరిద్రంలో సచేల స్నానం చేసి
చరిత్ర చెక్కిలి ముద్దిడిన వాణ్ణి
నేను పొత్తిళ్ళలోని ప్రజా సైన్యాన్ని

నేను నక్సల్ బరీని! నేను ముషాహారీని!
నేను శ్రీకాకుళాన్ని
రెనగేడ్! నేను విప్లవాన్ని!
మృతవీరుల తనువు నుండి
ప్రవహించిన రక్తంలో
ప్రభవించిన మానవుణ్ణి!

సామాన్యుణ్ణి, అసామాన్యుణ్ణి
అమరుణ్ణి, అజరామరుణ్ణి
నాదేశం ముందు వినమ్రుణ్ణి
అవును నా దేశం నన్నాదేశిస్తున్నది
రక్తసిక్త విముక్తి బాటనే పయనించమని
నా ప్రజ నాకుపదేశిస్తున్నది
సాయుధ పోరాటం వినా మరోమార్గం లేదని
ప్రపంచ పరిణామం
ఇదే ఇదే పదే పదే చెబుతున్నది

బందూక్‌ను వదిలి పెట్టేందుకు
అపజయాలను సాకుగా చూపించేది నీవు
బందూక్‌ను మరింత దృఢంగా పట్టేందుకు
జయపజయాలను మననం చేసేవాణ్ణి నేను
మధన పడేవాణ్ణి నేను
వ్యక్తిగా పోరాటంలో మరణించినా
మహత్తర శక్తిగా ఉద్యమంలో సదా జీవిస్తాను.
నీవు పోరాటం వదిలి, కన్నులొట్టపోయి
బతికి బట్ట కట్టినా
నీ కన్నా శవం నయం!

ఎర్రగా ఉదయించిన సూర్యుడు
ఎర్రగానే అస్తమిస్తాడు
రెనగేడ్!
నీ ఓటి రథాన్ని
పడమటి దిక్కుగా మళ్ళిస్తూ
తూర్పు వాకిళ్ళకు ఎలా చేరుకుంటావ్?

జనం పదునెక్కారు
నీ విద్రోహాన్ని నిలువునా కోస్తారు
జనం పోరాటం చవి చూచారు
నీ బూటకత్వాన్ని లోతుగా తవ్వి తీస్తారు

ఉద్యమం మెడ చుట్టూ
నీవు పేనిన కనిపించని ఉరితాళ్ళు
నీ మెడకే జాగ్రత్తగా తగిలిస్తారు
మరింత విప్లవ జ్వాలల్ని రగిలిస్తారు

అపజయ ఆగడ్తలను దాటి
విజయం దిక్కుగా పయనిస్తారు.

రెనగేడ్!
నిన్న తొలి సంజలో మన మధ్య
పూలు పూచిన సాయుధమైత్రి
ఇక నేటితో చెల్లు

కాలం పురోగమిస్తుంది–ఆగదు
విప్లవం జ్వలిస్తోంది–చావదు
ఉద్యమం నెలబాలుడు
పెరిగి పెద్దవాడై
వినూత్న జీవిత మహాకావ్యాన్ని రచిస్తాడు–తప్పదు.

జూలై 1971

# వెంటాడే ప్రశ్న

- కూర్మనాథ్

పొద్దున్నో, సాయంత్రమో, పడుకునేటప్పుడో
మా పాప అడుగుతుంది
'కిషన్‌జీని ఎందుకు చంపేరు' అని

నన్నో, వాళ్ళమ్మనో ఎవరో ఒకరిని
కళ్ళల్లో పెట్టి అడుగుతుంది
'కిషన్‌జీ ఎలా చనిపోయాడ'ని

ప్రతిరోజూ అడుగుతుంది అదే ప్రశ్న
ఒకే సమాధానం విని వినీ కూడా
మళ్ళీ మళ్ళీ నిలదీస్తుంది
నెలలు గడుస్తున్నా ఎందుకోగాని
అదే ప్రశ్న తనని వెంటాడుతుంది
గాయాలతో ఛిద్రమైన ఆ దేహం
తనని కలవరపెడుతున్నదా?
లేకపోతే, కలవరపెట్టే ఆ ప్రశ్నని
మేం మరిచిపోకూడదనా?
ఇదిగో యిప్పుడు ఆడుకుంటుంది
బహుశ ఆట నుంచి వచ్చేక మళ్ళీ అడుగుతుంది
'కిషన్‌జీని ఎందుకు చంపేరు నాన్నా' అని
ఇక ఎట్లా మరిచిపోతాం, ముఖ్యంగా
గుండె కోత మిగిల్చిన ప్రశ్నలని

# పరేషాన్

- పి. వీరబ్రహ్మాచారి

ఎవడిది ఆ పరేషాన్
ఎందుకీ ఆపరేషన్
సో యూ వాంట్ టు హంట్ గ్రీన్
వైల్ సేయింగ్ ప్రొటెక్ట్ ది గ్రీన్
పీపుల్ కెన్ సీ యువర్ యాక్షన్
దె అన్‌వీల్ యువర్ కర్టెన్
దెన్ యు విల్ హావ్ టు రన్
అవే ఫ్రమ్‌ది నేషన్
వాట్ ఎల్స్ విల్ బి యువర్ డెస్టినేషన్
బట్ ఓన్లీ ది ఓషన్

# ఉప్పొంగుతున్న నది

నది ఉప్పొంగుతోంది
నట్టనడి రాతిరీ
మిట్ట మధ్యాహ్నమూ

***

ప్రవాహం పరుగులు పెడుతున్నది
తీరాన్ని మేల్కొల్పుతూ
తీరంతో సంభాషిస్తూ
తీరాన్ని విస్తరిస్తూ
తీరాన్ని కౌగిలించుకుంటూ
తీరాన్ని సంలీనం చేసుకుంటూ

***

నది పరవళ్లెత్తుతోంది
కొండలొచ్చినచోట చీలుతూ కలుస్తూ
పిల్లకాలువల దండెదై అల్లుకుంటూ
సుడులు తిరుగుతూ
పరిమళ నురగల్ని కక్కుతూ
ఎక్కడెక్కడి ఇసుక రేణువుల
ఏకతా సూత్రమై
నది ఉరకలెత్తుతోంది

***

దరుల మీద
వంగిపోయిన చెట్ల అనుభవాల నీడన
తంగేడుపూల పుప్పొడి చల్లుకొని
నది నిప్పులు చెరుగుతోంది

***

అలలు అక్షరాలై
గలగలలు గొంతులై
తరంగాలు పాటలై
నది
సుతిమెత్తని గమకాలతో
నడుస్తోంది... పరుగులు తీస్తోంది

***

నది విశ్వాసాన్ని నింపుతోంది
నెర్రెలిచ్చిన మెదళ్లలోకి
ఆశల్ని బంపుతోంది
నిశ్చల సమాధి మీద
చలించే జీవాన్నొకదాన్ని
పుట్టిస్తున్నది
ఇసుక తిన్నెల మీద వెన్నెల ధూళై
నది జర జరా పాకుతోంది.

***

నది
కొండను ఢీకొంటున్నది
చీకటి కీకారణ్యంలో
దీపధారై మెరుస్తున్నది
ఎగిరి దుంకుతూ
కాలానికి సవాలిసురుతున్నది
నది విప్లవిస్తున్నది

***

నది నా లోపల ప్రవహిస్తున్నది
నది నన్నూ ప్రవాహాన్ని చేసింది
నది తనకూ నాకూ
అభేదాన్ని ప్రకటించింది
నది నాలాగే అందర్నీ...

***

నది సకల కార్యాల కర్త
ముక్కూ మొఖం లేని
దుంగల్ని మోసుకెళ్తోంది
పరిగె కంపల్నీ ఈడ్చుకెళ్తోంది
నదికేమిటి ఎదురు
నదికేమిటి బెదురు
నదికి నదే సాటి

***

పేగు కాలుతున్న కమురువాసనతో
నది ఉప్పొంగుతోంది
పల్లం నుంచి ఎత్తుకు
పై ఎత్తుకు

***

# సాయుధ వాగ్దానం

- బాసిత్

పెద్దపల్లి పేదతల్లి
కడుపు తీపి విలాపం...

వీరుడి కలం
'విప్లవాభివందనమై'
గుండె తట్టిన
సాయుధ పద్యమై
తల్లి రుణం తీర్చుకుంటుంది...

గరికపచ్చ తివాచీ పరుచుకున్న
కుప్పోని అడవి తల్లి గుండెలపై
ఉద్యమ ఉగ్గుపాల కుతి తీరని
సమరయోధుడి
తడియారని పెదవులు...
వేటగాడి గుండెల్లో
మాటల మందుపాతర్లు పేల్చిన
రిమోట్ కంట్రోల్డ్ మీటలు...

జగిత్యాల జైత్రయాత్ర
ఝుండా కర్రందుకొన్న
నవోన్మేష చేతనం...
తెలుగునేల...
దండకారణ్యం...
ఒడిశా... జార్ఖండ్.... చత్తీస్‌ఘడ్...
అసోం... బెంగాల్..... ఉత్తర దక్షిణ ఈశాన్య భారతం....

అల్లుకున్న అనుబంధాల వెలుగు... ప్రసరిస్తూ...
తూరుపు కొండల నడుమ
దారిపొడవున
తా నడిచిన నేలంతా
'నాగేటి చాలై'
ఆదివాసీ
స్వయంపాలనా పోరాటాల
సమత విత్తుల్ని నాటిన
భావజాలం భౌతిక శక్తై

దేశమంతా
రెపరెపలాడించిన
భూమి, భుక్తి, విముక్తి కేతనమై
నేలతల్లి
రుణం తీర్చుకుంటుంది... అంతేకాదు
హంతక రాజ్యం
తెగటార్చిన
యోధుడి ఒక్కొక్క అవయవం
చిమ్మిన రక్తం జూసి...
అమ్మా! కార్చకు... కన్నీరు
కానివ్వకు
నీ గుండెకు గాయం...
జంగల్ మహల్...
బురుసోలి అటవీ క్షేత్రం...
దేశమంతా...
ఈ మట్టి రాలిన
రక్త బిందువులు
లక్షలు, లక్షలుగా
వీరయోధులు
నీ బిడ్డలై...
ప్రభవించేది ఖాయం...

వీరుడి మరణం
సాయుధ వాగ్దానమై
ఇప్పుడిక
కన్నీటి బాకి తీర్చుకుంటది

# స్మృతిలో గురు శిష్యులు

- ఎస్ఎస్ఆర్

మొన్న మొదలు పెట్టింది చెప్పడం ముగియలేదు
నిన్న చెప్పాల్సింది మొదలు పెట్టనే లేదు
మరి తలపుల మబ్బుల్లో ఉబికే
గుండె దిగుళ్ళకు అద్దం పట్టేది ఎలా
వెల్లువెత్తి కన్నీటి వరదల ఏతమేసి
తోడి ఎదల నింపుకునేది ఎలా
ఎప్పుడు ఎవ్వరి దగ్గర మొదలెట్టినా
వేలాది మంది వీరుల అమరత్వం
శిరస్సులెత్తి తమ గురించీ;
విన్నపాల సుడిగాలి వీచే వేళల్లో... మనలో
ఎగదన్నే ఉద్వేగాల పరంపరకిది నాంది
అరుణారుణ సూర్యబింబం గురువైతే
ప్రజా జ్ఞాపకాలలో మెరిసే నల్ల కలువై
ఆమె ప్రియ శిష్యురాలయ్యింది
వారిద్దరిదీ నల్లని దేహచ్ఛాయ
ఆయనది కాకి నలుపు
ఆమెది మట్టి నలుపు
ఇద్దరివీ నిండయిన విగ్రహాలే
ఇద్దరివీ మానవీయ సంబంధాలే
కుటుంబ పోషణకై శ్రమైక జీవనమే
వీరికెంతో ఇష్టమైన చిన్నప్పటి ఆట
పొలం పనులే ఆటలుగా ఆడి
నెగ్గుకొచ్చిన బాల్యం ఇద్దరిదీనూ
నూటొక్క ఆటలాడే ఆకాంక్షల సరితూగే
పటిష్టమైన శరీరాలు ఇద్దరివీ
చూస్తేనే నవ్వు తెప్పించే బొజ్జ ఆయనది
ఆయుధాన్ని తలపించే తనువు ఆమెది
ఇద్దరూ రాటుదేలిన శ్రామిక వర్గ పనిముట్లే
వేగు చుక్క పొడిచే వేళల్లో ఒగేరువాగులో

నేలను తాకే కొద్దీ
పైపైకెగిరే వాలీబాలై ఆయన
మసక చీకట్లు కమ్మే సంజెవేళల్లో
ప్రత్యర్థి టీమ్ లీడర్ సూర్యం గారిని తాకి
ఎక్కువ పాయింట్లతో టీమ్‌ను బతికించుకున్న
చావు బతుకుల చెడుగుడు కూత ఆయన
ముందుకొచ్చిన పొట్టను చలిమిడిగా మార్చి
శరీరాన్ని వేపాకురెమ్మలా నలువైపులా
వంచగల వ్యాయామ క్రీడాకారుడాయన
కాలి వేళ్ళ నుండి తలదాకా
శరీరమంతటినీ తొంగరం ఆటలోలా
వ్యాయామంలో అలసటెరుగని
శ్రమైక జీవి ఆమె
మద్యం సిండికేట్లచే
పల్లె ప్రజల కాళ్ళుమొక్కించి
గుంజీలు తీయించడమే
ఆయనకు సరదా తీర్చే ఆట
అక్కలు చెల్లెళ్ళను అల్లరి చేసే
ఆకతాయిల పొర్లించి పొర్లించి
తన్నడం ఆమెకెంతో ఇష్టమైన ఆట
ఖాకీ కుక్కల కలవపరచి వెంటాడి
తరమడం ఆయనకో దోబూచులాట
అడవి జనాల గుండె బలమై
ఫారెస్టు రేంజర్ల పరుగులు తీయించి
సింహ స్వప్నమవ్వడమే ఆమెకు
ఉల్లాసకరమైన ఆట
ఉచ్చులెన్నో పన్నినప్పటికీ
ప్రజల కూడిక ఎలానో...
విడిపోవడమెలానో...
తెలియనివ్వని రీతుల...
ప్రభుత్వ ఆస్తుల విధ్వంసంతో
సర్కారుకు సవాల్ విసిరి నిర్బంధాన్ని
ఎదిరించిన చెర్లాటగాడు ఆయన
దళాల ఫార్మేషన్‌లో క్రమశిక్షణై
వరస దాడుల్లో మునుముందు నిలిచి
ఎంతో మందికి ఆదర్శక్రీడాకారిణి వలె
కనిపించేదామె
శత్రువు పన్నిన కోవర్టుల కుట్రల వలలో చిక్కి
చిత్రహింసల కొలిమిలో రగిలి రగిలి
మాంసం ముద్దలయినా
తలొంచని సాహసాల ఆటై
సవాల్‌పై సవాల్ విసిరి
ప్రాణమంతా కొడిగడుతున్నా...
దేహమంతా ఎర్రజెండై
గురువుల ముందు త్యాగాల ఒరవడిని
తీర్చిదిద్దుకున్న దీరోధాత్త ఆమె
శిష్యురాలి మహోన్నత ఆదర్శ జీవనానికి
కించిత్ గర్వంతో పొంగిన గురువు ఆయన
నింగికెగసిన ఆటు పోటుల వర్గపోరు
శత్రువు కళ్ళెదుట ఎడతెగని భయోత్పాతమై
ప్రజా యుద్ధపు క్రీడల్లో గెలవాలని
ఆదర్శ అమరత్వపు కీర్తి పతాకాలకు
ఆయనో మాస్టర్ కోచ్
పీపుల్స్‌వార్ ఒలింపిక్స్‌లో గెలుపుకు హామీగా
ఫ్లాగ్ మార్చింగై ముందు వరసలో పరుగులెత్తి
గురువుకు తగ్గ శిష్యురాలయ్యింది ఆమె
తమ సంపద తము పొందగలిగే
విముక్తి పోరును ప్రజలు
ఆడి గెలవడమే వీరి సుందర స్వప్నం
ఈ స్వప్నాలు నిజం చేసుకునే ఆటలగెలుపే
వాళ్లు మన ముందుంచిన మహోన్నత లక్ష్యం
(అమరులు ఎం.ఆర్. (వెంకట్రావ్), నాగమణి (ఉప్పు ప్రమీల)ల స్మృతిలో...)

## త్యాగం

### - మేడక యుగంధరరావు

సమున్నతంగా, సగర్వంగా
నిశ్చలంగా, నిస్వార్థంగా, నిర్భీతిగా
మేఘావృత ఆకాశ అంచులను తాకుతున్న
ఓ చిక్కటి, వెచ్చటి నెత్తుటి జెండా
నీ పేరేమిటి?, నీ ఊరేమిటి?
త్యాగం
త్యాగం - ఒక పదం కాదు
త్యాగానికి గుండెల్ని పిండి కరిగించి
కదిలించి ఊగించి ఉప్పెన చేసే దృశ్యమాలికలున్నాయి
త్యాగానికి వేల. వేల సంవత్సరాల చరిత్ర ఉంది

వీరులు! ఆదర్శమూర్తులు
ఇల్లునొదలి, ఊరునొదలి, చదువునొదలి
ఉరికొయ్యలను హేళన చేశారు
ఇది చాలదు - మీరంటే ఏమిటో తెలుసుకోవడానికి
ఇది చాలదు - మే మెటువైపో తేల్చి నిక్కచ్చిగా నిలబడదానికి?!

ఈ రాజ్యం ఎవరిది? ఈ సంపద ఎవరిది? ఈ మట్టెవరిది?
తెలియని చరిత్ర లోతుల్ని తరచి తరచి
చిక్కువిప్పి చీలుతున్న స్వేద బిందువుల్ని ఒక్కటి చేశారు
వీరులారా! నిన్నటి సలుపుతున్న గాయాలకు మందులు మీరు
రేపటి ఉషోదయ ప్రకాశాలకు కదలిక మీరు
మంటల్లో కాలుతున్న ఈ చరిత్ర
మీ నుదుటన ఆప్యాయంగా ముద్దాడకుండా వుంటుందా?
చేపల్ని మింగిన తిమింగలాలు

దొంగ దెబ్బకు నేలకొరిగిన వీరులు
మా చిన్ని కూనలు, చిరుదివ్వెలు, మా వెలుగు రవ్వలు
కరెంటు తీగల్లోనో, పెంట కుప్పల్లోనో, మురికి కాలువల్లోనో
మరొక చోటో శవాలు పలకరిస్తూనే ఉంటాయి
ఎన్‌కౌంటర్...? ....??
పులిముఖం తగిలించుకున్న అబద్ధం
వినబడిందే వినబడడం, చెప్పిందే చెప్పడం
పలికిందే పలకడం
చెవుల్లో జోరీగలా కోటిన్నొక్కసార్లు
రాదారి మొత్తం రక్తపు మడుగులు
అడుగు తీసి అడుగేస్తుంటే
ఎక్కడో చేతులు కలిపిన వెచ్చటి జ్ఞాపకం
విడిపోతూ వదిలిన చల్లటి హాఫ్‌స్మైల్
ఇప్పటికీ పొలమారుతూనే ఉంది

ప్రియాతి ప్రియ నేస్తాల్లారా!
చంకలోని చంటి పాపల్లారా!
ఉట్టె మీది చద్ది మూటల్లారా
పైకి ఎగుస్తున్న రక్తం ఒక్కటే చెబుతుంది
చూపులు స్పష్టం, మాటలు స్పష్టం
చేతనావస్థలో ఉన్న ప్రతిదీ స్పష్టం

# కార్పొరేట్ కారిడార్

- ఉదయమిత్ర

షేక్స్పియర్ ఊహించి ఉండడు
సహజమైన మనిషి జీవన దశల్ని
అద్భుతంగా కవిత్వీకరించాడే కాని
ఇప్పుడన్ని జీవన దశలూ ఉనికిని గోల్పోయి
పెట్టుబడి డేగకుజిక్కిన
బతుకు పావురాలవుతాయని
ఆ మహా రచయిత ఊహించి ఉండడు.

ప్రకృతి నిరంతరం ఆరాధించి
ప్రకృతి చేతికే కలాన్నిచ్చి
మహాద్భుత రహస్యాల్ని
కవిత్వీకరించిన వర్డ్స్ వర్త్
ఈ ప్రకృతి ఇలా విధ్వంసమౌతుందనీ
దేవతలు విలసిల్లే కొండలు
మైనింగ్ సంస్థలకు
చౌక గిడ్డంగులవుతాయని
జలకళలు మాయమయి
మృత్యు కళలు విస్తరించి
కార్పొరేట్ల విలయ నృత్యంలో
ప్రకృతి విలవిలలాడుతుందనీ
ఆ మహాకవి ఊహించి ఉండడు
'ఆకులో ఆకునై... పూవులో పూవునై'
'ఈ అడవి దాగిపోనా... ఇచ్చటనే ఆగిపోనా' అని
స్వప్నించిన కృష్ణశాస్త్రి
ఈ అడవులిట్లా రక్తసిక్తమవుతాయని
గ్రే హౌండ్స్, నాగా బెటాలియన్లు సరిహద్దుదళాలు
ఇలా ఒకటేమిటి...
యుద్ధమే వలసవొచ్చి
బక్కచిక్కిన ఆదివాసీల్ని
అడవిమంటలా చుట్టుముడుతుందనీ
ప్రభుత్వమే తన బిడ్డలపై
యుద్ధమిలా ప్రకటిస్తుందనీ
ఆ భావకవీ, మానవతావాదీ ఊహించి ఉండడు.

* * *

ఇక్కడ... ప్రతి గట్టూ, గుట్టా, చెట్టూ
ప్రతి నదీ, అడవీ, మైదానమూ
వాటి నావరించిన బతుకులూ
పెనవేసిన ఆశలో
వికసించిన జీవకళలూ
శతాబ్దాలుగా పోషించుకున్న
సంస్కృతీ సాంప్రదాయాల మీద
పాలకులకూ, కార్పొరేట్లకూ మధ్య
ఒక పరస్పర అవగాహనా ఒప్పందం
గుంభనంగా కుదిరిపోయింది
ప్రజల వనరుల్ని కొల్లగొట్టి
ఒక్కొక్కరి రెక్కలు విరిచి
నిస్సహాయుల, బానిసలజేసి
పెట్టుబడి పళ్లెంలో బెట్టి
కార్పొరేట్ క్రూరమృగాలకు అప్పజెప్పాలని
పరస్పర ఒప్పందం కుదిరిపోయింది
కాళ్ల కింద సంపద
కులాలకు ఉరితాడయిన చోట
ధిక్కరించే ప్రజల్ని
రక్తపుటేర్ల ముంచడాన్కి
రక్షణ సంతకాలు అమల్లోకొచ్చాయి
'భయంలేని, అలసటలేని, దుఃఖాలు లేని
ఆ స్వేచ్ఛా స్వర్గంలోకి
నా తండ్రీ.. నా దేశాన్ని మేల్కొల్పు' అని
భావి భారతాన్ని స్వప్నించిన ఠాగోర్
ఈ సువిశాల ప్రజాస్వామిక దేశంలో
చిన్న స్వేచ్ఛ కోసం
ఇంత రొట్టె కోసం
జానెడు జాగా కోసం
ప్రజలు యుద్ధాలు చేయాల్సి రావడం
ఆ విశ్వ కవికి
బహుశా... తట్టి ఉండదు...

# తూర్పు

- ఈస్ట్‌విండ్ (నారాయణ)

ఆ తూర్పు దిక్కు ఏముందా!
బతుకు పరాధీనమైనప్పుడు
భరోసా కోల్పోయినప్పుడు

అంతిమ పరిష్కారమేదో
ఆ వైపునే దొరుకుతుందనే చివరి ఆశ
మళ్ళీ మళ్ళీ అదే ఆశ

ఆ తూర్పు గాలి తాకితే చాలు
ఇంటెన్సివ్ కేర్‌లో ఉన్నా
ఇమ్యూని కమ్యూన్ అవుతుందనే ఏదో నమ్మకం...

ఆకలి అసమానతలు అస్తిత్వాలకు
అంతిమ పరిష్కారం అటువైపే ఉందేమో!

నేనే కాదు!
కులదురహంకారం పడగ విప్పినప్పుడు
కారంచేడు అటే చూసింది
వేంపెంట అటే చూసింది
ఇప్పుడు ఆదివాసీలు, అంతర్జాతీయ
సమాజం అటే చూస్తోంది.

ఆ తూర్పు గాలి తాకిందంటే
ఎండి మోడువారిన చిట్టడవైన కీకారణ్యం అవుతుందని
అంతరించి పోతుందనుకున్న జీవ కణజాలం
మళ్ళీ అవతరిస్తుందని వారికో ఆశ

పొద్దువాలిన పడమర దిక్కే కాదు
పొడుచుకొచ్చే తూర్పు దిక్కే భూమి తిరుగుతుంది
నిన్న ఇటు గూకిన పొద్దు రేపు అటువైపునే కదా పొడుస్తుంది?

# ఆమె

సి. కాశీం

ముప్పై వసంతాలుగా ఆమెను
చూస్తూనే ఉన్నాను

గడ్డిపువ్వులు శిరము వాల్చినచోట
మంచు
వెన్నెలలో
గాయపడ్డ కన్నీటిని

ఆమె
రక్తాక్షరాలలో చదువుతున్నది

మట్టిపెల్లలు నేల కొరుగుతుంటే
ఎన్‌కౌంటరైన రాత్రుల్ని
లెక్కించడానికి
ఆమె
ఎన్ని క్షణాలను
ఆయుధానికి వేలాడదీసిందో...?

పట్నం చూరుకింద
తెరుచుకున్న వాకిళ్ళలో
ఆమె
మట్టి దుప్పటిని దులిపినప్పుడు రాలిన
నెత్తుటి సంతకాలను
స్పష్టంగానే పోల్చుకున్నది

ఆమెది
మొండెం తెగిపోయి
వలస రహదారికి వేలాడుతున్న
ఒంటరి శోకం
ఆకురాలిన బతుకులో
మాంసం ముద్దలు
వదిలిపోయిన గుర్తులు మినహా
ఆమెకు మిగిలింది శూన్యమే

ఇంకిపోయిన చనుబాలు
రొమ్ము నుంచి కారుతున్న
రక్తం తాలూకు జ్ఞాపకాలు
ఆమెను
దుందుభి నదిలా మెలిపెడుతున్నాయి

పుట్టకముందే మరణించిన
బిడ్డలకు
మరణించకముందే
మృత్యువును
గోడకు దిగ్గొట్టాలని
ఆమె
యుద్ధ రహస్యం బోధిస్తుంది

మానవుడా
అగ్గిని కౌగిలించుకున్నవాడా
రైలుకు ఎదురేగిన వాడా
ఉరిని ముద్దాడిన బిడ్డా

నిన్నేమని పిలువాలి
నీతో ఏ భాషలో
నీతో ఏ భాషలో సంభాషించాలి...?

ఆమె
ఒరిగిపోయిన కాలాన్ని
కొలిమిలో వేడెక్కిస్తూ
శిథిల గోడలపై
వెన్నెలై కురుస్తున్న పాలమూరు

తెలంగాణ హృదయం మీద
ఆమె
పచ్చటి జ్ఞాపకమై మెలుస్తున్న
అజ్ఞాత స్వప్నం

## దాచుకున్న బడబాగ్నుల మాటేమిటి

- తాయమ్మ కరుణ

ఒకటా, రెండా
ముప్పైఏళ్లు...
ఎన్నేళ్లయితేనేం
ఉరుకలెత్తే యవ్వనమంతా
ఉప్పొంగులెత్తే పోరాటాల్లోనే కద గడిచింది...
ప్రతి అడుగూ.. బలంగా...
ఒక దీక్షతో... లక్ష్యంతో...
కాలికి బలపం కట్టుకుని కదా తిరిగావు
అందుకేనేమో...
వాడు నీ పాదాలు నరికాడు...
ఇన్నేళ్ళ ప్రయాణంలో
ఎందరు వీరులకు
టార్గెట్ గురిచూడడం నేర్పావో
అందుకేనేమో...
నీ ట్రిగ్గర్‌నొక్కె వేలిని విరిచాడు
ఎందరికి...
పోరు పాఠాలు నేర్పావో...
అందుకేనేమో...
నీ నోటిని ఛిద్రం చేశాడు.
కానీ...
ప్రజలు తమ గుండెల్లో...
పొదివి దాచుకున్న
విప్లవ బడబాగ్నుల మాటేమిటి
బహుశా... అవి మాటుగాచి వేచి చూస్తూ ఉంటాయ్

## విప్లవ విత్తనం

- ఎం. తిరుపతయ్య

తెలంగాణలో పుట్టి
విప్లవంతో వికసించిన వాడు

రాజ్యం కత్తికి
ఎదురొడ్డి నిలిచిన పోరాట యోధుడు

గిరిజనుల బతుకులకి
కాగడై వెలుగిచ్చిన వాడు
దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా
పోరాడిన వాడు
సమానత్వాన్ని కలగన్నవాడు

తెలంగాణ పల్లెల్లో
విప్లవ విత్తనాలని
వెదజల్లిన వాడు

అటవీ సంపదలపై
ఇనుప డేగలు వాలకుండా
కాపలా కాసినవాడు

ఎర్రజెండా మరింత ఎరుపెక్కాలని
తన శ్రమను ధారపోసిన మనిషి

జగిత్యాల జైత్రయాత్రతో మొదలై
జంగల్ మహల్‌లో
మానవత్వం లేని 'మమత' ప్రభుత్వపు
బూటకపు ఎన్‌కౌంటర్‌కు బలయ్యాడు
ఇంకా
రక్తం ఏరులై ప్రవహిస్తూనే ఉంది
శాంతి స్వప్నాల పంటలు పండించడానికి

అరుణ కిరణాలను ప్రసరించిన కిషన్ జీ
కోటి వెలుతురులను కలగన్న కోటేశ్వరరావు
అమర వీరుల స్థూపమెక్కి
ఆశయాల సాధనకై దారి చూపిస్తున్నాడు

## ఓ మేధావి

- రాజు

ఓ అపర మేధావి
గోసి తప్ప ఏమిలేని వాళ్లం
మా బతుకును ఛిద్రం చేస్తున్న వేళ

మేము అరిచి గీ పెడుతున్నాం
మాకు కోరసైతారనుకున్నాం
మా పాటల్లో రాగం అయితారనుకున్నాం
మా పెన్నుల్లో సిరా లైతారనుకున్నాం

రాజ్యం ఛిద్రం చేస్తున్నప్పుడు
మీ గొంతు మూగ పోయిందా మేధావీ
మీ మౌనం రాజ్యానికి అర్థం అంగీకారమైతున్న వేళ
మీ మేధస్సు మాసడిచేల వెనుక పెంట కుప్పలో కలుస్తుందో
మా గుడిసెల ముందు ఎగిరే జెండా కర్రలైతారో

## లొంగిన ప్రతిసారి

- పచ్చల కిరణ్‌కుమార్

సృష్టించుకున్న సమస్యల నుండి
దూరంగ పారిపోవాలకుంటాను
నా నీడనే వెంటాడుతూ అవి
అన్ని దక్కించుకోవాలని ఉన్నతంగా ఉండాలని
మోహం వెంట నడుస్తూన్నప్పుడు
పతనం నీడై అనుసరిస్తు ఉంటూందని
చుట్టూ చీకటి అలముకున్నదాక మేల్కోలేకపోయాను

గరికపూల పాన్పు మీద
దేహాన్ని పడుకోబెట్టి
ఆశల తీరం వెంట
ఎన్ని ఆలోచనలను పరుగెత్తించాను!
ఎన్ని ప్రలోభాలకు అమాయకంగా లొంగిపోయాను!
లొంగిన ప్రతిసారి
నైతికంగా మరణించడమేగా

ఉన్నది లేనట్టుగా
లేనిది ఉన్నట్టుగా
డాంబికాల నటనా జీవితంలో
ఎంత మిడిసిపడ్డాను

ఇవాళ
నా సహచరులను
రక్త సంబంధీకులను
అందరినీ దూరంగా నెట్టేసి
ఆర్థిక ప్రపంచంలో
ఎంతో ఎత్తుకు ఎదగాలని ఆరాటపడుతూ
మానవతా బోనులో దోషిగా నిలబడ్డాను

ఇప్పుడు
జీవితం
మే నెలలో మిట్ట మధ్యాహ్న సమయాన
గొంగళి కప్పుకున్నంత చిరాగ్గా ఉంది
జీరో డిగ్రీ సెల్సియస్ వేళ
మంచు తుపాను తాకినంత వణుకుగా ఉంది

కనుకొలకల్లో సంద్రాలను సృష్టిస్తున్న
ఈ పోటి ప్రపంచాన్ని
ఇంకా కేబుల్ బంధంలా అల్లుకుపోలేను
ఈ భయానకమైన
పోటీ ప్రపంచం నుండి
వినమ్రంగా నిష్క్రమించి
మానవ సంబంధాలన్ని
మరుగుజ్జుగా మారిపోతున్న క్రమం నుండి
నన్ను నేను నిలబెట్టుకోవాలి

నా నుండి దూరమైన
నా ప్రేమికులనందరిని అక్కున చేర్చుకోవాలి

## నేను ఆదివాసిని మాట్లాడుతున్నా

- శ్రీమన్నారాయణ

సంమదిరింకు రాం రాం! సందిరికు రాం! రాం!
ఆదిలాబాద్ అడవుల జిల్లానే
అటవీశాఖ మైదానం చేసింది

ఆదిలాబాద్ ఆదివాసీల జిల్లానే
మూలవాసుల పూలుగు లేకుండా చేసింది
మా నేల కింద ఖనిజంపై
బహుళ జాతి డేగకన్ను పడి
అమాంతం మమ్మల్ని
టైగర్ జోన్‌లోకి నెట్టింది

కుంటాల హైడల్ ప్రాజెక్టు
డొర్లి, కైరిగూడ ఓపెన్ కాస్ట్
ప్రాణహిత చేవెళ్ళ భూ నిర్వాసితులం మేమే
1/70, 5, 6 షెడ్యూలు
అన్ని కాగితాల మట్టుకే
అమలయిందీ లేదు
మా అవసరాల్ని గుర్తించిందీ లేదు

కొంరంభీం వారసులమని
దర్పముగా ప్రతి ఏటా దర్బార్‌లు జరుగతవి
అధికారులు వరాల మాటల మూటను విప్పుతరు
జల్ జంగల్ జమీన్ కోసం
ఇప్పుడు మేం
ఇంద్రవెల్లులు అవుతం
కొంరంభీంలు అవుతం



పుస్తక పరిచయం



# పరాయీకరణ ప్రతిఫలన కథలు - పరాయోళ్ళు

- జి. వెంకట కృష్ణ

ప్రపంచీకరణ వెల్లువలో తెలుగు సమాజపు మధ్యతరగతి కంప్యూటర్ల వాడకాన్ని ఉన్నతీకరించిన జీవన విలువగా మార్చుకుంది. అవసరాన్ని మించి ఐటి రంగాల్లో పనిచేసేవాళ్లు అతి సంపాదనపరులుగా మారడం, వాళ్లముందు మట్టి పిసుక్కుని బతికే రైతు ముష్టివాడుగా, దిష్టిబొమ్మగా పరాయీకరింపబడిన వైనం - ఉక్రోషంగా, ఆగ్రహంగా, విధ్వంసంగా మారి కంప్యూటర్లను బద్దలు చేయాలని చూస్తే దానికి కారణం ఎవరు? ఐటి - ఏ సైలెంట్ రెవెల్యూషన్‌ను ప్రశ్నిస్తూ రాసిన కథ 'నిశ్శబ్ద విప్లవం'.

స్వచ్ఛంగా, సహజంగా దొరకాల్సిన ప్రకృతి సంపద నీళ్ళు. పారిశ్రామికీకరణ చేసే కలుషితాల నేపథ్యంలో ఇప్పుడు నీళ్లు అంగడి సరుకు. తాగేనీళ్లు కూడా ఫ్యాక్టరీ ప్రొడక్టుగా మారిననాడు, ఆ సరుకు నుండీ కార్మికుడు పరాయీకరింపబడిననాడు, చిందేది నెత్తురే అని చెప్పే కథ 'వాటర్'.

అందరికీ అందుబాటులో ఉండాల్సింది వైద్యం. అవసరమైనంత వరకే రోగనిర్ధారణ పరీక్షలు అన్నంత అనుకూలంగా ఉండాల్సిన వైద్యానికి, మార్కెట్ మాయాజాలపు ప్రలోభాల తెర కళ్ళకు అడ్డుపడితే, తన స్వతఃసిద్ధ స్వభావాల నుండీ పరాయీకరింపబడి పతనమైన పల్లెటూరి ఆరెంపీ డాక్టర్ కథ మాయరోగం.

బతుకు తెరువు కోసం పాట్లు పడుతున్న కళాకారుల్నీ మాటలతో మాయచేసి, ప్రైవేట్ కంపెనీలో కూలీలుగా మార్చి, లాభాలపేటలో యాంత్రీకరణకు వాళ్ల బతుకుల్ని వీధి పాలు చేసి, కళల నుండీ పరాయీకరించే పెట్టుబడుదారీ కుట్రకథ, 'ధూల్‌పేట ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్'.

లేనిజాతివాళ్ళే తన పెట్టుబడిగా, ఆదాయం సంపాదిద్దామనే ప్రలోభంతో అగ్రకుల మిత్రుడి కొడుకును ఎస్.సి.గా మార్చడానికి, దత్తతు పత్రాలతో స్వంతూరికి వచ్చిన మనిషి ఎదుర్కొనే సామాజిక బాధ్యతనూ, పరాయీకరణను అధిగమించే వైనాన్నీ తెలిపే కథ 'మనిషి గెలిచాడు'.

కోస్తా ప్రాంతం నుండీ కడుపు చేతబట్టుకొని వలసవచ్చిన వాడు, ఎదిగి, ఆ ఎదుగుదలతో అహంకరిస్తూ, అక్కడి స్థానిక వనరుల్ని ఉపయోగించుకుంటూ స్థానిక ప్రజల్ని అణచాలని చూసే, మానవత్వం నుండీ పరాయీకరింపబడిన మనుషులు ఎదుర్కొనే గడ్డు పరిస్థితిని వివరించే కథ 'పరాయోళ్ళు'.

ఇట్లా జి. ఉమామహేశ్వర్ రాసిన కథలన్నీ గ్లోబలైజేషన్ నేపథ్యంలో పరాయీకరింపబడుతున్న సకల సామాజిక కోణాలనూ పట్టుకున్నవే. 14 కథలున్న పరాయోళ్ళు కథా సంపుటి 90ల తర్వాత తెలుగు సమాజం పొందిన అన్ని పరిణామాలనూ ఆవిష్కరించే అక్షరాల కెమెరా! కర్నూలు జిల్లాలోని మారుమూల ప్రాంతాలను, తన కథా స్థలంగా చేసుకుంటూ ఆంధ్రప్రదేశ్ ఎదుర్కొన్న కల్లోల పరిస్థితుల కాలాన్నీ, ఘటనలన్నీ ఇతివృత్తాలుగా చేసుకుంటూ, ఆలోచనాపరుడూ, సున్నితమనస్కుడూ అయిన ఈ రచయిత చేసే వ్యాఖ్యానాలూ, సూత్రీకరణలూ అన్నీ ప్రజల పక్షానే. గాంధీని ఆరాధించే భావకుడైనా, బాలగోపాల్‌ను ప్రేమించే ఆచరణత్వం వల్ల, సామాజిక ఉద్యమాల అస్తిత్వాన్నీ, అవసరాన్నీ తన రచనలో బలంగా చిత్రించగలిగాడు. అందుకు ఉదాహరణ ఈ సంపుటిలోని 'మన అవసరం' కథ.

అనేక సామాజిక అవ్యవస్థల నుండీ మనిషి పొందుతున్న పరాయీకరణలతో పాటు కుటుంబ సంబంధాలలో కనిపించే దయనీయతల్నీ కూడా ఈ రచయిత స్పృశించాడు. 'బిడియమేలా ఓ చెలీ' కథ మధ్య తరగతి కుటుంబాలలో పెళ్లి కాకుండా మిగిలిపోయిన వయసుమళ్లిన కన్నెయ హృదయగానం. చాలా సున్నితమైన అంశాన్ని శిల్పనైపుణ్యంతో కథగా మలచడంలో ఉమామహేశ్వర్ ప్రతిభను ఈ కథలో చూడవచ్చు. అలాంటిదే 'ఆనంద కుటీరం' కథ. వృద్ధాప్యం మీదా, ముసలివాళ్ళు ఎదుర్కొనే తరాల అంతరం మీదా, ఆ అంతరాల్ని ఏ మానవీయ వంతెనలతో అధిగమించాలో ఈ కథలో సూచిస్తాడు రచయిత.

గది తలుపులన్నీ మూసేసి తరమాలని చూస్తే పిల్లే తిరగబడుతుంది. చారెడు నేల ఏనాటికైనా తనది తాను పండించుకోక పోతాడా అని ఏళ్ళ బానిసత్వాన్ని మోసినవాడు, ఆ బానిసత్వం ముగియదని తేలిననాడు కళ్ళు ఎరుపెక్కించక తప్పదని చెప్పేకథ 'ఎర్రపాలు'. పాలు పిండుకో, రక్తం వచ్చేదాక పిండొద్దని ఈ కథలో నీతి. గ్రామీణ భారతంలోని ఆధిపత్య సంబంధాలూ, భూమిని ఆదాయవనరు కానీయకుండా చేస్తున్న పరాయీకరణ మీద ఎక్కుపెట్టిన బాణం ఈ కథ.

గ్రామీణ ప్రాంతాల పట్ల సానుభూతితో ఉంటూనే, గ్రామీణ ప్రజానీకపు అవసరాలనూ, ఆరాటాలనూ, అనివార్య పరిణామ ఘటనల సుడిలో సమాజం ఎదుర్కోవాల్సిన నిష్ఠుర సత్యాలనూ నిర్ద్వంద్వంగా వెల్లడిస్తాడు ఉమామహేశ్వర్. భూమి ఒక అవసరం అని ఎంతగా చెప్తాడో, భూమిని నమ్మి పల్లెలో ఇరుక్కుపోవడాన్ని అంగీకరించక, ప్రత్యామ్నాయ అన్వేషణ అది ఎంత ప్రయాసతో కూడినదైనా దాన్ని ఎదుర్కోవాల్సిందేనంటారు. ఈ నేపథ్యంలో 'ఎర్రపాలు' గతకాలపు కథైతే 'బ్లాక్ హోల్' ఇప్పుడు నడుస్తున్న కథ. ఊరిలో ఇంత పొలం ఉంది. పై ఖర్చులకు పిండిగిర్ని ఉంది. ఊర్లో ఉండమంటే, ఎండిపోయిన పంట కాలువా, నిర్జీవంగా కన్పించే ఊరూ, ఎదిగి వస్తున్న అవసరాలూ ఆ యువకుడ్ని పట్నమనే ప్రలోభం వైపే తరుముతాయి. యుద్ధానికి వెళ్తున్న సైనికుల్లా, బతకడానికి వెళ్తున్న వలస కూలీలు పరాయీకరింపబడిన పల్లెతనం నుండీ పట్నం కలిపేసుకుని అనివార్యతను చిత్రించిన కథ బ్లాక్‌హోల్.

వ్యాసం

# పెట్టుబడి-ప్రకృతి-సమాజం

## (నెల్లూరు పవర్ ప్రాజెక్టుల కింద నష్టం నిజం, పరిహారం మిథ్య, అభివృద్ధి మాయ)

- పి. వరలక్ష్మి

(2)

*(గత సంచిక తరువాయి)*

పవర్ ప్రాజెక్టుల మధ్య ఉండలేరు కాబట్టి ఇప్పుడు ఊర్లు ఖాళీ చేయాల్సిన పరిస్థితి వచ్చాక కోల్పోయిన భూమికి, వాళ్ళ ఊరికి, మొత్తంగా వాళ్ళ జీవితాలకు కంపెనీ ఎంత చవకగా వెల కట్టిందో ఆలోచిస్తున్నారు ప్రజలు. పల్లెవాని దిబ్బ గ్రామస్తులు ఇంటికి 50లక్షలు నష్టపరిహారం ఇచ్చి తమను తరలించాలని అడుగుతున్నారు. కాని ఫ్యాక్టరీ పని మొదలు పెడితే చచ్చినట్లు ఖాళీచేసిపోతారని కంపెనీవాళ్ళు గాని, ప్రభుత్వం గాని పలకడం లేదట. కంపెనీల లెక్కలన్నీ పెట్టిన పెట్టుబడి ఎంత తొందరగా వెనక్కొస్తుందనే, లాభాల లెక్కలేగాని ప్రజలకు, ప్రకృతికి కలిగే నష్టాలు లెక్కకట్టడం వాళ్ళకేం అవసరం?

ఇటువంటి అనుభవాలే అనేక చోట్ల పునరావృతమవుతుంటే ప్రభుత్వ హామీలను, పునరావాస ప్యాకేజీలను జనం నమ్మడం లేదు. ఏ నిర్మాణాలూ లేకున్నా కొన్ని చోట్ల ప్రజలు మిలిటెంట్‌గా తిరగబడుతున్నారు. తీవ్రమైన అణచివేత ప్రయోగించినా పరిశ్రమల స్థాపన ప్రభుత్వానికి తలనొప్పిగా తయారైంది. అభివృద్ధి పథకాన్ని వెనక్కి తీసుకోవడం ఇష్టం లేని ప్రభుత్వం, పెట్టుబడిదారీ మేధావులు, మీడియా ఒక విచిత్రమైన వాదనను ముందుకుతీసుకొస్తున్నాయి. అదే 'ప్రజల్ని అభివృద్ధిలో భాగం చేయడం'. అది కొన్ని చోట్ల మైనింగ్ లాభాలను ప్రజలకు పంచాలనే దాకా పోయింది. భూమిపై హక్కు నుండి వాళ్ళను తొలగించి వేశాక, ఆ భూమి వేరెవరి యాజమాన్యం కిందికో వెళ్ళిపోయాక ఆచరణలో ఇదెంత అసాధ్యమో తెలియంది కాదు. అయినప్పటికీ 'అభివృద్ధి' పరమమనే భావనను స్థాపించడానికి ఇలాంటి వాదనలు తెస్తుంటారు. 'అభివృద్ధి అవసరమే. కాదని ఎవరూ అనరు. అయితే ఆ అభివృద్ధిలో స్థానిక ప్రజలను భాగస్వామ్యం చేస్తేనే ప్రజల మద్దతు పొందగలరు%తత%ఇట్లా సాగుతుంది. స్థానిక ప్రజలను అభివృద్ధి చేయడం, స్థానిక ప్రజలను అభివృద్ధిలో భాగస్వాములను చేయడం - ఈ రెండూ వేరు వేరు అంశాలు. మొదటిది ప్రజలు నివశించే భౌగోళిక పరిస్థితుల్లో వారి జ్ఞానాన్ని అభివృద్ధి చేసి, జీవన విధానాన్ని, ఉత్పత్తి విధానాన్ని మెరుగు పరచొచ్చు. ఉదాహరణకు నెల్లూరు జిల్లాలో సాన కాలువల ద్వారా ప్రజలు సమష్టిగా అభివృద్ధి చేసుకున్న వ్యవసాయం. పాత సమాజపు వ్యవసాయ విధానానికి ఇది ఒక గొప్ప అభివృద్ధి. ప్రభుత్వాలు నిజంగా అభివృద్ధి చేయాలంటే మరింత విస్తారమైన భూమిని సాగుయోగ్యం చేయొచ్చు. వైవిధ్యమైన పంటలు పండించడానికి ప్రోత్సాహమివ్వచ్చు. ఆ పంటలకు మార్కెట్ కల్పించవచ్చు. ఆ ప్రాంతాలకు విద్యా, వైద్య సదుపాయాలు కల్పించవచ్చు. కాని మొత్తం ప్రాంతాన్ని పరిశ్రమలకు ఇచ్చేస్తే అది అక్కడి జనానికి పూర్తిగా సంబంధం లేని ఉత్పత్తి విధానం కాబట్టి అందులో వాళ్ళు భాగస్వాములు కాలేరు. వాళ్ళ ఊరు పరాయిదైపోతుంది. నష్టపరిహారం కింద వాళ్ళకెంత డబ్బిచ్చినా నష్టమే మిగులుతుంది తప్ప పరిహారం ఉండదు.

ఈ కల్లోలం, విధ్వంసం అలా ఉంచితే మొత్తంగా అభివృద్ధి పథకాల వల్ల దేశంలో ఎంత మేరకు ఉత్పత్తి విధానాలు, ఉత్పత్తి సంబంధాలు మార్పుకు గురవుతున్నాయని అంచనా వేయడం దీర్ఘకాలిక ప్రజా ఉద్యమ నిర్మాణాలకు అవసరం. సెజ్‌లు, పారిశ్రామిక కారిడార్‌లు వంటి విధానాలు పెద్దఎత్తున విస్థాపనకు దారి తీస్తున్న క్రమంలో వ్యవసాయం మీద ఆధారపడ్డ అధిక జనాభాపైన ఎటువంటి ప్రభావం ఉంటుంది? పాత సమాజాలు ఏ మార్పు దిశగా పోతున్నాయి? ఈ మార్పులో ప్రజలు ఏమి కాబోతున్నారు? వివిధ అభివృద్ధి పథకాల కింద నిర్వాసితులవుతున్న వాళ్ళు కొత్త ఉత్పత్తి సంబంధాల్లోకి పోతున్నారా? కనీసం గత దశాబ్ద కాలంలో నిర్వాసితులవుతున్న వాళ్ళ గురించి పరిశోధన ఆసక్తికరంగా ఉంటుంది.

మరో వైపు మన దేశంలో పారిశ్రామికీకరణ పేరుతో ప్రభుత్వం ప్రోత్సహిస్తున్న పెట్టుబడిదారుల పోకడలు ఎక్కువగా లంపెన్ స్వభావం కలిగి ఉన్నట్లు చాలా సార్లు రుజువవుతోంది. పరిశ్రమల పేరు చెప్పి భూముల్ని కబ్జా చేసి వనరుల్ని దోచుకుపోతూ ఉత్పత్తి ఏమీ లేకుండానే మార్కెట్‌ను స్పెక్యులేట్ చేసి డబ్బు చేసుకునే వర్గం ఒకటి తయారయింది. దానికి చాలా ఉదాహరణలు దొరుకుతాయి గాని ఇటీవల మీడియాలో బాగా ప్రచారమైన గాలి జనార్ధనరెడ్డి ఉదంతం అందరికీ తెలిసిందే. గాలి జనార్ధనరెడ్డికి "బ్రాహ్మణి స్టీల్స్" కోసం కడపజిల్లా జమ్మలమడుగులో ప్రభుత్వం 10,700 ఎకరాల భూమిని సేకరించి ఇచ్చింది. ఆ భూమిలో ఫ్యాక్టరీ రాలేదు కాని దాన్ని పెట్టుకొని

---

ఒక ఆలోచనపరుడిగా ఉమామహేశ్వర్ సమాజంలోని సకల వైకల్యాలనూ తనదైన దృష్టితో చూసి, వ్యాఖ్యానించి పాఠకుల కళ్లముందు సత్యావిష్కరణ చేసాడు. గ్రామీణ పట్టణ జీవన సంక్లిష్టతలను చిత్రించడంతో పాటు, చెంచుమిట్ట కథలో అటవీ ప్రాంత ప్రజల మనోధైర్యాన్నీ తన రచనలో వ్యక్తీకరించాడు. కథా సమయం కర్నూలు బృందపు నాణ్యమైన వారసత్వాన్ని ఈ కథా రచన ద్వారా స్థిరపరచగలిగాడు. ఇది ఈ రచయిత మొదటి కథా సంపుటే అయినా, మరిన్ని కథలతో ప్రజలపక్షాన నిలబడే రచయితగా మిగుల్తాడనే భరోసా ఇస్తుంది.



ఇటు బ్యాంకు రుణం పొందడమేకాక అటు అనంతపురం జిల్లాలో ఓబులాపురం ఇనుపఖనిజం ఇష్టారాజ్యంగా అమ్ముకొని ఆయన ఎన్ని వేల కోట్లు సంపాదించాడో లెక్కలేదు. సెజ్ కోసం సేకరించిన వేల ఎకరాల్లో ఎన్ని పరిశ్రమలొచ్చాయి, వచ్చిన పరిశ్రమలకు వాస్తవంగా ఎంత స్థలం కావాలి, ఎంత మేరకు కంచెలు కట్టారు అని చూస్తే భూ దందా అర్థమవుతుంది. ఇబ్బడి ముబ్బడిగా అనుమతులు పొంది భూముల్ని సేకరిస్తున్న పవర్ ప్రాజెక్టులను ఈ కోణం నుండి కూడా పరిశీలించడం అవసరమేమో.

వివిధ అభివృద్ధి పథకాల్లో నిర్వాసితుల సమస్యతోపాటు ప్రకృతి విధ్వంసం, వనరుల దోపిడి ఇటీవల ఎక్కువ చర్చకొస్తోంది. భారీ నీటిపారుదల ప్రాజెక్టులకు వ్యతిరేకంగా మొదలైన ఆందోళనల నుండి దండకారణ్య ప్రాంతంలో బహుళజాతి కంపెనీలతో ప్రభుత్వం చేసుకున్న వాణిజ్య ఒప్పందాలు, గ్రీన్ హంట్, వివిధ ప్రాంతాల్లో కాలుష్యకారక పరిశ్రమల స్థాపనకు వ్యతిరేకంగా ముందుకొస్తున్న ఉద్యమాల వరకు పర్యావరణ పరిరక్షణ ప్రధాన వాదనగా వినిపిస్తోంది. పర్యావరణ పరిరక్షణ సంస్థలు ప్రజా ఉద్యమాలకు మద్దతునిస్తున్నాయి, కొన్నిచోట్ల ముందుండి నడిపిస్తున్నాయి. ఈ నేపథ్యంలో అభివృద్ధి, ప్రజాప్రతిఘటన, పర్యావరణం వీటి మధ్య తార్కిక సంబంధం చర్చించుకోవాలి.

చిత్తడినేలల పరిరక్షణ కోసం సోంపేట, కాకరాపల్లి ప్రజలు ప్రాణాలకు తెగించి పోరాడడం వెనక, నియంగిరి కొండల మీద ఆదివాసుల పోరాటం వెనక ప్రకృతి, మానవ సమాజం మధ్య ప్రాణప్రదమైన సంబంధం ఉంది. అక్కడ ప్రజల ఉనికికి మూలం ఆ సజీవ సంబంధమే. పర్యావరణ పరిరక్షణ దీర్ఘకాలిక మానవ మనుగడకు సంబంధించిన విషయంగా పర్యావరణవేత్తలు విశ్లేషిస్తుంటే, అక్కడి ప్రజలకు అది తక్షణ జీవన్మరణ సమస్యగా ఉద్యమాలకు వారిని సమీకరిస్తోంది. దండకారణ్య ఆదివాసులు ఒక ప్రత్యామ్నాయ రాజకీయ నిర్మాణం కింద చేస్తున్న పోరాటం ఈ కోణాన్ని స్పష్టం చేస్తుంది. ఎదిరించడానికి ప్రజలకు నిర్మాణాలు లేని చోట్ల కూడ ప్రకృతి విధ్వంసం మొదట ప్రభావం చూపేది దానితో అరమరికలు లేని సంబంధాన్ని కొనసాగిస్తున్న ప్రజల పైనే. ఇప్పుడది ఎక్కువగా మత్స్యకారులపైన కనిపిస్తోంది. మూడేళ్ళ క్రితం మత్స్యకారులు దక్షిణ భారత సముద్ర తీర ప్రాంతమంతా సుదీర్ఘయాత్ర చేసి తమ సమస్యలను లోకానికి చాటే ప్రయత్నం చేశారు. ఈ యాత్ర గుజరాత్ నుండి కోల్‌కటా దాకా 2008 మే 1 నుండి జూన్ 27 వరకు జరిగింది. అద్భుతమైన జీవవైవిధ్యం ఉన్న 3200 తీరప్రాంత గ్రామాలను, సముద్రాన్ని, మత్స్యసంపదను కాపాడే దిశగా ఉద్యమ నిర్మాణం ఎంతైనా అవసరం. తీర ప్రాంత భూముల్లో పండే ఆహార పంటలే కాదు, సముద్రం ద్వారా దేశ ప్రజలకు అందే విలువైన పోషకాహారాన్ని కోల్పోయే ప్రమాదం గురించి పర్యావరణవేత్తలు చేసే హెచ్చరిక కాదనలేని నిజం.

పర్యావరణం గురించి చర్చ వచ్చినప్పుడల్లా అభివృద్ధిని పోటీగా తీసుకురావడం మామూలే. అభివృద్ధి ఫలాలు అందుకుంటున్న మధ్యతరగతి కాస్త చిరాకును ప్రదర్శిస్తారు కూడా. అయినా ఈ మధ్య కాలంలో వాతావరణంలో వస్తున్న మార్పులు, గ్లోబల్ వార్మింగ్ గురించి మీడియా, ఎన్జీవో సంస్థలు చేస్తున్న ప్రచారం సమస్యను గుర్తింపజేస్తున్నాయి. కాని అవి పెట్టుబడిదారీ వనరుల దోపిడిని చాకచక్యంగా మరుగుపరుస్తున్నాయి. అభివృద్ధిని, పర్యావరణాన్ని బ్యాలెన్స్ చేయాలని, అంతకు మించి మరో మార్గం లేదని ప్రధానంగా వినిపిస్తున్న వాదన. ఇదెలా ఉంటుందంటే పాతిక వేల ఎకరాల పంటపొలాల్ని థర్మల్ ప్లాంట్లకు ఇచ్చేసి పర్యావరణ పరిరక్షణ కోసం ఫ్యాక్టరీల చుట్టూ గ్రీన్ బెల్ట్ నిర్మించినట్టు. (నిజానికి వాళ్ళు ఇది కూడా చేయటం లేదు.) విచక్షణారహితంగా అడవుల్ని నరికేసి అంతరించిపోతున్న జీవరాశుల్ని తెచ్చి "జూ"లలో, సంరక్షణాకేంద్రాల్లో ఉంచినట్టు.

పర్యావరణ సంక్షోభంపై అంతర్జాతీయ శిఖరాగ్ర సమావేశాలలో పర్యావరణ సమతుల్యతతో కూడిన అభివృద్ధి గురించే చర్చలు జరుగుతాయి. సామ్రాజ్యవాద దేశాల ప్రయోజనాలకు భంగం కలగకుండా ఉండేలా ప్రపంచ పర్యావరణ సదస్సులు నిర్దేశింపబడతాయి. 1992 రియో శిఖరాగ్రసమావేశం భూవనరుల్ని సంరక్షించాలని తీర్మానిస్తూ పర్యావరణ సమతుల్యతతో కూడిన అభివృద్ధికి మద్దతు తెలిపింది. అసలు 'అభివృద్ధి' అనే దాన్ని ఏ అర్థంలో వాడుతున్నారు? ఆర్థికాభివృద్ధి అనే మార్కెట్ అర్థంలోనే. అంటే ఆర్థికాభివృద్ధి నిలకడగా ఉంటూనే పర్యావరణ సమతుల్యాన్ని కాపాడాలని. అన్ని ఆర్థిక కార్యకలాపాలకు వనరులు అవసరం. అన్నీ వ్యర్థాలను(కాలుష్యాన్ని) ఉత్పత్తి చేసేవే. మరి పర్యావరణాన్ని కాపాడుకోవాలంటే ఆర్థికాభివృద్ధిని వదులుకోవాలా అనే వైరుధ్యం వెంటనే వచ్చి పడుతుంది. ఇది ఎప్పటికీ పరిష్కారం కానిది. పైకెన్ని చట్టాలున్నా లాభాల్ని తగ్గించుకోవడం ఇష్టం లేని పెట్టుబడిదారులు కాలుష్యనియంత్రణ కోసం కనీస చర్యలు తీసుకోకపోవటం, ప్రభుత్వాలు వాటిని చూసీచూడనట్టు ఉండటం ప్రపంచమంతటా ఉంది. దేశాల మధ్య ఎక్కువ తక్కువ తేడాలతో. రియో సమావేశం నుండి క్యోటో(1997), కోపెహాగన్(2010) సమావేశాలకంతా సంక్షోభనివారణ దిశగా స్పష్టమైన నిర్ణయం ఏదీ తీసుకోలేని అశక్తత బయటపడింది.

ఎందుకంటే అసలు సమస్య మార్కెట్ దృష్టికోణంలో ఉంది. మార్కెట్‌కు ప్రకృతిని చూసే దృష్టికోణం దుర్మార్గంగా ఉంటుంది. దీన్ని ప్రముఖ మార్క్సిస్టు విశ్లేషకుడు జాన్‌బెలామీ ఫాస్టర్ ఇలా వివరిస్తాడు. 'మార్కెట్ అడవులను కలపగానే చూస్తుంది తప్ప దాన్ని సజీవమైన పర్యావరణ వ్యవస్థగా చూడదు. ఆ అడవిలోని వందల సంవత్సరాల వయసున్న చెట్లు వడ్డీ రేటుతో సమంగా పెరగవు. అటువంటి అనుత్పాదక సంపదలను త్వరగా కోతకోసి డబ్బు చేసుకోవాలి. ఆ స్థానంలో పారిశ్రామిక స్థాయిలో ఒకటి రెండు దశాబ్దాలలో పెరిగి కలపనిచ్చే చెట్లను నాటి రసాయన ఎరువులతో వాటిని ముంచెత్తి పెంచాలి'.

పర్యావరణ విధ్వంసం తాలూకూ ఏ గణాంకాలను చూసినా ఆర్థికాభివృద్ధికి సమాంతరంగా ప్రకృతి విధ్వంసం కనపడుతుంది. ప్రపంచ జనాభాలో కేవలం 4శాతం జనాభా ఉన్న అమెరికా 25శాతం కాలుష్యాన్ని విడుదల చేస్తోంది. ప్రపంచీకరణ ఆర్థిక విధానాలొచ్చాక కాలుష్యకారక పరిశ్రమలు మూడో ప్రపంచ దేశాలకు వలస పోవడం

ఊపందుకుంది. దీన్ని ప్రపంచ బ్యాంకు దుర్మార్గంగా సమర్ధించడాన్ని 1992 ఫిబ్రవరి 8 నాటి 'ఎకనమిస్ట్' పత్రిక బయట పెట్టింది. 1991 డిసెంబరు 12న ప్రపంచ బ్యాంకు ముఖ్య ఆర్థికవేత్త లారెన్స్ సమ్మర్స్ పంపిన నివేదికలోని కొంత భాగం అది ప్రచురించింది. దాని సారాంశం ఇది.

కాలుష్యం వల్ల నష్టం ఎంతనేది దానివల్ల కోల్పోయిన ఆదాయాన్ని బట్టి ఉంటుంది. పేద దేశాల్లో వేతనాలు తక్కువ కాబట్టి అనారోగ్యాల వల్ల, మరణాల వల్ల కోల్పోయే ఆదాయం కూడా తక్కువే. ధనిక దేశాల్లో వేతనాలు ఎక్కువ కాబట్టి కాలుష్యం వల్ల కోల్పోయే ఆదాయం ఎక్కువ. మొత్తం మానవాళి ఆర్థిక విలువ ఎక్కువ నష్టపోకుండా ఉండాలంటే పేద దేశాల్లో కాలుష్యకారక పరిశ్రమలు పెట్టాలి. మరో విషయం ఎక్కువ ఆదాయ వెసులుబాటు ఉన్న దేశాల్లో పరిశుభ్రమైన పరిసరాలు, మంచి ఆరోగ్యం కోరుకోవడం, అందుకోసం వెచ్చించడం సహజం. ప్రొస్టేట్ క్యాన్సర్ వచ్చినా నయం చేయించుకొని బతికే అవకాశం ఉన్న దేశంలో క్యాన్సర్ వచ్చే అవకాశాన్ని ఏ కొంచెం పెంచే రసాయన పదార్థమైనా ఎక్కువ సంచలనం కలిగిస్తుంది. వెయ్యికి రెండొందల మంది అయిదేళ్ళ వయసు లోపలే చనిపోయే దేశంలో దాన్ని ఎవరూ పట్టించుకోరు.

ఇది సామ్రాజ్యవాదానికి మూడో ప్రపంచదేశాల ప్రజల పట్ల ఉన్న వైఖరి. ప్రస్తుతం పర్యావరణ కాలుష్యం వల్ల జరిగే నష్టాన్ని లెక్క కట్టే పద్ధతి ఇదేనంటే ఆశ్చర్యపోవాల్సిన పనిలేదు. దీనికొక ఉదాహరణ ఇస్తాను. నేషనల్ ఎన్విరాన్‌మెంటల్ ఇంజనీరింగ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ దేశంలో మూడు బొగ్గు ఆధారిత విద్యుత్ కేంద్రాలు, ఒక గ్యాస్ ఆధారిత విద్యుత్ కేంద్రం, ఒక జల ఆధారిత విద్యుత్ కేంద్రం పరిశోధనకు తీసుకొని వాటి వల్ల కలిగే పర్యావరణ ప్రభావాలు, సామాజిక ఆర్థిక ప్రభావాలు అధ్యయనం చేసింది. ఆ నివేదిక ప్రకారం బొగ్గు ఆధారిత విద్యుత్ కేంద్రాల వల్ల ప్రజల ఆరోగ్యానికైన ఖర్చు ఒక మెగావ్యాట్ విద్యుదుత్పత్తికి గాను 0.00013 నుండి 0.047 రూపాయలు. గ్యాస్ ఆధారిత విద్యుదుత్పత్తికి ఒక మెగావ్యాట్‌కు 0.001 రూపాయలు. వ్యవసాయ రంగానికి జరిగిన నష్టం– బొగ్గు ఆధారిత విద్యుదుత్పత్తికి ఒక మెగావ్యాట్‌కు 0.0002 నుండి 0.00084 రూపాయలు, గ్యాస్ ఆధారిత విద్యుదుత్పత్తికి ఒక మెగావ్యాట్‌కు 0.0007 రూపాయలు. మార్కెట్ విలువ ముందు అన్ని విలువలూ శూన్యమైపోతుంటే ఇక పర్యావరణ పరిరక్షణ గురించి మాట్లాడ్డం హాస్యాస్పదమవుతుంది.

నిజానికి నష్టపరిహారాన్ని లెక్కకట్టే విధానంలోనూ ఇలాంటి జిమ్మిక్కులే ఉంటాయి. అది సాధ్యమైనంత సులభంగా, చవగ్గా ప్రజలనుండి భూములు లాక్కోవాలనే సూత్రం తప్ప వేరొకటి కాదు. నెల్లూరు జిల్లా చిల్లకూరు మండలంలో సొన కాలువల ద్వారా విస్తారంగా సాగుచేసుకుంటున్న భూమి విలువను లెక్కకట్టాలంటే ఇసుక నేలలను సాగుయోగ్యం చేయటానికి సుదూర ప్రాంతాల నుండి మట్టిని తరలించడానికి, నీటి ఊటల్ని అనుసంధానించి కాలువలు తవ్వడానికి తరతరాల రైతులు పడిన శ్రమను లెక్కకట్టాలి. అన్నింటి కంటే అక్కడ అరుదైన నీటి ఊటలు ఏర్పడటానికి లక్షల సంవత్సరాలు భూగోళంలో జరిగిన రాపిడిని ఎవరు లెక్కకడతారు. ఎందుకంటే కోల్పోయిన ప్రకృతి సంపదలను మళ్ళీ స్థాపించడం సాధ్యం కాదు. భూగర్భంలో, సముద్ర గర్భంలో ఖనిజాలైనా, సహజవాయువైనా, విశాలమైన ప్రకృతిలో ఏ వనరులనయినా పెట్టుబడిదారులు ఏ అధికారంతో, ఎవరికి ఏ మూల్యం చెల్లించి సొంతం చేసుకుంటున్నారు? కేవలం వాళ్ళు ప్రకృతిలో కోట్లకొద్దీ జీవరాశుల్లో ఒకటైన మానవ జాతిలో అత్యల్ప సంఖ్యాకులు. ఈ అల్పసంఖ్యాకులు అధిక సంఖ్యాకులపైన పెత్తనం చేస్తు వాళ్ళ అభివృద్ధిని దేశాభివృద్ధి అనో, వెనకబడిన దేశాల అభివృద్ధి అనో మభ్యపెడుతూ ప్రజల్ని, ప్రకృతిని దోపిడి చేస్తున్నారు. అంతే కాదు, మితిమీరిన సరుకుల ఉత్పత్తితో పర్యావరణంలోకి విషపూరిత వ్యర్థాలను విడుదల చేసి ప్రకృతిని మరెంతగానో నాశనం చేస్తున్నారు. ఈ ప్రకృతి సంపద మొత్తం మానవ జాతికి, వారి భవిష్యత్ తరాలకు, సకల జీవరాశులకు సంబంధించినది. ఈ సత్యాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థ పక్కన పెడుతుంది. మొదట అది మనిషిని, ప్రకృతిని వేరు చేసి చూస్తుంది. మనిషి ప్రకృతిపై ఆధారపడటాన్ని గుర్తించ నిరాకరించి ప్రకృతిపై ఆధిపత్యం అనే వికృత సంస్కృతిని ప్రోత్సహిస్తుంది. అది ప్రకృతిని మనిషి సేవకోసం ఉన్న వస్తువుగా చూస్తుంది. అక్కడి నుండి ప్రకృతి వ్యక్తిగా ఆస్తిగా మారిపోతుంది. అది వ్యక్తిగత యాజమాన్యం కిందికి అంటే పెట్టుబడిదారీ యాజమాన్యం కిందికి వెళ్ళిపోతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రకృతి ఏమవుతుందో మార్క్స్ ఇలా చెప్పాడు. 'మొట్టమొదటి సారిగా మానవజాతి దృష్టిలో ప్రకృతి పూర్తిగా ఒక ఉపయోగ వస్తువుగా మారిపోతుంది. అది స్వయం ప్రతిపత్తిగల ఒక శక్తిగా గుర్తింపు కోల్పోతుంది. ప్రకృతి నియమాలపై పరిశోధనలు, సిద్ధాంతాల ఆవిష్కరణ కేవలం మానవావసరాలకు ప్రకృతిని వినియోగ వస్తువుగా, ఉత్పత్తి సాధనంగా పరిమితం చేసే ఒక కుయుక్తి అయిపోతుంది.'

ఎందుకంటే పెట్టుబడిదారీ వ్యవస్థ ఉనికి లాభాలను పోగుచేయడం మీద ఆధారపడి ఉంటుంది. డబ్బు రూపంలో పెట్టుబడి సరుకుగా మారి, సరుకు లాభంతో కూడిన డబ్బు (ఎక్కువ డబ్బు)గా మారాలి. ఇట్లా వచ్చిన ఎక్కువ డబ్బు మళ్ళీ సరుకుల్ని ఉత్పత్తి చేయాలి. ఇది మరింత డబ్బును సృష్టిస్తుంది. ఈ విధంగా పెట్టుబడి సంచయనం వల్ల సరుకుల ఉత్పత్తి విపరీతంగా పెరిగిపోతుంది. ఇక్కడ అసలు లక్ష్యం మానవావసరాల కోసం సరుకుల్ని ఉత్పత్తి చేయడం కాదు. లాభాలను పెంచుకుంటూ పోవడం. ఈ చక్రం ఆగిపోతే పెట్టుబడిదారీ వ్యవస్థ మనుగడలో ఉండదు. మితిమీరిన ఉత్పత్తి పర్యావరణం మీద వేసే ప్రభావాన్ని చర్చించడానికి పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలు ఇష్టపడరు. పర్యావరణ సమస్యలు ఎదురవుతున్నా వాటిని దాటవేయాలనే చూస్తారు.

కాని పర్యావరణ విధ్వంసం మానవ సమాజంపైన ప్రత్యక్ష ప్రభావం చూపుతుంది. అది తక్షణ సమస్యలతోపాటు దీర్ఘకాలిక సమస్యలను ఉత్పన్నం చేస్తుంది. కాబట్టి ప్రభుత్వ ప్రణాళికల్లో ఆరోగ్యకరమైన పరిసరాలు, తాగునీరు వంటివి తప్పనిసరిగా ఉంటాయి. దీంతో పాటు పరిశ్రమల వల్ల విడుదలయ్యే వ్యర్థాలను సురక్షితంగా వదిలించుకోవడం, వనరుల(అడవులు, కొండలు, నదులు వగైరా) పరిరక్షణ లక్ష్యాలుగా ప్రత్యేక బోర్డులు, చట్టాలు

పుస్తక పరిచయం (సీరియల్)

అమెరికాలో తత్వశాస్త్రం చరిత్ర బూర్జువాల ప్రాముఖ్యత గురించిన సమీక్ష

# గతితార్కిక భౌతిక వాదం

- ఐరా గొలోబిన్

స్వేచ్ఛానువాదం: కొడవటిగంటి రోహిణీ ప్రసాద్

తొలి రోజుల్లో అమెరికాకు వలసవచ్చి స్థిరపడినవారికి చుట్టూ ఉన్న పరిస్థితులను మార్చక తప్పలేదు; కొంతమంది తత్వవేత్తల్లాగా కేవలం వాటిని అర్థం చేసుకోవడంతో వారికి సరిపోలేదు. ఏదో చేసెయ్యాలనేదే తప్ప శాస్త్రీయ ప్రాపంచిక దృక్పథం లేకపోవడంతో వీరందరికీ సిద్ధాంతాలంటే ఏవగింపు ఉండేది. అయినప్పటికీ వీరందరూ తమ మాతృదేశాల్లో అమలులో ఉండిన రకరకాల తత్వధోరణులని కలగాపులగమైన పద్ధతిలో గుడ్డిగా ఆచరించడం మాత్రం చేసేవారు. తత్వశాస్త్రాలని గట్టిగా నమ్మినవారి సంఖ్య అప్పట్లో తక్కువే అయినప్పటికీ వలసదేశమైన అమెరికాలో తాత్విక వైఖరి శూన్యంగా మాత్రం ఉండేది కాదు.

వివిధ ప్రాంతాల్లోనూ, సమయాల్లోనూ ఆనాటి తత్వశాస్త్ర వైఖరిలో స్పష్టమైన వర్గవిభజన కనబడేది కాదుగాని, అమెరికా అనుభవాల్లో అది ద్యోతకం అవుతూ, అక్కడికి దిగుమతి అయిన తత్వధోరణుల్లో మార్పులు కలిగిస్తూనే ఉండేది. ఆనాటి "పల్లె వేదాంతి"కి తత్వశాస్త్రంలో సరైన శిక్షణ లేకపోయినప్పటికీ స్థానికంగా కొంత ప్రతిష్ఠ ఉండేది. ఇలాంటివారు ఆర్థిక, రాజకీయ విలువల గురించీ, లోకంలో మానవజాతికున్న ప్రపత్తి గురించీ అందరికీ తెలిసిన పద్ధతిలో స్థూల ప్రపంచజ్ఞానం కొంత ప్రదర్శించేవారు. న్యాయవాదులూ, వైద్యులూ, రాచప్రతినిధులూ మొదలైనవారికి మాత్రం శాస్త్రీయ తత్వశాస్త్రంతో పరిచయం ఉండేది. అయితే వీరి అభిప్రాయాలు అధిక సంఖ్యాకుల ఆర్థిక, రాజకీయ ధోరణులకు భిన్నంగా ఉండేవి. అలాంటివారిలో పెద్ద పెద్ద భూస్వాములూ, వ్యాపారస్తులూ, పరిశ్రమల యజమానులూ అందరూ ఉండేవారు. 1743లో బెంజమిన్ ఫ్రాంక్లిన్ స్థాపించిన అమెరికన్ తత్వ సమాజంలో (American Philosophical Society) వీరి అభిప్రాయాలను వ్యక్తం చేసే అధికార ప్రతినిధులుండేవారు.

ఇంగ్లండ్ నుంచి స్వాతంత్ర్యం పొందాక అమెరికాలో వర్గ విభజన పెరిగింది. అమెరికా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న డేవిడ్ బ్రౌన్ అనే సైనికుడికి 1798లో కారాగార శిక్షా, 400 డాలర్ల జరిమానా విధించారు. ఎందుకంటే అతనొక స్వాతంత్ర్య స్తూపం నిర్మించాడు. దాని మీద ఇలా రాసి ఉంది. "స్టాంప్ చట్టం, దేశద్రోహ చట్టం, పరదేశీ చట్టం రద్దు చెయ్యాలి; భూమి పన్ను చట్టం పోవాలి. అమెరికా శాంతి సమాజపు నియంతృత్వం కొనసాగరాదు; అధ్యక్షుడు పదవీ విరమణ చెయ్యాలి; ఉపాధ్యక్షుడికీ (థామస్ జెఫర్సన్), అల్ప సంఖ్యాక వర్గానికి జయం కలగాలి; పౌర ప్రభుత్వానికి నీతి మార్గమే ప్రాతిపదిక కావాలి!" షే (Shay) తిరుగుబాటుకూ (1786-87), విస్కీ తిరుగుబాటుకూ (1794) గల మూలకారణాలు కొన్ని అతని ఈ ప్రకటన వల్ల తెలుస్తాయి.

"అమెరికా సంయుక్త రాష్ట్రాల యాభై లక్షల మందిలో అయిదు వందల మందికే పబ్లిక్ ఆస్తివల్ల లాభాలన్నీ కలుగుతున్నాయి; తక్కిన

---

ఉంటాయి. అయితే సంకుచిత దృష్టి ఉండే పెట్టుబడికి, వీటికి పొసగదు. పెట్టుబడిదారుడికి పెట్టిన పెట్టుబడి ఎంత తొందరగా వెనక్కొస్తుంది, లాభాలను ఎంత ఎక్కువగా, త్వరత్వరగా పిండుకోవాలి అనే ధ్యాస తప్ప వేరే ఉండదు. పర్యావరణ పరిరక్షణకు అత్యంత అవసరమైనది దీర్ఘకాలిక దృష్టి. మరింత స్పష్టంగా చెప్పాలంటే భవిష్యత్ తరాల అవసరాలను దృష్టిలో పెట్టుకోవడం. అది పెట్టుబడిదారీ దురాశకు, స్టాక్ మార్కెట్ స్పెక్యులేషన్లకు పొసగని వ్యవహారం.

పర్యావరణ దృష్టితో కూడిన ప్రత్యామ్నాయ ఉత్పత్తి విధానం సాధ్యమవ్వాలంటే పెట్టుబడి సంకెళ్ళ నుండి సమాజాన్ని విడుదల చేయాలి. మానవ సమాజం ప్రకృతిలో భాగమనే స్పృహ సాధారణ జ్ఞానంలో భాగం కావాలంటే ప్రకృతి వనరులపై వ్యక్తిగత యాజమాన్యం రద్దు కావాలి. ఉత్పత్తి సమాజపరమైనప్పుడు లాభాలకోసం కాక మానవావసరాల కోసమే ప్రణాళికాబద్ధమైన ఉత్పత్తి ఉంటుంది. ప్రకృతితో స్నేహపూర్వక సంబంధంలో ఉత్పత్తి, శాస్త్ర పరిశోధనలు జరిగే అవకాశం ఉంది.

ప్రకృతి శాస్త్రవేత్తలు పర్యావరణ సంక్షోభం గురించి మాట్లాడినా, వాళ్ళ ఆందోళనలో నిజాయితీ ఉన్నా వాళ్ళు సమస్య మూలాల్ని అర్థం చేసుకోలేరు. కొత్త సాంకేతిక పరిజ్ఞానంతోనో, నియంత్రణతో కూడిన వనరుల వినియోగం వల్లో సమస్య తీవ్రతను తగ్గించాలని చూస్తారు. పర్యావరణ సంక్షోభాన్ని ఉత్పత్తితో ముడిపడిన సామాజిక వ్యవహారంగా కాకుండా సాంకేతిక అంశంగా చూడడంలో వాళ్ళ పరిమితి ఉంది. ఆ పరిమితి ఉన్నా సామ్రాజ్యవాద వనరుల దోపిడీ వాస్తవ రూపంలో కళ్ళకు కడుతున్నప్పుడు, ప్రజలకు ప్రకృతికి అసలు శత్రువులు పెట్టుబడిదార్లూ, వాళ్ళ దళారీలూ అన్న నిజం గుర్తించక తప్పని స్థితి వచ్చింది. కాబట్టి దేశ వ్యాప్తంగా సామ్రాజ్యవాద అభివృద్ధి పథకాలకు వ్యతిరేకంగా ఎక్కడికక్కడ ప్రజా సమూహాలు, ప్రకృతి ప్రేమికులు ఉద్యమ నిర్మాణాల్లోకి రావల్సిన తరుణం వచ్చింది.

మన వనరుల్ని సామ్రాజ్యవాద శక్తుల పరంకాకుండా కాపాడుకోవాలి. అంతే ముఖ్యంగా మానవ నివాసాలను, చెరువులు, నదులు, కొండలు, గుట్టలను దేశీయ దోపిడిదార్ల నుండి రక్షించుకోవాలి. పరిశుభ్రమైన గాలి, నీరు, ఆరోగ్యకరమైన పరిసరాలు ప్రజల కనీస హక్కు. వీటిని దోపిడి చేస్తున్న, ధ్వంసం చేస్తున్న శక్తులకు వ్యతిరేకంగా కింది స్థాయి నుండి ఉద్యమాన్ని నిర్మించాల్సి ఉంది. పర్యావరణ ఉద్యమం సామాజిక ఉద్యమాల నుండి విడదీయరానిది.

(అయిపోయింది)



సమాజపు శిథిలాల మీదనే వారికి పూట గడుస్తుంది.. సమాజంలోని శ్రామిక వర్గానికి, ఆ వర్గాన్ని ఎలాగైనా తుదముట్టించేందుకు రకరకాల పైశాచిక కుయుక్తులనుపయోగించే సోమరిపోతు వెధవలకీ మధ్య నిరంతరం పోరాటం జరుగుతూనే ఉంది; మనం ప్రజాప్రతినిధులుగా ఎన్నుకున్నవాళ్ళందరూ తమ బాధ్యతలు నిర్వర్తించకుండా, వెర్రి వెంగళప్పల్లాగా నోటికొచ్చినట్టు పేలుతూ, అదే ధోరణిలో కొనసాగడానికి ఎంతకైనా తెగిస్తున్నారు".[32]

1787లో రహస్యంగా జరిగిన రాజ్యాంగ సమావేశంలో పారిశ్రామికవేత్తలూ, బానిసల యజమానులూ, భూస్వాములూ, వ్యాపారస్తుల ఆర్థిక, రాజకీయ ఆధిపత్యాన్ని పటిష్ఠపరిచే ప్రయత్నం జరిగింది. వెళ్ళగొట్టబడిన బ్రిటిష్ పాలకుల స్కాట్లండ్ తరహా వాస్తవిక లోకజ్ఞానం దీనికొక తాత్విక ప్రతిరూపం వంటిది. 1780 లగాయతు కళాశాలల్లో తత్వశాస్త్ర అధ్యాపకులుగా వృత్తిపరమైన శిక్షణనిచ్చే ప్రయత్నాలు మొదలయ్యాయి. "ఎన్ని జాతులున్నప్పటికీ పద్దెనిమిదో శతాబ్దం ముగిసేనాటికి విదర్స్పూన్ అధ్యక్షుడుగా ఉన్నప్పుడు ప్రిన్స్టన్ విశ్వవిద్యాలయంలో స్కాట్లండ్ తరహా లోకజ్ఞాన తత్వశాస్త్రంలోనే శిక్షణ మొదలయింది. ఇది క్రమంగా పెరిగి తత్వశాస్త్రమంతా దాదాపుగా ఈ పద్ధతిలోనే కొనసాగింది... ఇందులో సున్నితమైన వాద ప్రతివాదాలుండేవి కావు; అన్నీ బలమైన మొరటు నమ్మకాలే. దీనివల్ల బైబిల్ బోధలను అక్షరాలా పాటించే వైఖరి సులువయ్యేది కనక స్వతంత్రభావాలు కలవారిని బాధించడం వీలయింది".[33]

చదువురాని సామాన్యులకూ, పెద్ద చదువులు చదివినవారికీ కూడా తత్వశాస్త్రంలో శిక్షణ పొందడం ఒక అనవసర భేషజంలాగా అనిపించేది. పెరుగుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థకు ఎదుగుదల అనేది తీవ్రమైన సమస్యగా ఉండేది కాని అసాధ్యమనిపించేది కాదు. సమస్యల్లో సైద్ధాంతికమైనవీ, వ్యవస్థాత్మకమైనవీ ఏవీ ఉండేవి కావు. 1830లలో ఫ్రెంచ్ రచయిత డి టోకేవిల్ 'అమెరికాలో ప్రజాస్వామ్యం' అనే తన ప్రసిద్ధ పరిశోధన మొదలుపెట్టి, అమెరికన్ల తాత్వికపద్ధతిని ప్రస్తావిస్తూ, "నాగరిక ప్రపంచంలో తత్వశాస్త్రాన్ని అమెరికాలాగా ఎవరూ నిర్లక్ష్యం చెయ్యరని నా అభిప్రాయం" అన్నాడు వారి తత్వశాస్త్ర పద్ధతిలోని ముఖ్య ధోరణిని గురించి చెపుతూ "మానసిక చర్యల విషయంలో ప్రతి అమెరికన్ తనకర్థమైనంత మేరకు ప్రధానంగా వ్యక్తిగత కృషిని గురించే ప్రస్తావిస్తాడు" అన్నాడు.[34]

1880ల గురించి చెపుతూ జాన్ డ్యూవీ "అప్పట్లో తత్వశాస్త్రాన్ని నేర్పేవారంతా మతాచార్యులే; దాదాపు అన్ని కళాశాలల్లోనూ తత్వశాస్త్ర బోధనలో మతానికీ, దైవశాస్త్రానికీ పనికొచ్చే విషయాలే ప్రధానంగా ఉండేవి... మానవ జీవితాలకు అవసరంగా భావించబడిన దైవ శాస్త్రంతోనూ, దాని నీతి నియమాలతోనూ తత్వశాస్త్ర శిక్షణ ఎంతగా ముడిపడి ఉండేదంటే వాటికి ఎదురు చెప్పడం ఊహించరానిదిగా ఉండేది".[35]

తత్వశాస్త్ర విద్య యావత్తూ ఎంతోకాలం పాటు దైవశాస్త్రపు ఊబిలో కూరుకుపోయి ఉండడాన్ని గురించి ఎం.ఆర్. కోహెన్ 1950లలో రాశాడు. "ప్రధానంగా పాలకవర్గాల ప్రయోజనాలకే దోహదపడే సామాజిక, ఆర్థిక వాతావరణం మేధో వికాసానికి అడ్డు తగిలింది. అందువల్లనే తత్వశాస్త్రమంతా రోజువారీ పనుల దినచర్యకూ, మతాల ఓదార్పు ప్రక్రియలకూ పరిమితమయిపోయింది. కారణాలేవైనప్పటికీ అమెరికాలోని తత్వశాస్త్రమంతా ఎక్కువగా క్రైస్తవమతపు సంజాయిషీ ధోరణిగానే మిగిలిపోయింది. రాజకీయంగా ప్రజాస్వామిక వ్యవస్థలో జీవిస్తున్నప్పటికీ మన మత తాత్వికులంతా ఉన్నత రాజవంశపు పరివారంలాగే ప్రవర్తించారు..".[36] ఈ వైఖరి వల్లనే "దేవుణ్ణి నమ్మనివారెవరూ తత్వవేత్తలు కారనే అభిప్రాయం అమెరికా అంతటా బలపడిపోయింది".[37]

బూర్జువాలూ, బానిస యజమానులతో కూడిన పాలకవర్గాల ప్రయోజనాల్లో ఇటువంటి పరలోక చింతన బాగా పాతుకుపోయింది. "ఆ కారణంగానే మన వలస వ్యవస్థా, విప్లవయుద్ధమూ, బానిస విధాన వ్యతిరేకతా, అంతర్యుద్ధమూ, ఎందరో వలస వచ్చి స్థిరపడడమూ, సరిహద్దు ప్రాంతాల్లో స్వేచ్ఛా జీవనమూ ఇవేవీ కూడా అమెరికాలోని తత్వశాస్త్ర శిక్షణపై తమ ప్రభావం చూపలేక పోయాయి..."[38] దైవశాస్త్రానిదే పైచెయ్యి కావడం, యథాస్థితి కొనసాగేందుకు ఏవో సాకులు చెపుతూ ఉండడం వగైరాలన్నీ చూస్తే బానిస విధానం పట్ల తటస్థ వైఖరి ఎందుకుందో అర్థమౌతుంది. ఎందుకంటే "జాన్ సి. కల్హూన్ రచనలు ఏవో కొన్నిటిలో తప్ప మన ప్రధాన తత్వగ్రంథాల్లో నీగ్రో జాతులు బానిసలుగా ఉండేవారన్న ప్రస్తావన ఎక్కడా కనబడదు. ప్రసిద్ధమైన స్వాతంత్ర్య ప్రకటనను రచించి, 1797 నుంచి 1815 దాకా అమెరికన్ తాత్విక సమాజానికి అధ్యక్షుడుగా పనిచేసిన జెఫర్సన్ వంటి ఉదారవాద ప్రజాస్వామిక తత్వవేత్తలు కూడా ఒకవంక బానిసలను ఉంచుకోవడం, అమ్మడం చేసేవారు; మరొకవంక మనుషులందరూ సమానులనీ, స్వేచ్ఛా జీవులనీ కూడా నమ్మేవారు...".[39] (అమెరికన్ తాత్విక సమాజాన్ని స్థాపించిన ఫ్రాంక్లిన్కూ, జెఫర్సన్కూ నల్లవారిని గురించి ఎటువంటి సాంస్కృతిక వైఖరి ఉండేదో స్టీవెన్ జే గోల్డ్ The Mismeasure of Man, అనే తన పుస్తకంలో వివరిస్తాడు, పుట 32).

బూర్జువా తత్వవైఖరికి దైవశాస్త్రం ఇలా అడ్డుతగలడంతో తత్వశాస్త్రానికి ఉండవలసిన విశ్వ దృక్పథానికీ, విజ్ఞానం ద్వారా తెలియవలసిన విషయాలకూ విఘాతం కలిగినట్టయింది. "లాక్ (Locke) తరువాత ఆంగ్ల అమెరికన్ తత్వశాస్త్రమంతా మనుషుల మనోవైజ్ఞానిక ప్రవృత్తి మీదా, వారి ధార్మిక విధుల మీదా మాత్రమే కేంద్రీకృతం అయింది".[40] (1688లో జరిగిన "దివ్య విప్లవం" తరవాత బ్రిటిష్ పెట్టుబడిదారీ విధానం అక్కడి భూస్వామ్య పద్ధతికీ స్వస్తి పలికింది) ఇటువంటి వైఖరి ప్రాచీన పాలకవర్గాల్లోనూ ఉండేది. "రోమన్, గ్రీక్ సంప్రదాయాల్లో మనుషుల వ్యవహారాలను అతిగా పట్టించుకోవడం వల్లనే తత్వశాస్త్రం సంకుచితమై, ఉదారతను కోల్పోయింది".[41]

ఇటీవలి దాకా తత్వశిక్షణలో దైవశాస్త్రానిది పెద్ద పాత్రే కాని, 1900 ప్రాంతాల నుంచీ కార్యసాధకవాదం (ప్రాగ్మాటిజం) దీనికన్నా బాగా ముందుకొచ్చింది; ప్రజలలో దీనికి ఆదరణ పెరిగింది కూడా చార్లెస్ పియర్స్ ప్రతిపాదించిన ఇటువంటి తత్వానికి విలియంజేమ్స్ మూలవిరాట్టు వంటివాడు.

విజ్ఞానంలో ప్రగతీ, కార్మికవర్గంలో పెరుగుతున్న అవగాహనలవల్ల సామాన్య ప్రజల మీద మతాల పట్టు సడలుతోందని విలియం జేమ్స్ గుర్తించాడు; యథాస్థితి కొనసాగడానికి కార్యసాధక

వాదమే మంచిదని అతను ప్రతిపాదించాడు. తన బూర్జువా సలహాదారులతో అతను "మీకు కావలసిన వ్యవస్థలో శాస్త్రీయ వాస్తవాలను ఆమోదించి, వాటిని గుర్తించే సదుపాయం ఉండాలి; అనుకూలతా, అనుగుణ్యతా కావాలి. అయితే మునుపటిలాగా మానవ విలువలపై విశ్వాసమూ, దానివల్ల ప్రయత్నంగా కలిగే సద్వోజనఫలితాలు కూడా అవసరమే; అవి మతపరమైనవి కావచ్చు, కాల్పనికమైనవి కావచ్చు" అన్నాడు.[42] అందువల్ల "కాస్త విచిత్రంగా అనిపిస్తుందిగాని, నా లెక్కన ఈ రెండు అవసరాలనూ తీర్చగలిగిన తత్వశాస్త్రం కార్యసాధకవాదమే. అది ఒకవంక హేతువాదాల్లాగా మతలక్షణాలను కోల్పోకుండా, మరొకవంక అనుభవవాదంలాగా వాస్తవాలకు అతి దగ్గరగానూ కూడా ఉండగలదు".[43] చివరగా జేమ్స్ "మీకు అవసరమయ్యే ఆలోచనా విధానానికి కార్యసాధకవాదమే దారి తీయగలదని నా ఆశ" అన్నాడు.[44]

ఇరవయ్యో శతాబ్ది ప్రారంభానికల్లా ఏ శషభిషలూ లేనటువంటి కార్యసాధకవాదమే అమెరికా పెట్టుబడిదారీ వద్ధతినీ సామ్రాజ్యవాదరంగంలో ప్రవేశపెట్టగలిగింది. (జేమ్స్ "మీరు, మీకు అవసరమయ్యే" అన్నదిందుకే) ఈ పరిణామమే అమెరికా ప్రపంచం మీద "గుత్తాధిపత్యాన్ని" కోరేందుకు ప్రేరకమయింది. రెండో ప్రపంచ యుద్ధం ముగిశాక, ఈ లక్ష్యాన్ని సాధించిన ఉన్నత దశలో, రాకఫెల్లర్ సంస్థ అమెరికా తత్వశాస్త్ర సమాజం (1945లో 870 మంది) సభ్యులను ఆహ్వానించింది. వారిని "సమకాలీన తత్వశాస్త్ర పరిస్థితిని పరిశీలించి, యుద్ధానంతర ప్రపంచంలో అది నిర్వహించగలిగిన పాత్ర ఎటువంటిదో అంచనా వెయ్య"మని ఆదేశించింది.[45] అయితే అప్పటి బూర్జువా తత్వవేత్తలంతా అర్థంలేని ముఠా తగాదాలతో సతమతమౌతూ ఉండిపోయారు; అందుచేత అమెరికా సామ్రాజ్యవాదపు ఆర్థిక, రాజకీయ, సైనిక ప్రణాళికలకు ప్రపంచవ్యాప్తంగా వత్తాసు పలుకుతూ, చురుకైన సైద్ధాంతిక మద్దతును ఇవ్వడం వారికి వీలుకాలేదు. రాకఫెల్లర్ సంస్థ అమెరికా తత్వశాస్త్ర సమాజం కోసం సమర్పించిన నివేదిక పరిచయ వాక్యాల్లో ఇలా ఉంది. "సమకాలీన పరిస్థితుల్లో తత్వశాస్త్రం అనేది ఒక పటిష్టమయిన సిద్ధాంతంగా రూపొంది, దాన్ని గురించి సాధికారికంగా చెప్పగలిగిన ప్రతినిధులెవరూ కనబడరు. ఎన్నో తత్వధోరణులూ, ఎందరో తత్వవేత్తలూ కనబడుతున్నప్పటికీ తమ ముందుకొచ్చిన కొన్ని సమస్యల విషయంలో మాత్రమే భిన్నాభిప్రాయాలు తలెత్తడం చూస్తాం".[46]

ఒకప్పుడు ఆత్మవిశ్వాసంతో ముందడుగేసిన పెట్టుబడిదారీ విధానంలో ఇప్పుడు కార్యసాధక వాదమే తత్వపరంగా ముఖ్యాంశమయింది. చైనా, కొరియా, వియత్నాంలలో అమెరికన్ సామ్రాజ్యవాదానికి ఎదురైన ఓటములూ, ఇతర సంక్షోభాలూ, క్షీణదశ లక్షణాలూ మొదలైన కారణాల వల్ల కార్యసాధకవాదం పట్ల బూర్జువాలకు ఆసక్తి పెరిగింది. ఇలాంటప్పుడు అస్తిత్వవాదమే ప్రయోజనకరంగా అనిపిస్తుంది. దానివల్ల కళ్ళెదుట కనబడుతున్నది మాత్రమే యదార్థమనీ, అస్తిత్వమనీ, అంతర్గతంగా ఉండే లోతైన భౌతిక వాస్తవాలన్నీ యదార్థమైనవి కావనీ అనిపిస్తుంది. అస్తిత్వవాదం పెట్టుబడిదారీ గుత్తాధిపత్యపు అసమంజసమైన క్షీణదశ లక్షణాలను సామాన్య ప్రజలకు వివరించి, అవన్నీ ఆమోదయోగ్యమేనని అనిపించగలదు. వీటన్నిటికీ బూర్జువా వర్గాలను తప్పుపట్టి లాభం లేదనీ, వీటికి అసలైన కారణాలు ప్రతి మనిషిలోనూ, ముఖ్యంగా సామాన్య జనుల్లో సహజంగా ఉండే పాపభూయిష్టమైన బూర్జువా ప్రేరణలేననీ అస్తిత్వవాదం నమ్మించగలదు. మానవుడి సహజలక్షణాలే అతన్ని పెట్టుబడిదారీ నరకప్రాయమైన ప్రపంచంలోకి నెడతాయనీ, ఇదంతా బైబిల్‌లో చెప్పిన పాపాల ఫలితం వంటిదేననీ అది నమ్మబలుకుతుంది. ఇహలోకంలో తప్పించుకునే మార్గమేమీ ఉండదని చెప్పే అస్తిత్వవాదం వల్ల పరలోకంలో నమ్మకం లేనివారందరూ మళ్ళీ దైవసిద్ధాంతానికే తిరిగిరాక తప్పదు. ఇది ఒకరకంగా దైవశాస్త్రానికి లౌకికమైన దొడ్డిదారి. (అస్తిత్వవాదం గురించిన వాస్తవాల వివరణ రెండో అధ్యాయంలోనూ, ఇతర అధ్యాయాల్లోనూ కనిపిస్తుంది. బైబిల్ వివరాలపై ఆధారపడే "విమోచనాత్మక దైవశాస్త్రం" అనే మరొక సమకాలీన సిద్ధాంత ధోరణి కూడా ఉంది. ఇది అణచివేతను ఎదిరించడాన్నీ, సోషలిజంతో ప్రమేయాన్నీ సమర్థిస్తుంది) దీని లెక్కన "అధోగతికి దారితీయగలిగినవి రెండే రెండున్నాయి ప్రపంచవ్యాప్తమైన కమ్యూనిజమూ, గతితార్కిక భౌతికవాదమూ".[47]

భాషాశాస్త్ర విశ్లేషణ అనబడే మరొకధోరణి పదాలను అపూర్వ పద్ధతిలో విశ్లేషిస్తుంది. తత్వశాస్త్రమని పేరుపొందిన ఈ పద్ధతి నిజానికి తత్వశాస్త్రానికి వ్యతిరేకం. దీనికి తత్వశాస్త్ర విద్యారంగంలో కొంత ఆదరణ ఉంది. దీన్ని అవలంబించే బూర్జువా అభిమానులకూ ఇది అంత ఉపయోగకరం కాకపోయినా క్షేమకరంగా అనిపిస్తుంది.

"1952లో డ్యూవీ చనిపోయాక... అమెరికన్ తత్వశాస్త్రంలో పెనుమార్పులు కలగసాగాయి; అపూర్వమైన తర్క పద్ధతుల వాడకమూ, చిన్నచిన్న విషయాలను కూడా భూతద్దం పెట్టి వెతకడమూ మొదలయింది... దైవశాస్త్రవేత్త జొనాథన్ ఎడ్వర్డ్స్ (1703-1758) నుంచి డ్యూవీదాకా సమకాలీన వ్యాఖ్యాతలుగా అమెరికన్ తత్వవేత్తలకు అంతులేని గౌరవం లభించింది; ఎందుకంటే వారికి మతం, రాజకీయాలు, విద్య మొదలైనవాటి పట్ల ఆసక్తి ఉండేది. కాని వారి తరువాత వచ్చినవారు మాత్రం విశాల ప్రపంచాన్ని అంతగా పట్టించుకోలేదు".[48]

**References:**


32. Quoted in Frank M. Anderson, "Enforcement of the Alien and Seditioin Laws", pp. 122, 124, in Annual Report of American Historical Association for 1912. See also, James Morton Smith, Freedom's Fetters, pp.257-274
33. Cohen, American Thought: A Critical Sketch, p.258
34. De Tocqueville, Democracy in America, Vol.2, pp.3-4
35. Dewey, On Experience, Nature and Freedom, pp.6, 20
36. Cohen, American Thought: A Critical Sketch, p.256
37. Kaufmann, Existentialism from Dostoevsky to Sartre, p.46
38. Choen, American Thought: A Critical Sketch, p.255
39. Ibid.
40. Ibid., pp.274-75
41. Ibid., p.275
42. James, Pragmatism, p.26
43. Ibid., p.33
44. Ibid., p.37, See also Wells, Pragmatism, pp.99-115
45. Siu, The Tao of Science, p.35
46. Ibid.
47. Rev. Dr. Ernest R. Palen, New York Times, Feb. 15, 1960
48. White, Science and Sentiment in America, pp.268, 301




సీరియల్

# సామాన్యుడు

- కె.వి. కూర్మనాథ్



ఆర్టిస్టు : రాయ్ లిక్టెన్‌స్టిన్

(2)

ఎక్కడ మొదలుపెట్టి ఎలా నడిపించాలి? ఏ రచయితకైనా ఎదురయ్యే ప్రశ్న ఇది. బండకు పట్టిన నాచునో లేకపోతే కదల్లేని చెట్టునో వర్ణించడం సులభం కావచ్చు. కానీ నదిని ఎట్లా పట్టుకుంటాం? పుట్టిన చోటునా? వాగుల్నీ వంకల్నీ కలుపుకుని వడినీ, వేడినీ సంపాదించుకుని అడ్డొచ్చిన వాటిని తోసుకు వెళ్ళే దశలోనా? లేకపోతే బలాన్నీ, వడుపునూ, చురుకుదనాన్నీనింపుకుని నిండుగా సాగుతున్నపుడా? ప్రయాణం ముగించుకుని సొగసుగా సముద్రంలో కలిసే చోటునా?

ఒక చోట పుట్టి, మరొక చోట కలిసేక మరి నది అంతమవుతుందా? మళ్ళీ మళ్ళీ పుడుతూ, మళ్ళీ అంతమవుతూ - నది ఒక సజీవ చిత్తరువు.

అందుకే నదిని అంచనా వెయ్యాలంటే నదిని చూసిన వాళ్ళని, నదిని దాటిన వాళ్ళని, నదిలో నిండారా స్నానం చేసిన వాళ్ళని అడగాలి. నదిలోని నీటిని దోసిళ్లతో తీసుకుని అనంతమైన దాహాన్ని తీర్చుకున్న వాళ్ళని అడగాలి. నది ఒరిపిడికి గురైన కఠిన శిలల్నీ, ఇసుక తిన్నెల్నీ ప్రశ్నించాలి. పండువెన్నెల్లో వెండితీగలా ప్రవహించే నది సొగసు మామిడి చెట్టు కొమ్మమీది కోకిల మాత్రమే చెప్పగలదు.

నది లోతు, నది చిన్నెలు సారంగుకీ, నది ప్రేమలోతులు చేప పిల్లలకీ తెలిసినంతగా మరొకరికి తెలిసే అవకాశం లేదు. కుపిత అయిన నది బలమూ, పట్టుదలా - వరదకు అడ్డొచ్చిన బండలకూ, ఇనప స్తంబాలకూ మాత్రమే అర్థమవుతుంది. నది తెచ్చే ఒండ్రు మట్టి సారం మొక్కకే తెలుస్తుంది.

అందుకే నదుల వలె అనంతంగా, నిరంతరాయంగా పుడుతూ, ప్రవహిస్తూ, దాహాల్ని తీరుస్తూ, జీవితాన్ని ఫలిస్తూ, అంతమవుతూ ఆరంభమవుతున్న వాళ్ళ గురించి తెలుసుకోవాలంటే వాళ్ళతో పనిచేసిన, కలిసి నడిచిన, వెలిగిన, కలిపి కలలు కన్న, కలిసి ఊపిర్లు తీసిన వాళ్ళతో మాట్లాడాలనిపించింది. ఒక్కళ్ళలో వాళ్లెలా ప్రతిఫలించారో తెలుసుకుంటే అంతిమంగా నదిని అంచనా వెయ్యవచ్చునిపించింది. దర్శించవచ్చునిపించింది. ఒక సోదరీ, ఒక మిత్రుడూ, ఒక సహచరుడు, మరొక సహాధ్యాయి, ఒక టీచరూ, ఒక దిక్కులేని తల్లీ, మరో డాక్టరూ, ఒక జర్నలిస్టూ, ఒక రైతూ, ఒకానొక విద్యార్థీ - ఇలా ఒక్కొక్కర్నీ పట్టుకుని కదిలిస్తే తెలుస్తుందనిపించింది - ఒక మనిషి విస్తృత రూపం గురించి.

*(గత సంచిక తరువాయి...)*

ఊరు ఊరంతా పుండు లాగా ఉంది. ప్రాణం పోయేలాగా సలుపుతూ ఉంది. ఊరులోని వాళ్ళందరూ ఏదో కోల్పోయిన వాళ్లలాగా, దిక్కులేని వాళ్లలాగా ఉన్నారు. ఒకరినొకరు పలకరించుకోవడం లేదు. పలకరించుకుంటే ఎక్కడ ఏడుపు కట్టలు తెచ్చుకుంటుందేమోనని.

దూరం ఎడబాటుని పెంచుతుందంటారు. కానీ అది నిజం కాదని నిరూపించేడతడు. అతడు ఊరు వదలి వెళ్ళి నలబై ఏళ్ళు అవుతోంది. వారానికో, నెలకో దేశంలో ఎక్కడెక్కడి నుంచో వార్తలు వచ్చేవి. అలా అన్నాడని, ఇలా చెప్పేడని. కానీ ఏ ఒకరో ఇద్దరో తప్ప ఈ నలబై ఏళ్లలో అతడిని చూసినవారూ లేరు. మాట్లాడిన వాళ్ళూ లేరు.

కానీ మళ్ళీ ఇన్నేళ్లకు ఇలా, శవంలాగా ఊరు తిరిగివచ్చాడు. వంటి నిండా గాయాలై నిర్జీవమై పడి ఉన్నాడు.

మనలోని వాడు, మన సాటి వాడు ప్రపంచానికి దారి చూపిన వాడైనాడని వాళ్ళకి గర్వంగా ఉంది. తనని తాను రద్దు చేసుకుని వెళ్ళిన వాడు, వెళ్ళినట్టే వచ్చాడు. లక్షల మంది ప్రజల గుండెల్లో ఉండే వచ్చాడు గాని ఊరు తల దించుకునే పని ఒక్కనాడూ చేయలేదు.

ఒక్క ఆ ఊరేమిటి. చుట్టుపక్కల గ్రామలన్నిటి పరిస్థితి అలాగే ఉంది. ఆ జిల్లాలో, పక్క జిల్లాల్లో, రాష్ట్రమంతటా, బయటి రాష్ట్రాల్లో లక్షలమంది ప్రజల హృదయాలు బాధతో కొట్టుకుంటున్నాయి. గొప్ప మెదళ్ళలో పుట్టి, శాస్త్రకారుల చేతుల్లో పదును అయిన పరికరాలను ఏరి తెచ్చి వాటిని మరింతగా సాన పెట్టి తమ బాగుకోసం ఎలా తిరిగాడో గుర్తుకు తెచ్చుకున్నారు.

అందుకే వాళ్ళు ఇంట్లో ఎవరో చనిపోయినట్టు బాధ పడుతున్నారు. అతడిని ఎరిగినవారు బాధపడుతున్నారంటే అర్థం చేసుకోవచ్చు, కానీ అతడు ఊరినుంచి వెళ్ళిపోయిన తర్వాత ఎపుడో పుట్టిన వాళ్ళు కూడా తోబుట్టువులెవరో పోయినట్టు దిగులుగా ఉన్నారు.

అతడి మరణంతో కలవరపడ్డ అందరికీ తెలుసు, అతడిని ఎవరు చంపారో, ఎందుకు చంపారో. అతడి మరణం ఎవరికి సంతోషమో వారికి తెలుసు. తమ బాధ ఎవరికి సంతోషం కలిగిస్తుందో వారికి తెలుసు. పంటి బిగువున, కోపాన్ని దుఃఖాన్ని ఆపుకుంటున్నారు. కోపామూ, దుఃఖమూ కాక కొందరిలో దిగులు, నిరాశకూడా కమ్ముకున్నాయి. ఇక తమకి దిక్కెవ్వరని కొందరు, ఈలోటు ఎవరు పూరిస్తారని కొందరు నిస్పృహలో పడ్డారు.

సరిగ్గా అందుకే బాలూ, నెట్టూ పట్టుకుని గ్రౌండ్ కి వెళ్తున్నహరన్నని చూసి కుపితులయ్యారు ఆ ఊరి వాళ్ళు. ఖననం జరిగిన రెండు రోజులకే, గాయాలతో చిల్లులు పడ్డ మృతదేహం కళ్ళముందు కదలాడుతుండగానే హరన్న ఆటకు బయలుదేరడం చూసి ఆగ్రహంతో రగిలిపోయారు.

ఊరు ఊరంతా బాధతో మూలుగుతూ ఉంటే, దిక్కుతోచక ఉంటే, సొంపనట్టు పడిఉంటే ఈయనేమిటీ, ఆడడానికి వెళుతున్నాడు? ఇది ఆడుకునే సమయమా? ఇతడికి బాధలేదా? పైగా వాళ్ళిద్దరూ దోస్తులుకదా? ఇద్దరూ ఒకేసారి ఉద్యమంలోకి వచ్చేరు కదా? అసలు ఇతడు కూడా లోపలికి పోవలిసిన వాడే కదా? జిల్లాలో ఎక్కడ ఏ సంఘటన జరిగినా ఇతడినే కదా పోలీసులు బాగా తోమి వదిలేది?

మరి ఎందుకు ఇప్పుడు ఇలా ప్రవర్తిస్తున్నాడు? భయపడ్డాడా? లేకపోతే, బండబారిపోయాడా? మతి చలించిందా?

బాధలో మునిగిపోయిన ఊరు ఇప్పుడు హరన్న వింత చేష్ట గురించి మాట్లాడుకోవడం మొదలుపెట్టారు. ఏ ఇద్దరు కలిసినా, ఏ నలుగురు మాట్లాడుకున్నా హరన్న గురించే మాట్లాడుకుంటున్నారు.

ఆటకి ఏముంది, నాలుగు రోజులు ఆగలేడా?

పిచ్చిగానీ పట్టిందా, అనీ,

నలుగురికి చెప్పాల్సిన వాడు, ఇలా చేస్తే ఎలా అనీ,

ఒదిలేశాడనీ,

దూరమయ్యాడనీ,

స్వార్థపరుడయ్యాడనీ,

తలో మాట అన్నారు. కొందరు ఏవో కథలు కల్పించారు. కొందరు బహిరంగంగానే తిట్టేరు.

నాక్కూడా అనిపించింది, ఏమిటీ మనిషి, సమయం సందర్భం చూసుకోడా? కనీసం ఒక్కడే ఆడలేడన్న కనీస జ్ఞానంలేదా అని అనిపించింది.

ఈ తిట్లు హరన్న చెవిలో పడుతున్నాయో లేదో తెలియదు. ఈ గుసగుసల గురించి అతడికెవరైనా చెప్పారో, లేదో తెలీదు. ఊరు ఊరంతా తనని వెలివేసినట్టు చూస్తున్నదని, తననొక శత్రువులాగా చూస్తున్నదని తెలుసో తెలీదో నాకు అర్థం కాలేదు. తెలీదనే అనుకోవాలి లేదా పట్టించుకోవడం లేదనీ, దులిపేసుకుంటున్నాడనీ అనుకోవాలి.

ఎందుకంటే అతడు ఆటకి బయలుదేరే సమయంలో గానీ, నడకలో గానీ ఏ మాత్రం తేడా కనిపించడం లేదు. పొద్దున్నే ఆరయేసరికి, మళ్ళీ సాయంత్రం నాలుగయేసరికి నెట్టూ, బాలూ పట్టుకుని చెరువు పక్కనే ఉన్న గ్రౌండ్‌కి బయలుదేరే వాడు, ఏదో ముఖ్యమైన పని ఉన్నవాడిలాగా. తప్పు చేస్తున్న వాడిలాగా కాదు, నిదానంగా – కానీ ధృఢంగా, అడుగులు వేసుకుంటూ వెళ్ళేవాడు.

గ్రౌండ్లో కూడా వేరెవ్వరూ రాకపోయినా సరే ఒక్కడే నెట్టు కట్టుకుని ప్రాక్టీస్ చేసేవాడు. పొద్దున్నయితే తొమ్మిది వరకూ, సాయంత్రమయితే చీకటి పడేవరకూ ఆడేవాడు. అస్తమిస్తున్న సూర్యుడివైపు చూసుకుంటూ కూచునేవాడు. ఆ సంధ్య వేళలో క్షణక్షణం ఆకాశంలో ప్రతిఫలిస్తున్న, మారుతున్న రకరకాల రంగుల సమ్మేళనాన్ని చూస్తూ కూచునేవాడు.

ఎన్ కౌంటర్ జరిగి ఏడు రోజులవుతోంది. టీవీల్లో, పేపర్లలో దానికి సంబంధించిన వార్తలు ఇంకా వస్తూనే ఉన్నాయి. ఎలా టార్చర్ చేశారో కథనాలు వస్తున్నాయి. ఆ రోజు నేనూ, రమేషూ, మోహనూ మరికొందరూ మాట్లాడుకుంటున్నాం – మీటింగ్ ఎక్కడ పెట్టాలని, ఎప్పుడు పెట్టాలని. చీకటి పడుతోంది. ఎప్పటిలాగానే గ్రౌండ్ నుంచి వెనక్కి వస్తున్నాడు హరన్న. వచ్చీరాని చలికాలపు గాలులు చల్లగా పరుచుకుంటున్నాయి.

"అదుగో వస్తున్నాడు హరన్న," అన్నాడు రమేశు.

నాలుగైదు రోజులు అపుకున్నాను గాని, ఆ రోజు ఎందుకో నా వల్ల కాలేదు.

మమ్మల్ని దాటుకు వెళ్తున్నాడు.

"నాలుగు రోజులు ఆగితే మీకమన్నా నష్టమా, ఆగాలేవా?" అని మోహను అడిగేడు.

రమేశు, నేనూ ఊహించలేదు మోహనలా అడుగుతాడని. రమేషైతే మోహను చెయ్యి వెనక్కి లాగేడు.

హరన్న ఆగేడు. చుట్టుపక్క వెళ్తున్నవాళ్లు కూడా ఆగేరు.

అడగడం అవసరంలేదని అనుకున్నవాళ్లూ, అవసరమని అనుకున్నవాళ్లూ కూడా ఆగేరు. ఈ ప్రశ్నకి ఏం సమాధానం చెప్తాడా అని.

హరన్న మా వైపు తిరిగేడు. కొండలవెనక, మబ్బుల్లో మునిగిపోతున్న సూర్యుడి వెలుతురు ఊరి మీద చివరిసారిగా పడుతోంది.

ఊరి సామూహిక కోపం పెల్లుబికిందో, లేకపోతే ఏయే రసానయాలు ప్రేరేపిస్తే వచ్చిన కోపమో తెలీదు కానీ, "ఇప్పుడు ఆడాలనిపిస్తుందా మీకు," అని తీక్షణంగా అడిగేడు మోహను మళ్ళీ.

ఇంకొంత మంది చేరేరు. ఎప్పటినుంచో వెదుకుతున్న నేరస్తుదు దొరికేడనో, ఎవరో ఒకరు కనీసం ఇప్పటికైనా అడిగారు సంతోషం, ఏం చెప్తాడోనాని జనం మూగారు.

చుట్టూ జనం చేరడం గమనించేడో లేదో తెలీదు కానీ, హరన్న మావైపు చూసేడు.

"టోర్నమెంటు ఉంది కదా వచ్చే నెల," అన్నాడు నిదానంగా.

ఏదో సమాచారం చెప్తునట్టో, లేకపోతే ఏదో మరిచిపోయిన సంగతి గుర్తుచేస్తున్నట్టో అన్నాడు గానీ, అపరాధభావం కొంచెంకూడా ధ్వనించలేదు అతడి గొంతులో.

సమాధానం విన్న వాళ్ళందరూ నోరు వెళ్లబెట్టారు.

"అయితే మాత్రం, ఇప్పుడా ప్రాక్టీస్? చచ్చిపోయినది ఎవరు? నీకేమీ కాదా? ఊరు ఊరంతా కొడుకో, తోబుట్టువో చచ్చిపోయినట్టు కళతప్పి ఉంటే ఆట కావల్సివచ్చిందా నీకు," అని అడిగాడు గుంపులోంచి ఎవరో.

ఈ ప్రశ్న తీవ్రతకు హరన్న బెదిరిపోలేదు. దోషిగా ప్రజా కోర్టులో నిల్చున్న వాడిలాగా కాకుండా, సంజాయిషీ ఇస్తున్నవాడిలాగా కాకుండా చాలా ప్రశాంతంగా తడబాటేమీ లేకుండా మొదలు పెట్టేడు.

"మీరన్నది నిజం. చేతికొచ్చిన కొడుకు పోయిన తల్లిలాగా ఊరు ఏడుస్తోంది. దిక్కులేకుండా పోయిందని, అండ పోయిందని గుండెలవిసేలాగా అందరూ ఏడుస్తున్నారని తెలుసు. ఒక్క మన ఊళ్లోనే కాదు, వేల ఊళ్లలో ఇదే పరిస్తితి ఇలాగే ఉంది," అన్నాడు.

అందరూ వింటున్నారు శ్రద్ధగా.

"మీకే కాదు, నాక్కూడా ఉంది. నిజానికి చెప్పాలంటే మీకంటే నాకే యెక్కువ ఉండాలి. ఉంది కూడా. గుండెల్ని మెలిపెడుతుంది గుర్తొచ్చిన ప్రతిసారీ. కానీ మరుక్షణం అతడి దగ్గర నేర్చుకున్న విషయాలు గుర్తొస్తాయి. నిజానికి నేను నేర్చుకున్న విషయాలు, విలువలు చాలా ఉన్నాయి," అని ఆగాడు.

"పెద్ద నాయకులు ముగ్గురు ఎంకౌంటర్ అయినవార్త తెలిసినపుడు తన దగ్గర నేనున్నాను. వార్త విని నా కాళ్ళ కింద భూమి కదిలిపోయింది. ఇంకేముంది అంతా అయిపోయిందని అనుకున్నాను. నాకే అల్లా అనిపిస్తే ఉద్యమ సహచరులు, మిత్రులు దొంగ దెబ్బకు దొరికిపోతే తనేమనుకుంటాడో, ఎలా తల్లడిల్లిపోతాడోనని భయపడ్డాను. కానీ, నా భయాలు ఎంత స్వల్పమైనవో రుజువు చేశాడు. రేడియో వార్త విన్న మరుక్షణం పిడికిలి బిగించి నేలమీద గుద్దేడు. గుద్ది, ప్రజలనీ, ప్రజలనాయకుల్నీ ఇంత ఘోరంగా చంపుతారా అన్నాడు. పళ్ళబిగువున బాధను దాచుకుని ఏం చెయ్యాలో ఆలోచించాడు. ఆ కోపం ఎన్నెన్ని తీర్ల బయటికి వచ్చిందో మీకు తెలుసు కదా," అని గుర్తు చేశాడు.

ఆ సమయంలో అతడితో కొన్ని రోజులున్నాను. వాళ్ళ గురించిన అనుబంధాన్ని, వాళ్ళ శక్తియుక్తుల గురించి అందరికీ చెప్పడే కానీ ఎక్కడా తొణకలేదు. మనసులో ఏమనుకున్నాడో తెలీదు కానీ బయటికి ఏ క్షణంలోనూ తెలియనివ్వలేదు. అప్పుడతడు నాకెలా కనిపించాదంటే, తుపాను సమయంలో పడవని బాగుచేసుకుని తర్వాతి వేటకి సిద్దమవుతున్న నావికుడి లాగా కనిపించాడు.

"బాధ పడాలి. తప్పకుండా పడాలి. మనిషన్న తర్వాత ఎవరికైనా బాధ కలుగుతుంది. కలగాలి. కానీ, ఆ బాధ కోపంగా మారాలి గానీ, నిష్క్రియకి తోవనియ్యకూడదు. బాధతో, బెంగతో, నిరాశతో ఉంటే మెదడే కాదు. హృదయమూ, శరీరమూ మొద్దుబారిపోతాయి. శరీరం మొద్దుబారిపోతే, హృదయం చిక్కి శల్యమైతే, మెదడు చచ్చుబడిపోతే యెవరికి నష్టం?" అని ప్రశ్నించాడు.

వెలుగూ చీకటి కలిసిపోతున్న ఆ సాయంకాలం అందరూ స్థాణువులై వింటున్నారు. వారి అంతరాత్మని ఎవరో నీలదీస్తున్నట్టు వింటున్నారు.

"బాధపడి, నిస్పృహలో కూరుకుపోయి నిర్వ్యాపకంలోకి పడితే ఎవరికి నష్టం? ఎవరికిలాభం? మన మెదల్లు మొద్దుబారిపోతే, హృదయాలు వట్టిపోతే, శరీరాలు తర్వాతి అవసరానికి సిద్ధంగా ఉండకపోతే ఉద్యమానికి కాదా నష్టం? ఎంత బాధ పడితే అతడికి నివాళి అర్పించినట్టు? ఎన్ని రోజులు నిస్త్రాణంగా ఉంటే ఆ లోటు పూరుతుంది? మీరు చెప్పండి పోనీ, ఎలా దుఃఖించాలో? అది కాదు, మనం చెయ్యల్సింది," అన్నాడు హరన్న దృఢంగా.

అసలు ఈ అవకాశం కోసమే ఎదురు చూస్తున్నవాడిలాగా చెపుతున్నాడు. మీరడగడమే బాగుందన్నట్టు చెప్తున్నాడు.

"అతడు మొదలుపెట్టిన పనులు చాలా ఉన్నాయి. మొదలు పెట్టాలనుకున్న పనులు చాలా ఉన్నాయి. మనం నష్టాన్ని పూరించాలి. అమరుల ఆశయాలను కొనసాగిస్తాం అని నినాదాలిస్తాం. అంటే అర్థం, వాళ్ళు తలపెట్టిన పనుల్ని భుజానికెత్తుకుంటామని. అతడు వెయ్యి చేతులతో చేసిన, వేలమంది చేతులతో చేయించిన పనులు కొనసాగడానికి మనమో చెయ్యి వెయ్యాలి. ఏదో ఒక పని చెయ్యడానికి సన్నద్ధంగా ఉండాలి. అందుకు ముందు శరీరాన్ని సిద్ధం చెయ్యాలి. వాడు మనకి దేన్ని కానివ్వకూడదని అనుకున్నాడో దాన్ని మనం కాపాడుకోవాలి. నావరకు నేను అనుకున్నాను అందుకే నేను బాలూ నెట్టూ పట్టుకున్నాను. సిద్ధమైన వాళ్ళు నాతో రావచ్చు," అని ముగించాడు.

అతడు మాట్లాడం ముగించేసరికి ఊరిని అమావాస్య చీకటి చుట్టుముట్టేసింది. ఎవరి ముఖాల్లో, హృదయాల్లో ఏయే భావనలు సుళ్ళుతిరుగుతున్నాయో ఎవరికీ కనిపించడం లేదు. హరన్న ముఖంలో ఎలాటి ఫీలింగ్స్ ఉన్నాయో కూడా తెలియడం లేదు.

ఇంకా లీలగా కాంతులీనుతున్న పశ్చిమ దిక్కునుంచి సూర్యుడు నిష్క్రమించాడు. సూర్యుడి వెలుతురును ఒదుపుగా తీసుకుని వీనస్ ఓ పెద్ద నక్షత్రంలాగా ఉదయించాడు ఆ ఊరి మీద.

* * *

(ఇంకా ఉంది)



కథ

# తీరం చేరని అల

- మహమూద్

రాత్రి పదిన్నర అవుతోంది.

వీటి స్టేషన్ మూడో నెంబర్ ప్లాట్‌ఫాం మీదికి చెన్నై వెళ్ళవలసిన మెయిల్ రావడానికి ఇంకా పదిహేను నిమిషాల సమయం ఉంది.

ముంబై నుంచి యర్రగుంట్లకు వెళ్ళవలసిన సర్తాజ్ సిమెంటు బెంచి మీద కూర్చొని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

ఆ స్టేషన్లో ఉన్న సంచలనం కంటే అతడి మనసులో ఎక్కువ సంచలనం ఉంది.

ఇంట్లో ఏమని చెప్పాలి? అప్పటికి వందసార్లు ఆ ప్రశ్న వేసుకున్నాడు. సరైన సమాధానం దొరకడం లేదు. ఎన్ని బాధ్యతలున్నాయి తనకు! ముంబాయిలో జరిగింది చెబితే సగం ప్రాణంతో మిగిలి ఉన్న తండ్రి ఊపిరి ఆగిపోదా! అమ్మను ఎలా సముదాయించాలి? అసలు చెప్పాలా వద్దా? చెప్పకపోతే ఎలాగోలా తెలుస్తుంది గదా! అల్లకల్లోలంగా ఉందతని మెదడు.

రైలు కూత వినిపించింది.

కచ్చితంగా ఒకరోజు ముందు ఇదే స్టేషన్లో దిగాడు సర్తాజ్.

* * *

ఉదయం నాలుగున్నరయింది.

చెన్నై నుండి యర్రగుంట్ల మీదుగా ఇరవై ఆరు గంటలు ప్రయాణించి వీటి స్టేషన్లో ఆగింది మెయిల్. దానికదే చివరి మజిలీ. అందులో ప్రయాణించి ఆ స్టేషన్లో దిగిన సర్తాజ్ మజిలీ మాత్రం సౌదీ అరేబియా.

చలికాలంలో ముంబై నగరం చలికి వణికిపోతూందేమో అనుకున్నాడు. చలి మామూలుగానే వుంది.

చాలా పెద్ద స్టేషన్. అక్కడ దిగడం అతనికది మొదటిసారి. గోలగోలగా ఉన్న ఆ రద్దీని చూసి ఒకింత గగుర్పాటుకు గురయ్యాడు.

బంగారు గాజుల కటింగులో నైపుణ్యం ఉన్న సర్తాజ్‌కు ప్రయాణించడం అవసరమున్న వ్యాపకం కాదు. బంధుమిత్రులంతా ప్రొద్దుటూరు చుట్టుపక్కలే ఉండడం, పెద్ద ఆర్థిక స్తోమత లేకపోవడం దానికి కారణం. పెద్ద పెద్ద నగరాలను సినిమాల్లో, టీవీల్లో చూడ్డం తప్ప ప్రత్యక్షానుభవంలోనికి రావడం ఇదే మొదలు.

తన వెంట తెచ్చుకున్న ఒకే ఒక్క బ్యాగును భుజానికి తగిలించుకుని చేతిలో ఉన్న ఖాళీ నీళ్ళ సీసాను తొడకేసి కొట్టుకుంటూ స్టేషన్ భౌతిక స్వరూపాన్ని కళ్ళతోనే ఆస్వాదిస్తూ బయటికొచ్చాడతను.

నిజానికి అయిదారేళ్ళ క్రితం వరకు సౌదీ అరేబియా పోవాలనుకున్న వాళ్ళు తప్పకుండా ముంబై రావల్సిందే. ఇప్పుడా పరిస్థితి లేదు. నేరుగా హైదరాబాదు నుంచే వెళ్ళిపోవచ్చు. అయితే తమకు వీసా ఇప్పించిన ఏజెంటు ముంబైవాడు కావడం, తన చిన్నాయన మిత్రుడు కావడం, అన్ని వ్యవహారాలు తనే చూసుకుంటానని నమ్మబలకడం సర్తాజ్‌ను ముంబై తీసుకొచ్చాయి.

ఇరవై రెండేళ్ళ లేత మెదడులో చాలా విషయాలే తిరుగుతున్నాయి. మొదట ఏజెంటు అడ్రసు కనుక్కోవాలి. మెడికల్ టెస్టులు పూర్తయ్యేవరకు బస తనే ఏర్పాటు చేస్తానని ఏజెంటు సులేమాన్ చెప్పాడు. కాబట్టి దానికి బాధ లేదు. మెడికల్ పూర్తయ్యి విమానం టికెట్టు కన్‌ఫం కావడానికి కనీసం పది పదిహేను రోజులు పడుతుంది. ఈ లోగా ప్రొద్దుటూరు పోయి రావచ్చు.

మెడికల్ ఈ రోజు పూర్తయితే బావుండు. హాయిగా రాత్రికే టపా కట్టెయ్యొచ్చు. ఇంకొన్ని రోజులుండాల్సి వస్తే మాత్రం డబ్బు ఖర్చు తప్పదు. ముంబాయి నగరానికి తగ్గట్టు ఖర్చు చేసే స్తోమత తనకెక్కడిది? ఎక్కువ రోజులు ఉండవలసి వస్తే సులేమాన్ దగ్గర అప్పు అడగక తప్పదు.

సులేమాన్ అరవై ఏళ్ళ ముసలోడైనా డబ్బు యావ చావలేదు. ఉత్తి పుణ్యానికే తనకు రూకలు రాలుస్తాడా? కచ్చితంగా వడ్డీ గుంజగల సమర్థుడు. వీసా ఏర్పాటు చేసినందుకు ఇప్పటికే వీరగుంజుడు గుంజాడు. నమ్మకంగా తనను మజిలీ చేరిస్తే అదే పదివేలు. అందుకే తన కల నెరవేరి సమస్యలు తీరితే గలఫ్ అర్పించుకుంటునని మొన్న గురువారం దర్గాలో మొక్కుకుని వచ్చాడు సర్తాజ్.

ఇంకా తెల్లారలేదు. అందుకేనేమో ఫ్లోరసెంటు వీధి దీపాలతో, పెద్ద పెద్ద హోర్డింగులతో, ఆ వేళప్పుడే ప్రారంభమైన నగర పరుగుతో కళకళలాడుతోంది ముంబై. స్టేషన్ బయట కుడివైపుకు తిరిగి ఒకదాని వెనక ఒకటిగా నిలబడి ఉన్న టాక్సీల వైపు నడిచాడు. 'మై నేమీజ్ ఖాన్' అనే సినిమా టైటిల్ రాసుకుని పైభాగం పసుపు, కింది భాగం నలుపు, చుట్టూ చమ్కీలతో పేరుమోసిన డిజైనర్ తయారుచేసిన బట్టలేసుకున్న సినిమా హీరోయిన్‌లా మెరిసిపోతున్న టాక్సీ వైపు నడిచాడు. అంత వరకు ఏ సవారీ వచ్చినట్టు లేదు. డ్రైవరు గురక పెట్టి నిద్రపోతున్నాడు.

నిద్రపోతున్న అతన్ని తట్టి లేపుతూ, "ఏ భాయ్! ఆతీంక్యా?" అన్నాడు.

బాగా నిద్రపోతున్నాడేమో ఒకటి రెండు సార్లు కదిపితేగాని నిద్ర లేవలేదతను.

"కాcజానా హైc?"

"భేండీ బజార్. రాయల్ హోటల్" చెప్పాడు సర్తాజ్.

"సౌ రూపాయ్ హోతా!"

"పచ్చాస్ దేతూc!"

"చల్ ఫూటె!"

ఆలోచనలో పడ్డాడు సర్తాజ్. వెంట తెచ్చుకుంది మూడు వేలు. రైల్లోనే రెండొందల దాకా ఖర్చైపోయాయి. ఇక మిగిలిన దాంతో కాలం గడపాలి. ఎప్పుడు ఎక్కడ ఎలాంటి ఖర్చు వస్తుందో తెలీదు.

టాక్సీకి నూర్రూపాయలు!

నిట్టూర్చాడు సర్తాజ్.

సర్తాజ్ సంశయాన్ని అర్థం చేసుకున్న వాడిలా, "చలో అస్సీ రుపయ్ దేదో! ఇస్ వఖ్త్ ఇస్‌సే కమ్‌మే కోయీ నై ఆతా!" అన్నాడు డ్రైవరు.

ఇరవై రూపాయలు మిగిలాయి చాల్లే అనుకుని టాక్సీ ఎక్కాడు సర్తాజ్. అతన్ని చూసి మీటరు కిసుక్కున నవ్వింది.

నిర్మలమైన నీలాకాశం మీద చందమామ. ఆ పక్క తారకలు మెరుస్తున్నాయి. వెడల్పాటి రహదారిలో సర్రున దూసుకెళ్తున్న టాక్సీలోంచి

ఆ దృశ్యాలు ముచ్చట గొలుపుతున్నాయి. ముంబాయిలోని ఆకాశ హర్మ్యాలు, అధునాతనమైన దుకాణాలు, వాటి రూపు రేఖలను అబ్బురంగా చూస్తున్నాడు సర్తాజ్.

చలికాలం గాలి చెక్కిళ్ళపై గిలిగింతలు పెడుతుంటే చేతులు కట్టుకుని కూర్చున్నాడు సర్తాజ్.

ఆ ప్రయాణం అయిదు నిమిషాలు సాగింది. టాక్సీ భేండీ బజారులోని ఒక సందు దగ్గర ఆగింది.

సందులోపలికి చెయ్యి చాపి, "ఓ దేఖో! ఓ హై రాయల్ హోటల్," అని చూపించాడు టాక్సీ డ్రైవర్.

మెయిన్ రోడ్డుకు ఆనుకొని ఉన్న అనేక సందుల్లో ఒక సందు అది. డబ్బులిచ్చేసి లోపలికి నడిచాడు సర్తాజ్. వీటి స్టేషన్ పరిధిలోలా అధునాతనంగా లేదు భేండీ బజార్. చాలా పాత నిర్మాణాలు, ఇంకా చిన్న సందులు కనబడుతున్నాయి. దుకాణాల మెట్ల మీద ముతక బట్టలు కప్పుకుని చాలా మంది నిద్రపోతున్నారు.

ఒక చౌరస్తాలో యూ షేపులో రెండు వీధులను కలుపుతూ నిలబడి ఉంది రాయల్ హోటల్. హిందీ, ఇంగ్లిషు, మరాఠీ భాషల్లో పేరు రాసుంది. ఆ హోటల్ బాగా ముసలిదై పోయిందని దాని వాలకం చూసి ఇట్టే పసిగట్టవచ్చు.

ఆ హోటల్ అప్పుడే తెరిచినట్టున్నారు. ఒకరిద్దరు టీ తాగుతున్నారు. లోపలికి వెళ్ళి ఏజెంటు సులేమాన్ గురించి వాకబు చేశాడు.

కౌంటరు దగ్గర కూర్చున్న వ్యక్తి, "వహాఁ థోడీ దేర్ బైఠో, ఆజాతా!" అన్నాడు.

బయట వెడల్పాటి వీధి అరుగుంది. చేతిలో వాచీ చూసుకుంటూ వచ్చి అరుగు మీద కూర్చున్నాడు.

అయిదున్నర కావస్తోంది. దగ్గర్లోనే మసీదు ఉన్నట్టుంది. అజాఁ వినిపిస్తోంది. ఇక్కడ వేచి ఉండడం కంటే నమాజు చదువుకుని వస్తే పోలా అనుకుని హోటల్‌లో మసీదుకు దారెటో కనుక్కున్నాడు. ఆ హోటలు వెనకవైపే ఉంది మసీదు. చాలా చిన్న మసీదు. రెండు రకాత్‌ల నమాజు చదివి, దువా వేసి రావడానికి ఎక్కువ సేపు పట్టలేదు. కొద్దిసేపు ఆ వీధుల్లో తచ్చాడాడు.

ముస్లింలు అధికంగా ఉన్న ఇలాకాలా ఉంది. దుకాణాల పేర్లను బట్టి ఆ నిర్ధారణకు వచ్చాడు సర్తాజ్. ఓ గంటదాకా అలా తిరిగి యథాస్థానానికి వచ్చాడు సర్తాజ్.

ఇంకో గంట తర్వాతగాని రాలేదు సులేమాన్.

సర్తాజ్‌ను చూపులారా పరికించి, "నువ్వేనా ప్రొద్దుటూరు నుంచి వచ్చింది? వచ్చే ముందు ఫోనెందుకు చేయలా?" అంటూ ప్రశ్నించాడు.

"చేశాను. మీ ఫోను స్విచాఫ్ అనొచ్చింది."

అవునా అన్నట్టు తలూపి తన పనిలో మునిగిపోయాడు సులేమాన్.

సన్నగా పొట్టిగా ఉన్న సులేమాన్‌ది ప్రొద్దుటూరు తాలూకాయే. అతను సర్తాజ్ చిన్నాయన బాల్య మిత్రుడు కూడా. చిన్నతనంలో దొంగతనం కేసులో ఇరుక్కుని బొంబాయి పారిపోయి వచ్చాడని, ఇక్కడే చిన్న వ్యాపారం చేసుకుంటూ ప్రవృత్తిగా ఏజెంటు అవతారం ఎత్తాడని, అందులో బాగా వెనకేసుకున్నాడని ప్రొద్దుటూరువారి ఉవాచ. ప్రొద్దుటూరు నుంచి చాలా మందిని సౌదీకి సాగనంపాడనే చరిత్ర అతడిది.

సర్తాజ్ చూస్తుండగానే పది నిమిషాల్లోనే ఆ వీధి అరుగు మీద ఒక్క మనిషి సహాయం లేకుండా ఓ దుకాణం నిలబెట్టేశాడు సులేమాన్. బ్రెడ్డు, వెన్న, జామ్ వంటి తినుబండరాలతో నిండిపోయింది దుకాణం. అప్పటిదాకా దుకాణం ఆ అరుగు కింది భాగంలో ఉండేది. ముంబాయిలో స్థలాన్నెంత తెలివిగా వాడుకుంటారో అర్థమైంది సర్తాజ్‌కు.

'అమ్మ ముసలోడా!' అనుకున్నాడు సర్తాజ్.

ఇలా బతక నేర్చే విద్య బహుకొద్దిమందికే సాధ్యమవుతుందెందుకో!

తన బోటివాళ్ళ బతుకెప్పుడూ బొటాబొటిగానే సాగిపోవాలా? బాగా బతకాలనుకుంటే దేశాలు విడిచి వలస పక్షులు కావాలా?

తనని దుకాణంలో మూల కూర్చోబెట్టి వ్యాపారంలో మునిగి పోయాడు సులేమాన్.

కాలానికి ఎవరో కళ్ళాలు వేసి బంధించినట్టు మెల్లగా కదులుతోంది. వ్యాపారం చేయడంలో సులేమాన్ చూపుతున్న చొరవ, వేగం చూసి గాజుల కటింగులో బాగా చెయ్యి తిరిగిన సర్తాజ్ ఆశ్చర్యపోయాడు.

తొమ్మిదవుతుందనగా జనం రావడం కాస్త తగ్గింది.

అప్పుడడిగాడు సులేమాన్, "టిఫిన్ చేశావా?" అని.

ఇంకా లేదన్నట్టు తలూపాడు సర్తాజ్.

హోటల్ యజమానికి వినపడేలా, "రఫీక్ భాయ్! ఇస్ లడ్కేకో పావ్ ఔర్ ఆమ్లెట్ దేనా!" అరిచాడు సులేమాన్.

తన ఊళ్ళో సుబ్రమణ్యం దోశలకు అలవాటు పడిన సర్తాజ్ నోటికి ఆ టిఫిన్ ఏమాత్రం రుచించలేదు. బయటికొచ్చి తన సెకండ్ హాండు సెల్‌ఫోన్‌తో క్షేమంగా చేరినట్టు ఇంటికి ఫోన్ చేసి చెప్పాడు.

అప్పటికి గల్లా పెట్టను వదిలి పక్కకొచ్చి నిలబడి ఒకతనితో మాట్లాడుతున్నాడు సులేమాన్. సర్తాజ్‌ను దగ్గరికి పిలిచి తను అంతదాకా మాట్లాడుతున్న వ్యక్తితో పరిచయం చేశాడు. వాళ్ళిద్దరూ ఏం చేయాలో వివరించాడు. కాసేపటి తర్వాత ముందుకు దారి తీస్తూ "మీరే సాత్ ఆవో" అన్నాడు ఆ సులేమాన్ అసిస్టెంటు.

రాయల్ హోటల్‌కు అభిముఖంగా రెండొందల అడుగులు నడిచి ఒక పురాతనమైన భవనంలో మూడో అంతస్తులో ఒక గదిలో వదిలిపెట్టి వెళ్ళిపోయాడా వ్యక్తి. పని అయ్యేంతవరకు ఈ గదిలో ఉండాలన్నమాట! అనుకున్నాడు సర్తాజ్ ఆ గదిని కలయచూస్తూ.

ఎనిమిదడుగుల పొడవు, అంతే వెడల్పు ఉంటుందా గది. కిందపరచి ఉన్న ప్లాస్టిక్ చాపల మీద నలుగురు పడుకుని ఉన్నారు. గూళ్ళలో ఆయా వ్యక్తుల బ్యాగులు పెట్టి ఉన్నాయి. గదికి రెండు వారలా తీగలకు ఆయా వ్యక్తుల బట్టలు ఆరవేసి ఉన్నాయి. తనలాంటి పక్షులేమో! అనుకున్నాడు సర్తాజ్. తన బ్యాగు పెట్టడానికి స్థలం కనపడలేదు సర్తాజ్‌కు.

నలుగురు పడుకోగా మిగిలి ఉన్న స్థలంలో కూలబడ్డాడు సర్తాజ్. ఆ గదిలో నిశ్శబ్దాన్ని కీచుకీచుమంటూ తాతల కాలం నాటి ఫ్యాన్ చెడగొడుతోంది. దానికి వంతపాడుతున్నట్టు బోర్లా పడుకున్న వ్యక్తి గురక దిమ్మ తిరిగేలా ఉంది.

బాత్‌రూం పోవడానికి లేచాడు.

తలుపు తెరుస్తూనే గుప్పున కొట్టింది మురుగువాసన. ఆ పాయిఖానాను కడిగి ఏళ్ళు గడిచినట్టుంది. ముక్కు మూసుకుని కాలకృత్యాలు కానిచ్చి బయటపడ్డాడు.

ప్రయాణం చేసిన అలుపు కొంత, ముంబాయి దిగినప్పట్నుంచి ఇంతవరకు సులేమాన్ కోసం పడిగాపులు కాసిన అలుపు కొంత, నిద్రపోవడానికి ఉసిగొలిపినట్టయ్యింది.

ఇక ఆగలేక బ్యాగు తలకింద పెట్టుకుని నడుము వాల్చాడు.

పడుకోవడానికైతే పడుకున్నాడుగాని నిద్రపట్టలేదు.

అలవాటు లేని ప్రదేశం కావడం వల్లనో, చిన్నదైనా నిద్ర సుఖంగా రావడానికి అవసరమైన ఆత్మీయతను పంచే తన ఇల్లు కాకపోవడం వల్లనో, తన సౌదీ ప్రయాణానికి సంబంధించిన గుబులొకటి మనసులో కలవరపెడుతున్నందువల్లో అతనికి నిద్ర పట్టడం లేదు. మెల్లగా కదులుతున్న కాలంతో పోటీపడి నడుస్తున్న తాబేలులా అతనూ కదులుతున్నాడు. చాప వీపుకు ఇనప ముళ్ళను గుచ్చుతున్నట్టుంది.

ఇంటి మీద ధ్యాస మళ్ళిందతనికి. జీవితంలో ఇలాంటి స్థితి ఒకటొస్తుందని ఊహించలేదతను. తండ్రి అనారోగ్యంతో మొదలైంది తన కష్టాల ప్రస్థానం. వెండి ఆభరణాల తయారీదారుడైన తన తండ్రికి పక్షవాతం సోకడంతో ఏకైక మగ సంతానమైన తన మీద ఇంటి బాధ్యత పడక తప్పింది కాదు. పెళ్ళికెదిగిన చెల్లెలు కళ్ళెదుట తిరుగుతుంటే నిమ్మళంగా ఉండగలగడం ఎవరికైనా ఎలా సాధ్యం? తను కూడా తండ్రి వద్ద శిష్యరికం చేసి ఉంటే బావుండేది. ఇద్దరం ఒకే పనిలో ఎందుకని బంగారు పని నేర్చుకోవడానికి పూనుకున్నాడు. అలసత్వం వల్ల అందులో ప్రావీణ్యం సంపాదించలేకపోయాడు. ఇంతలో ఈ ఉపద్రవం వచ్చిపడింది. ఆ పని మధ్యలో వదిలేసి సులభంగా నేర్చుకోగలిగే గాజుల కటింగ్ పనిలో కుదిరిపోయాడు. ఆ పని నేర్చుకొని చాలా మంది తన ముందరే సౌదీకి వెళ్ళిపోయారు. ప్రొద్దుటూరులో తన తండ్రికి మంచి వైద్యం చేయించే శక్తి లేదు. కాబట్టే తన కలల సాకారానికి సౌదీ అరేబియాను మజిలీగా ఎంచుకున్నాడు.

పదకొండు అవుతుందనగా గదిలో ఉన్న సహవాసులు ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. ఏ ఒక్కరూ మాటవరసకైనా సర్తాజ్‌ను పలకరించిన పాపాన పోలేదు. తను చొరవ తీసుకుని పలకరించే మానసిక స్థితిలో సర్తాజ్ లేడు. తలుపుకు గొళ్ళెం కూడా భద్రంగా లేని గదిలో కాలం వెళ్ళదీస్తున్న సర్తాజ్ ఒంటరితనాన్ని పటాపంచలు చేస్తూ తన ప్రియురాలి ఊహ అతిథిలా వచ్చింది.

రేష్మా!

రేషంకీ గుడియా!

లక్షల గులాబీల మకరందాన్ని తీసి ఒలకబోసినట్టుండే గులాబరి!

పర్సు తెరిచి రెండో అరలో దాచుకున్న ఆమె ఫోటోను బయటికి తీశాడు. ఆ చిత్రం కళ్ళలో కళ్ళుపెట్టి చూస్తుంటే ఆమెను ప్రత్యక్షంగా చూసినట్టే ఉంది. అన్నీ సవ్యంగా ఉండి ఉంటే ఈ ఏడో వచ్చే ఏడో లేవదీసుకుని పోయైనాసరే నిఖా చేసుకునేవాడు. ఇప్పుడా పరిస్థితి లేదు.

ఆమెకు ఇంకొన్నాళ్ళ నిరీక్షణ తప్పదు.

అతనప్పటికప్పుడే అల్లాడు ఓ షాయరీని.

**'సదియోంకీ నహీఁ చంద్ దినోంకీ బాత్ హైఁ**

**ఇంతెజార్ తుం కర్నా ఖుదా హమారే సాత్ హైఁ!'**

తను ఊహా జగత్తు నుండి బయటపడేలా తలుపు తీసిన అలికిడి అయ్యింది.

సులేమాన్ అసిస్టెంట్, "తుంకో సాబ్ బులాతా హై," అని గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు.

గబ గబా బట్టలు మార్చుకున్నాడు సర్తాజ్. స్నానం చేయాలనే కోరిక ఆ పాయిఖానా చూసినప్పుడే చచ్చిపోయింది సర్తాజ్‌కు. పదే పది ఘడియల్లో సులేమాన్ దుకాణం వద్ద వాలాడు.

"రేపుదయం పది గంటలకు డాక్టర్ అపాయింట్‌మెంటు దొరికిందని . సెలవిచ్చాడు సులేమాన్.

ఈసురోమన్నాడు సర్తాజ్.

ఇక్కడ ఇంకో రోజు ఆగాలా!

ఇంకో జన్మ ఆగాలా అన్నట్టుంది అతని వాలకం. ఈ రోజంతా ఏం చేయాలో ఏంటో!

"నువ్వెళ్ళి రెస్టు తీసుకో" అన్నాడు సులేమాన్.

మనసులో, 'ఆ గదిలోనా!' అనుకున్నాడు సర్తాజ్.

తలనొప్పిగా ఉంది. మాత్ర కొనడానికి మందుల అంగడి చూసుకున్నాడు. తలనొప్పికో మాత్ర ఇవ్వమనడిగితే మొత్తం స్ట్రిప్పు కొనాల్సిందే అన్నాడతను. ముంబాయిలో ఎంత కావాలంటే అంత ఇవ్వరా? మొత్తం అంటగడతారా? 'ఇక్కడ బీదవాళ్ళు ఎట్లా బతుకుతున్నార్రా బాబూ!' అనుకున్నాడు.

మాత్ర బదులు టీ తాగాలని నిర్ణయించుకొని రాయల్ హోటల్లో ఒక టీ తాగాడు. ఎనిమిది రూపాయలు ముట్టజెప్పుకున్నాడు.

'మా ఊళ్ళో అయితే మూడు రూపాయలకు మహారాజులు తాగే టీ తాగొచ్చు. జాగ్రత్తగా ఖర్చు పెట్టాలి. లేదంటే తిరుగు ప్రయాణానికి కూడా టిక్కెట్టుకు డబ్బులు మిగలవు' అనుకున్నాడు.

ముంబాయి తనకు కొత్త నగరమైనా దారి తప్పకుండా అక్కడక్కడా గుర్తులు పెట్టుకుని నడుస్తున్నాడు. అలా తిరుగుతూ ఉదయం నమాజు చదివిన మసీదు వద్దకు వచ్చాడు. దేవుడి ఇల్లు రెండు బాహువులు చాపి, 'రా బేటా!' అంటూ అతన్ని ఆహ్వానించింది. జోహార్ నమాజు అప్పుడే పూర్తయినట్టుంది. మువజ్జన్ ఏదో పన్లో ఉన్నాడు. సరాసరి ఆయన వద్దకు వెళ్ళి కాసేపు సేద తీర్చుకోవడానికి అనుమతి పొందాడు. ప్రశాంతమైన ఆ పరిసరాలు ఎవరికైనా మనశ్శాంతినిచ్చేలా ఉన్నాయి. సర్తాజ్ హాయిగా నిద్రపోయాడు.

మగ్రిబ్ నమాజుకు అజాఁ ఇస్తుండగా మేల్కొన్నాడు. నమాజు ముగించుకొని బయటికొచ్చాడు. అప్పటి వరకు లేని హుషారొచ్చింది. మధ్యాహ్న భోజనం మర్చిపోయిన సర్తాజ్‌కు ఆకలిగా కూడా లేదు.

సులేమాన్ దుకాణం వద్ద రద్దీగా వుంది. సర్తాజ్‌ను చూసి పొడిగా నవ్వాడు సులేమాన్. తను చిరునవ్వుతో బదులిచ్చాడు. సముద్రతీరం చూసి రావాలనిపించింది. ఇంకోసారి ముంబాయి వచ్చినప్పుడు అవకాశం వస్తుందో లేదో. సముద్రాన్ని దగ్గరగా చూడాలి. అలల్తో ఆడుకోవాలి. ఆ కోరిక సముద్రానికి దూరంగా ఉన్నవాళ్ళకంతా ఉంటుంది. దర్యాదిల్ ఉన్న మనుషులు అక్కడక్కడా తారసపడతారు. దిల్ దర్యాను కూడా రుచి చూడాలి కదా అనుకొని సాగరానికి పోవడానికి దారెటో సులేమాన్ అసిస్టెంటును అడిగి కనుక్కున్నాడు.

చౌపాటి బీచి బస్సు నెంబరుతో పాటు క్షేమంగా తిరిగిరావడానికి తగు జాగ్రత్తలు కూడా చెప్పాడతను.

చలికాలం లేత ఎండలో సముద్రం బంగారు వన్నెలో మెరిసిపోతోంది. కెరటాలని ముద్దాడుతున్న కెరటాలు వెండి రంగుల్ని వెదజల్లుతున్నాయి. ఈ సముద్ర తీరానికి ఆవలి తీరమే కదా తన మజిలీ! అవునన్నట్టుంది సాగరఘోష.

రేష్మాను తీసుకొని సాగరతీరాన తిరగాలి. జీవితం తనని ఆ స్థితిలో నిలపాలి.

"యా అల్లా! మదద్ కర్!" వేడుకున్నాడతను.

చౌపాటి నుండి బయలుదేరి భేండీ బజారులో ఆగాల్సినవాడు బస్సులో రద్దీగా ఉండటం వల్ల బస్టాపులో దిగలేకపోయాడు. రెండు సెకన్లకు మించి

బస్సు ఎక్కడా ఆగడం లేదు. దాదాపు కిలో మీటరు దాటి దిగాల్సి వచ్చింది. దారి కనుక్కోగలడో లేదో అని భయపడుతూనే నడుస్తున్నాడు.

పుట్టలోంచి ఒకేసారి బయటపడిన చీమల్లాగా చుట్టూ జనం. అన్నేసి అపరిచిత మొహాల మధ్య నడవడం కొత్తగా ఉంది. ఏదో అనిర్వచనీయమైన ఉద్విగ్నతలో సతమతమవుతున్నాడతను. ఫుట్‌పాత్‌ల మీద కాపురాలను చూస్తున్నాడు.

చిన్న చిన్న గుడారాల్లో ఇరకు బతుకులను చూస్తున్నాడు. ఘోషా పరదాలు తెలిసిన తనకు ఎదల వరకు గుడ్డలు చుట్టుకొని బహిరంగ స్నానాలాచరిస్తున్న స్త్రీ మూర్తులను చూస్తున్నాడు. ముక్కులు మూసుకొని నడవడం కూడా గగనంగా ఉన్న ఆ పరిసరాల్లో ముక్కుపుటాల్ని విరుచుకొని పనులు చేసుకుంటున్న కూలీలను చూస్తున్నాడు.

ఏ తప్పు చేసిందో ఓ చెల్లి! ఓ మగ మృగం బండ బూతులు తిడుతూ బండదెబ్బలు వేస్తున్న దృశ్యం హృదయాన్ని మెలిపెడుతుండగా విప్పారిన కనులతో చూస్తున్నాడు.

ఏ ఉపద్రవమన్నా ముంచుకొస్తే మునిగిపోయే జీవన వాస్తవికత కనుగుడ్లపై చెదరని జ్ఞాపకంలా ముద్రపడడం చూస్తున్నాడు. మనుషులు ఇలా కూడా బతగ్గలరా! తనకు చూడ్డమే కష్టంగా ఉంది. ఇక చాలు. వడివడిగా నడుస్తున్నాడు.

ఎంతవేగంగా నడుస్తున్నా తరగనంటున్నాయ్ దారులు. ఆ దారుల్లో జనం భుజాలతో భుజాలు రాసుకుంటూ నడవడం కష్టంగా వుంది. చెదిరిపోయిన గూళ్ళలోంచి బయటపడిన పక్షుల గుంపులాంటి జనం మధ్యలో ఊపిరి తీసుకోలేని ఉబ్బసం రోగిలా ఉంది సర్తాజ్ పరిస్థితి.

వెనక నుంచి ఎవరో ముందుకు నెట్టినట్టు తూలి ఎదురుగా నడుస్తున్న పాదచారిపై పడ్డాడు.

"బద్మాష్! ఆంఖ్ నహీ హై క్యా తేరేకో?" అంటూ చెంప పగిలిపోయేలా కొట్టాడతను.

బాగా బలిసిన మనిషి దెబ్బ కదా! కళ్ళముందు కాసేపు గాఢాంధకారం అలుముకుంది. స్కూలు ఎగ్గొట్టినప్పుడు తన తండ్రి కూడా అంతలా ఎప్పుడూ కొట్టలేదు. తనకు ముంబాయిలో జరిగిన సత్కారం నుంచి తేరుకొని ముందడుగు వేయడానికి అయిదు నిమిషాలు పట్టింది సర్తాజ్‌కు. కళ్ళలో ఉబికిన కన్నీటిని తుడుచుకుంటూ మళ్ళీ నడవడం మొదలు పెట్టాడు.

ఈ బహిరంగ ప్రపంచం కంటే ఆ గదిలో ఒంటరితనమే బావుంది. అవసరం ఉంటే తప్ప బయటికి రాకూడదు. అసలు తనకేం పని ఈ నగరంతో? తనకెవరు తెలుసునని ఈ నగరంలో? తన పని త్వరగా ముగించుకొని ఇక్కడ్నించి వెళ్ళిపోవాలి.

"అల్లాహు అక్బర్..... అల్లాహు అక్బర్.......!" ఇషాఁనమాజుకోసం పిలుపు వినిపిస్తోంది. మసీదుకు దగ్గర్లోనే ఉన్నాడనుకోగానే ధైర్యం వచ్చిందతనికి. వడివడిగా నడుస్తూ రెండు నిమిషాల్లోనే మసీదులో వాలిపోయాడు. నమాజు ముగించుకున్నాక అతడిలో ప్రశాంతత నెలకొంది.

సులేమాన్ అంగడి మూసి బయలుదేరుతున్నాడనగా అక్కడికి చేరుకున్నాడు సర్తాజ్.

"రేపుదయం పది గంటలకి డాక్టర్ దగ్గరికెళ్ళాలి. తొమ్మిది గంటలకంతా సిద్ధంగా ఉండు" అని సర్తాజ్‌తో చెప్పి వెళ్ళిపోయాడు సులేమాన్.

సర్తాజ్ గదికి చేరుకునేటప్పటికి పుస్తకం చదువుకుంటూ ఒకతను, సెల్‌ఫోనులో పాటలు వింటూ ఒకతను తారసపడ్డారు. కాళ్ళు కూడా కడగాలనిపించలేదు. నేరుగా తన స్థానంలో తలగడగా బ్యాగును పెట్టుకుని కళ్ళు మూసుకున్నాడు. ఒక గంట దాకా ప్రశాంతమైన వాతావరణం. అపరిచితులైనా దగ్గరగా ఇద్దరు మనుషులున్నారని సర్తాజ్‌లో ధైర్యం. పూర్తిగా నిద్రలోకి జారుకోలేక లేచి కూర్చున్నాడు సర్తాజ్. గదిలో ఉన్న మిగతా జనం హాయిగానే నిద్రపోతున్నట్టనిపించింది. మెల్లగా ఏవో శబ్దాలు వినిపిస్తున్నాయి. కొద్దిసేపటికా శబ్దాలు ఎక్కువయ్యాయి. ఇంకాసేపటికి హాహాకారాలుగా మారాయి. గొళ్ళెం పడని వాకిలి సందులోంచి తొంగి చూశాడు. బయట ఇద్దరు వ్యక్తులు ఘర్షణ పడుతున్నారు.

మధ్య వయస్కుడిలా ఉన్న ఓ సిక్కు మతస్తుడు సర్తాజ్ వయసున్న ఓ యువకుడిని పట్టుకుని 'కిత్నీ హిమ్మత్ తేరేకో! మేరీ బెహన్‌కో ఛేడేగా? ఆజ్ తేరా ఖూన్ పీజావూంగా!" అటూ చావగొదుతున్నాడు.

ఆ యువకుడు ప్రతిఘటిస్తున్నాడు.

ఆ తన్నులాట గొళ్ళెంలేని తలుపులు పగిలిపోయేదాకా సాగింది. ఆ హఠాత్పరిణామానికి ఎలా స్పందించాలో అర్థం కాని సర్తాజ్ భయంతో గదిగోడకు అతుక్కుపోయాడు. గదిలో ఉన్న నలుగురు లేచి చల్లార్చేదాకా ఆ గొడవ కొనసాగింది. కాసేపటికి మళ్ళీ నిశ్శబ్దం. ఈ సారి నిశ్శబ్దం క్రూరమైన మొహం పెట్టుకుని భయపెడుతోంది. కీచు కీచుమంటూ ఎలుకలు చేస్తున్న సడిని కూడా బాంబు విస్ఫోటనంలా వినిపించేలా చేయడం నిశ్శబ్దానికి తప్ప ఇంక దేనికీ సాధ్యమవుతుంది? ధైర్యం కోసం కల్మా చదువుకుని కళ్ళు మూసుకున్నాడు సర్తాజ్. కాస్త బెరుకు తగ్గింది. నిద్రపోతే పీడకలలొస్తాయని కాబోలు అతను మేలుకొనే ఉన్నాడు. ఆ నలుగురిలో ఎవరి పక్కలోనన్నా పడుకోవాలనిపించింది. ఆ కోరికని తమాయించుకున్నాడు. వాళ్ళ రూపసారాల్లో ఏ చీకటి కోణాలు దాగి వున్నాయో! ఎవర్ని కదిలిస్తే ఏ ఉపద్రవం ముంచుకొస్తుందో! లేదు లేదు. వాళ్ళు తనలాంటి మనుషులే! తనలాగా కష్టాల్లో ఉన్నవారే. లేకుంటే ఈ అనామక శిబిరంలో ఎందుకుంటారు?

కాలపు గుర్రం కదల్లేక కదుల్తోంది. దాన్ని దౌడు తీయించే రౌతు దరిదాపుల్లో లేదు. అంతలో వీపుకింద ఏదో పాకినట్టనిపించింది. దిగ్గున లేచి కూచున్నాడు. జీరోవాల్టు బల్బు లేత వెల్తుర్లో ఏముందా అని వెతికాడు. ఏవో పురుగుల్లాగున్నాయి. తీక్షణంగా చూశాడు. వందల సంఖ్యలో బొద్దింకలు. అన్ని బొద్దింకల్ని ఒకేసారి అలా చూడ్డం ఎప్పుడూ లేదు. వాంతికొచ్చినంత పనైంది. లేచి నిలబడిపోయాడు. ఏం చేయాలో పాలుపోలేదు. కాసేపటికి నలుగురిలో ఒకతను లేచి, "థూ! దీనమ్మా బతుకు!" అని తిట్టుకుంటూ బొద్దింకల్ని ఊడ్చేశాడు. సర్తాజ్‌కు అపస్మారక స్థితిలో ఉన్నట్టనిపించింది. మెల్లగా తెల్లారింది. అజాఁ వినిపిస్తోంది. పోయిన ప్రాణం తిరిగొచ్చినట్టయింది.

నమాజుకు పోయొచ్చి నిన్నటిలాగే అరుగుమీద కూర్చున్నాడు. టీ తాగాడు. మళ్ళీ ఆ గదిలోకి పోవాల్నా? సులేమాన్‌కు చెప్పి వేరే చోట బస ఏర్పాటు చేసుకోవాలి. తన పని విజయవంతమయేలా అల్లాతో దువా చేశాడు. ఎవరున్నా లేకున్నా అల్లా తనవెంట ఉన్నాడు. తన మార్గంలో ఏర్పడుతున్న అవాంతరాల్ని తొలగిస్తాడు. తన తల్లి చెబుతూ ఉంటుంది -"ఎడారి కానరానప్పుడు దేవుడి తలపు దారి చూపుతుంది"- అని. అల్లా! ఇక నీపైనే భారమంతా!

పదికాక మునుపే సర్తాజ్, సులేమాన్ అసిస్టెంటు ఆసుపత్రిలో ఉన్నారు. చాలా పెద్ద ఆసుపత్రి. డాక్టర్ ఇస్మాయిల్ మెమోరియల్ హాస్పిటల్‌లో డాక్టర్ తారీఖ్ ఖాన్ సర్తాజ్‌కు వైద్య పరీక్షలు నిర్వహించబోతున్నాడు.

"డాక్టర్‌గారు చాలా గట్టి మనిషట! అన్నీ కచ్చితంగా చూస్తాడట!

కథ

# చాయ్ గ్లాసు

- నిత్య

1994 సంవత్సరం అడవి జీవితం ప్రారంభం. పరవశింపచేసే ప్రకృతి సోయగాలు. గలగల పారే నది, అది నల్లతాచులా బుసలు కొట్టుకుంటూ ఉరికివస్తుంది కాబట్టి దాన్ని పాముల గౌతమి అంటారు. అకస్మాత్తుగా కనిపించి మాయం అయ్యే లేళ్ళ గుంపులు విరగకాచి చెట్టుకు పండిన మామిడి పండ్ల తియ్యటి ఆహ్వానం. దారి పొడుగుతా నవ్వుతూ పలకరించే పువ్వులు. నవ్వే పువ్వుని తిరిగి తిరిగి చూసుకుంటూ నడనటం. కట్టెపుల్ల కాలికి తగిలి విరుచుకుపడటం, దెబ్బ బాధను మరిపించే నవ్వుల జల్లులు ఇదీ గెరిల్లా జీవితంలోని ఆనందం.

దళం దినచర్యలో భాగంగా మేం గండవాయ నుండి పారెనార్‌కి బయలుదేరినాం. నది దాటి కొండ ఎక్కితే ఊరు వస్తుందని మా వాళ్లు చెప్పారు. ఈ దారంట రావటం ఇదే మొదటిసారి. కొండ ఎక్కటం అంటే నాకు ముందే గుండె దడ వస్తుంది. ఆ భయానికే కాబోలు ఎక్కటం మొదలుపెట్టగానే ఊపిరి సలపనట్లయింది. వేడెక్కిన శరీరాన్ని చల్లబర్చటానికి బయలుదేరిన స్వేద బిందువులు ధారైలనాయి.

'అదిగో! కొండ అంచున ఆకాశం కనిపిస్తున్నది. అక్కడికి అందితే గుట్ట అయిపోతుందిలే' అనుకుంటూ ప్రాణం ఉగ్గబట్టుకుని అక్కడికి చేరి 'హమ్మయ్య' అనుకునేసరికి మరోమెట్టు కనిపించింది. ఇలాంటివి పదిమెట్లు ఎక్కినంక, 'గుట్ట ఒడిసింది' మా వాళ్ల మాట విని ప్రాణం కుదుటపడ్డది.

'ఇంకెంత దూరం ఉందబ్బా ఊరు?'

'అందినం, అరగంట దిగితే ఊరే.....' విమల జవాబు చెప్పింది.

గ్రామానికి చేరేసరికి దివాకరుడు తన దినచర్య ముగించుకోవటానికి ఆరాటపడుతున్నాడు. వెలుగు ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలని ఇల్లాలు తొందరపడుతున్నది. పోడు నరకటానికి పోయిన పురుషులు భుజాల మీద గొడ్డళ్ళు, ఖాళీ అయిన జావ బుర్రలు చంకలకు వేలాడేసుకుని ఇళ్ళకు చేరుతున్నారు. ముసలవ్వ వెలుగు కోసం నెగడు రాజేస్తున్నది. పలుచగా చీరిన వెదురుబద్దలతో సగం అల్లిన బుట్టను చంకనెట్టుకున్న ముసలాయన ఇంటి ముఖం పట్టాడు. రామె తల్లి బిడ్డకు పాలిస్తున్నది. చందు వాళ్ళమ్మ అన్నం వండుతున్నది. నేందని చెల్లెళ్ళు కోహల దంచుతున్నారు. పన్నెండేళ్ళ చిన్నారి చిమిరి తన ఎత్తులో సగం ఎత్తున్న బిందెను తల మీద పెట్టుకుని వాగు నుండి వంటకు నీళ్ళు తెస్తున్నది. బర్మార్లు పట్టుకున్న నేండ, రాజులు రెండు ఉడుం పిల్లలు, కుందేలుతో వేట నుండి ఇంటికి తిరిగి వస్తున్నారు. ఉండేలు పట్టుకున్న బుదురు తను పట్టుకొచ్చిన పక్షి పిల్లను చెల్లికి చూపిస్తున్నాడు.

* * *

గ్రామంలో ఐదు గడపలు, ఒక గోటుల్ ఉన్నాయి. మేం వచ్చామని తెలియగానే బుడతడు ఎగురుకుంటూ వచ్చి వాలాడు. నేను, విమల

---

ఏమాత్రం తేడా వచ్చినా తిప్పి పంపేస్తాడట!" తన పక్క కుర్చీలో కూర్చున్నతను సర్తాజ్ అడక్కపోయినా చెవి దగ్గర గుసగుసలాడాడు. అప్పటికే గుబులు గుబులుగా ఉన్న సర్తాజ్‌కు ఆ మాటలు విని చెమట పట్టింది. తనకే రోగం లేదు గదా! తనకేం భయం? అయినా తనే తప్పుడు పనులు చేశాడని రోగాలొస్తాయ్? సిగరెట్టు తాగే అలవాటుండేది. అది కూడా రేష్మాకు ఇష్టం లేదని మానేశాడు. అప్పటికీ కాస్త భయం తగ్గింది.

తనతోపాటు నలుగుర్ని లోపలికి పిలిచారు. సర్తాజ్ సంపూర్ణ ఆరోగ్యవంతుడో కాదో నిర్ధారించడానికి సర్తాజ్ ఎప్పుడూ ఎరుగని ఆధునిక పరీక్షలన్నీ చేశారు. చివరిగా డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళారు. ఎర్రగా పొట్టిగా బట్టతల ఉన్న సినిమా హీరోలా ఉన్నాడు డాక్టరు. మొత్తం బట్టలన్నీ విప్పదీయించి బిత్తలిగా నిలబడమని పురమాయించాడు డాక్టరు. సిగ్గుతో బిక్కచచ్చిపోయాడు సర్తాజ్. సర్తాజ్ సంశయాన్ని పసిగట్టినట్టు గుర్రుగా చూశాడు డాక్టర్. బట్టలు ఊడదీయక తప్పలేదు. వెనక్కీ ముందుకు తిప్పి పరీక్షగా చూశాడు. 'ఇక పో!' అన్నట్టుగా చేత్తో ముందుకు నెట్టాడు. గబగబా బట్టలు వేసుకుని ఆ గదిలోంచి బయటపడి బతుకు జీవుడా అనుకున్నాడు సర్తాజ్.

"సర్తాజ్ కౌన్ హై?" అంటూ పిలిచింది నర్సు. నేనేనంటూ వెళ్ళాడు. రిపోర్టు సాయంత్రం అయిదు గంటలకు వస్తుంది, అప్పుడొచ్చి తీసుకెళ్ళమని చెప్పిందామె.

మధ్యాన్నం ఆసుపత్రి క్యాంటీనులోనే భోజనం చేసి ఆ ఆవరణంలోనే అయిదు వరకూ ఉండిపోయారు.

కచ్చితంగా అయిదుగంటలకు రిపోర్టు చేతిలో పెట్టి డాక్టరుగారి గదిలోకి పంపారు. డాక్టరు తనవైపూ రిపోర్టులవైపూ మార్చి మార్చి చూస్తున్నాడు. అందులో ఏముందో తను మెడికల్ పాసయ్యాడో లేదో అర్థం కాని సర్తాజ్‌కు చాలా ఆదుర్దాగా ఉంది.

డాక్టర్ సర్తాజ్ వివరాలడిగి తెలుసుకొని, "నీవెంట పెద్దవాళ్ళెవరైనా వచ్చారా?" అనడిగాడు. తన తండ్రి అనారోగ్యం గురించి చెప్పి ఆయన రాలేదని తను ఒంటరిగానే వచ్చానని బదులిచ్చాడు సర్తాజ్.

"నీకు ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధి ఉంది. ప్రాణాంతకమేం కాదుగానీ నిర్లక్ష్యం చేస్తే ప్రాణాలకు ముప్పే! మందులు ఖచ్చితంగా వాడితే ఒక సంవత్సర కాలంలో పూర్తిగా తగ్గిపోయే అవకాశం వుంది" అని మందుల చీటీ చేతిలో పెట్టాడు.

సర్తాజ్ సగం చచ్చిపోయాడు. తన చిన్న కుటుంబంలో ఇద్దరు వ్యాధిగ్రస్తులు! ఇద్దరికీ ఖరీదైన మందులు కావాలి.

ఏం చేయాలి?

అసలు ఈ విషయం ఇంట్లో ఎలా చెప్పాలి?

ఇది తెలిస్తే అమ్మానాన్నా బతుకుతారా?

సమాధానాలు దొరకని సవాలక్ష ప్రశ్నలకు జవాబు వెతుకుతున్నాడు సర్తాజ్.

* * *



ఊరికి ఎక్కువగా పోతుంటాం. బుడత తల్లిని చందు వాళ్ళమ్మ అని పిలుస్తారు. ఆమె అడ్డాకు గింజలు, తునికి పండ్లు, రేఖ పండ్లు, దుంపలు, కూర అరటికాయలను మగ్గబెట్టిన అరటిపళ్ళు ఏది ఉన్నా మా కోసం దాచిపెట్టి పెట్టేది. ఆ కుటుంబంలో పెద్ద కొడుకు చందు. వాడికి పదేళ్ళుంటాయి. వాడి తర్వాత ఒక ఆడపిల్ల. చివరివాడు చిచ్చర పిడుగు. వాడే బుడతడు. వాడికి ఆరేళ్ళుంటాయి. నల్లటి నలుపు. చలాకీగా మెరిసే గుండ్రని కళ్ళతో చూపరులను ఆకట్టుకుంటాడు. వాడు పిలుపుకు అందడు. చేతికి చిక్కడు. తనకు తానుగా ఎన్నడూ ఒంటిమీద నీళ్ళు పోసుకోడు. ఎవరన్నా నీళ్ళు పోయించుదామంటే తూరీగలా తుర్రుమనేవాడు. ఇంట్లో వాళ్ళు ఎంత ప్రయత్నం చేసినా వాడికి లాగు తొడిగించలేక పోయారు. దొరకబెట్టి బలవంతాన ఎవరన్నా తొడిగినా విప్పి అవతల గిరాటేసేవాడు. దిసమొలతో హాయిగా తిరిగేస్తుండే వాడు.

నాకు పిల్లలంటే బోల్డంత ఇష్టం. తరచుగా వస్తూ పోతుండడంతో బుడతనితో నాకు దోస్తీ కలిసింది. నెమ్మదిగా దగ్గరికి వచ్చి కూర్చునేవాడు. నా మాట బుద్ధిగా వినేవాడు. ఊరి నుండి మేం వెళ్ళిపోయే వరకూ మాతోనే ఉండేవాడు. నేను చెప్పే కథలు ఎంత అర్థమయ్యేదో తెలియదు కాని గుడ్లు మిటకరించుకుని వినేవాడు.

రాత్రి అన్నం తిని ఊరిలో మీటింగు, పాటల కార్యక్రమం నడిచాయి. రాత్రి అదే ఊరిలో పడుకున్నాం. ఉదయం లేచి వ్యాయామం ముగించుకుని కాళ్లు చేతులు కడుక్కోవటానికని వాగుకు బయలుదేరినాం. బుడతడు మా వెంటే ఉన్నాడు.

'స్నానం చేస్తావా?' నెమ్మదిగా అడిగాను.

'ఊ' సమ్మతంగా తలూపాడు.

వాడు 'ఊ' అనటమే తడువు నేను, సీత వాడి వంటిని రుద్దటం మొదలుపెట్టాం. ఉప్పువేసి బండమీద చేపను తోమినట్లుగా తోమినం. మూడుసార్లు లైఫ్‌బాయి అరగదీస్తేగాని మురికి బంగారం వదల్లేదు. పండిన నేరేడు పండులా ఎంచక్కా మెరిశాడు బుడత.

'అమ్మ దగ్గరకు పోయి లాగు తీసుకురా..' అంటే బుద్ధిగా పోయి తీసుకొచ్చాడు. ప్రతిఘటన లేకుండానే లాగు తొడిగించుకున్నాడు. తలకి నూనె రాసి క్రాపు నున్నగా దువ్వాను.

* * *

చాయ్ విజిల్ వచ్చింది. వంట డ్యూటీలో ఉన్న మంగు నవ్వుతూ రెండు గ్లాసులతో చాయ్ పోసి ఇచ్చాడు. బుడతనికి ఒకటి ఇచ్చి, నేనొకటి తీసుకున్నాను. వాడికి కూడా నాలాగే చాయ్ పిచ్చి. అందుకని గ్లాసునిండా పోశాను. గ్లాసులో చాయ్ అయిపోయే దాకా నోటి దగ్గర నుండి గ్లాసు తియ్యలేదు. తాగటం అయిపోయినాక గ్లాసు పట్టుకున్న చేతిని నా ముందుకు చాపాడు.

'ఇదిగో' అన్నాడు.

నేను గ్లాసు తీసుకోలేదు. 'కడిగి తీసుకు రా!' అన్నాను.

వాడు కదలలేదు. అట్లనే నించున్నాడు. కొద్దిసేపాగి మళ్లీ గ్లాసును నా ముందుకు చాపి 'ఊ' అన్నాడు.

'అక్కడ నీళ్ళున్నాయి. పోయి గ్లాసు కడిగి తెచ్చి ఇక్కడ పెట్టు'. కొంచెం నిదానంగా నొక్కి చెప్పాను.

అయినా వాడు కదలలేదు. అక్కడే నిలబడ్డాడు. గ్లాసు అందుకునే ప్రయత్నం నా వైపు నుండి ఏమీ లేకపోవటం చూసి గ్లాసుని విసురుగా మీద గిరాటేశాడు. తిరిగి చూడకుండా తుర్రుమన్నాడు.

'బుడతన్ని నేనేం అన్నాను విమలా? వానికెందుకు కోపం వచ్చింది' పక్కనే కూర్చుని ముసిముసిగా నవ్వుతున్న విమలను అడిగాను.

'నువ్వు వాడిని గ్లాసు కడగమన్నావు కదా! ఇళ్ళల్లో తిన్న కంచం, తాగిన గ్లాసు మగాళ్ళు కడుగుతారా? అందుకే వానికి కోపం వచ్చింది' అంటూ పగలబడింది విమల.

ఆశ్చర్యపోవటం నా వంతయింది. లాగు తొడుక్కోవటం చేతగాని బుడతనికి పితృస్వామ్యం నేర్పిందెవరు. ఆలోచనల్లో మునిగిపోయిన నేను 'పోదాం అక్కా' అని కమాండరు జగత్ మాటతో ఈ లోకంలోకి వచ్చాను. త్వరత్వరగా కిట్టు సర్దుకుని భుజానికేసుకున్నాను.

* * *

గొంగవాడకి మా ప్రయాణం. నడుస్తున్నానే గాని ఆలోచనల నిండా బుడతడు నిండిపోయాడు. సమాజాన్ని మార్చే బృహత్ కర్తవ్యం కోసం పని చేస్తున్న సామాజిక కార్యకర్తలం కాబట్టి కర్తవ్యం గురించి ఆలోచన బుర్రలో సుడులు తిరుగుతున్నది. పార్టీలో, ప్రజా సంఘాలలో పొడసూపుతున్న పితృస్వామిక ధోరణులను సరిదిద్దటానికి 'దిద్దుబాటు కార్యక్రమం' తీసుకున్నాం. క్లాసులు నడిపినం. విమర్శ-స్వయం విమర్శలు గ్రామాల వరకూ నడిపినం. ఏ సంఘంలోనూ సభ్యుడు కాని బుడతనికి పితృస్వామ్యం గురించి ఎలా చెప్పటం? వాడి వయసు చూస్తే బాలల సంఘానికి కూడా అర్హత లేదు. వేల... లక్షల..... బుడతల భావజాలాన్ని మార్చటం ఎలా? సామాజిక ఆచరణలో పితృస్వామిక భావజాలం ఎంత స్వాభావికంగా వ్యవస్థీకృతం అయిందో అంత సహజంగా స్త్రీ-పురుషులు సమానమనే నూతన ప్రజాస్వామి భావజలాన్ని వ్యవస్థీకృతం చేయటం ఎట్లా? పురుష పనులు-స్త్రీ పనుల నడుమ గీయబడిన లక్ష్మణ రేఖలను తుడిచేయడం ఎట్లా? ఆచరణలో తేవలసిన మార్పు గురించి ఆలోచిస్తుండగానే మరో మజిలీ వచ్చేసింది.

* * *

2001 సంవత్సరం మార్చి నెలలో భా.క.పా.(మా-లె) (పీపుల్స్‌వార్) 9వ కాంగ్రెసు జరిగింది. ఆ కాంగ్రెసు భారత విప్లవ పురోగమనంలో గుణాత్మక గెంతులు తెచ్చే చారిత్రక నిర్ణయాలు తీసుకున్నది. ప్రాంతాలవారీగా రాజ్యాధికారం నెలకొల్పే లక్ష్యంగా దండకారణ్యాన్ని విముక్తి ప్రాంతంగా మార్చాలనే కర్తవ్యం తీసుకున్నది. గెరిల్లా బేసులలో బీజ రూపంలో రాజ్యాధికారాన్ని స్థాపించే కృషిలో భాగంగా విప్లవ ప్రజా సమితుల నిర్మాణం ప్రారంభమయింది. పిండరూపంలో రాజ్యాధికార అంగాలైన 'జనతనా సర్కార్లు' గ్రామాలను నడిపిస్తున్నవి. న్యాయ, రక్షణ, ప్రజారోగ్యం, వ్యవసాయం, విద్యా-సాంస్కృతిక శాఖలు ఈ సర్కార్లకు పట్టుగొమ్మలు.

* * *

మాడ్ డివిజన్ ఇంద్రావతి ఏరియాలో నడుస్తున్న భుంకాల్ స్కూలు అది.

ముదురు నీలం రంగు పాంటులు, ఆకాశం రంగు చొక్కాలు వేసుకున్నారు. అంతా కలగాపులగంగా కూర్చున్నారు. అమ్మాయిల బెంచీలు, అబ్బాయిల బెంచీలు విడిగా లేవు. అందరూ క్రాపులతో ఉండి ఎవరు ఆడ, ఎవరు మగ గుర్తించటం కష్టంగా ఉంది.

పూసు, మెస్సి, పుయిసు, మాంచులు భుంకాల్ స్కూలు టీచర్లు.

పుయిసు టీచరు క్లాసు నడుస్తున్నది. పిల్లల చేతుల్లో 'గోండి భాష కరియకడ్' (గోండి భాష నేర్చుకుందాం) పుస్తకం కనిపిస్తున్నది. పుయిసు ఒక్కో వాక్యం చెపుతుంటే పిల్లలంతా వల్లె వేస్తున్నారు.

'అమ్మ పొలం దున్నుతుంది
నాన్న ఊయల ఊపుతాడు
చందు అన్నం వండుతాడు
రామె అన్నం వడ్డిస్తుంది.
పెదనాన్న బియ్యం చెరుగుతాడు'.

సమయం పన్నెండు కావస్తున్నది. మధ్యాహ్నం భోజనం సమయం అయింది. మానిటర్ రాజు ప్రకటించింది 'కామ్రేడ్స్! అన్నం తిన్న తర్వాత గంట విశ్రాంతి తీసుకుని అందరూ కట్టెలు తేవాలి. 3.00 గంటలకు గ్రౌండ్‌కి రావాలి'.

* * *

పిల్లలంతా సబ్బుతో చేతులు కడుక్కుని ఎవరి ప్లేటు వాళ్లు తీసుకుని లైన్లో నిలబడ్డారు. ఆ రోజు వంట డ్యూటీలో రామాల్, కోసిలు ఉన్నారు. కోసి పప్పు వడ్డిస్తుంటే రామాల్ కూర వడ్డిస్తున్నాడు. అన్నాలు తిన్న తర్వాత ఎవరి ప్లేట్లు వాళ్లు శుభ్రంగా కడుక్కుని తమ బ్యాగ్‌లలో సర్దుకున్నారు.

అన్నం తిన్న తర్వాత వంటగది ఊడ్చే పని ప్రతిరోజు ఇద్దరికి వేస్తారు. ఆ రోజు డ్యూటి లచ్చు, సిగినిలకు పడ్డది. అరగంటలో కిచన్ హాలంతా శుభ్రం చేసి విశ్రాంతి తీసుకోవటానికి వెళ్ళిపోయారు.

* * *

3.00 గంటలకు అందరూ గ్రౌండ్‌కి చేరారు. ఈ రోజు డ్రిల్లు చేయించే పని జైని వంతుకు వచ్చింది. 'జండా ప్రొటోకాల్' డ్రిల్లు చేయిస్తున్నది. ఎత్తుల వారీగా నిలబెడుతున్నది. కుడి నుండి ఎడమకు ఒకే వరుసలో అందరూ నిలబడ్డారు.

'సావధాన్'

'విశ్రాం'

'సావధాన్' తర్వాత ఒకటి రెండు మూడు నెంబర్లు ఇప్పించింది.

'ఏక్ దో తీన్ గిన్తీ కరేగా.... గినతీ కర్....' జైని కాషన్ ఇచ్చింది.

'ఏక్ నంబర్ వాలె ఏక్ కదం పీఛే హటేగా. పీఛే హట్' కాషను విని ఒకటో నెంబరు వచ్చిన వాళ్ళు ఒక అడుగు వెనక్కి వేశారు.

'తీన్ నంబర్ వాలే ఏక్ కదం ఆగే బఢేగా. ఆగే బఢ్' కాషను విని 3వ నంబరు వాళ్లు ఒకడుగు ముందుకు వేశారు. 'డ్రెస్ అప్' కాషన్ విని ముందువాళ్లు పిడికిలి బిగించిన కుడిచేయి పక్కవారి భుజానికి ఆనించి నిలబడగా వారిని చూసుకుంటూ వెనకవారు వరుసలోకి వచ్చారు. ఇలా మూడు వరుసల్లో సెట్ అయినంక మళ్ళీ సావధాన్-విశ్రాం చేయించింది.

'రెడ్ శాల్యూట్స్' కాషన్ ఇచ్చింది జైని.

ఇలా నాలుగు సార్లు చేయించినంక 'విసర్జన్' కాషన్ ఇచ్చింది.

* * *

2005 ఫిబ్రవరి 10.

భుంకాల్ స్కూలు వార్షికోత్సవ వేడుకలకు రావల్సిందిగా నాకు ఆహ్వానం వచ్చింది. పిల్లలంతా కొత్త బట్టలు వేసుకున్నారు. అన్ని పనులు పద్ధతి ప్రకారం వంతుల వారీగా చక చక నడుస్తున్నాయి.

రత్నీ, సుంజులు చీపుర్లు పట్టుకుని ఊడుస్తున్నారు. క్రాంతి, రమలు జనరేటరులో కిరోసిన్, పెట్రోల్ పోసి లైట్ల కనెక్షను కోసం వైర్లు వేస్తున్నారు. ఆడ పనులు-మగ పనులు తేడా లేకుండా అందరూ అన్ని పనులూ కలబడి చెయ్యటం చూసి ముచ్చటేసి అలాగే చూస్తూ నిలబడ్డాను.

ఇంతలో అన్నం విజిల్ వచ్చింది.

అన్నం తింటుండగా పిల్లలంతా చుట్టూ చేరారు.

'ఎప్పుడొచ్చినవ్ అక్కా' అంటూ విమల పలకరిస్తూ వస్తున్నది. విమల కలవక పదేళ్లు అయిపోయింది. నా చుట్టూ చేరిన పిల్లల్లో నూనూగు మీసాల నల్లటి యువకున్ని చూపిస్తూ 'గుర్తు పట్టినవా అక్కా' అన్నది.

'నీ బుడతడు' అంటూ నవ్వుతూ చిన్నప్పటి చాయ్ గ్లాసు ఘటనను గుర్తు చేసింది. అందరం నవ్వుకున్నాం.

'బుడతడు' కూడా నవ్వుకుంటూ పోయి తను తిన్న కంచం కడుక్కుని నిలబడ్డాడు. ఎవరి కోసమో చూస్తున్నట్లు అక్కడ నిలబడ్డాడు. నా పళ్లెం కడుక్కుంటుంటే నీళ్ళందిస్తూ గుసగుసలాడాడు.

'నన్న మున్నెట లెక్క హిల్లేన్'

(నేను మునుపటిలా లేను).



లేఖ :

## ప్రియమైన విరసం సభ్యులకు ఎర్ర దండాలు!

ఈ మధ్య వచ్చిన అరుణతార (కా. కిషన్‌జీ ప్రత్యేక సంచిక)లో కా. వేణుగోపాల్ గురించి రాసిన విషయాలు ఆలోచించాల్సిందిగా కోరుతున్నాను. మూడు విధాలుగా అవి సరిగా లేవనీ, రాసిన పద్ధతీ సరి కాదనీ అభిప్రాయపడుతూ రాస్తున్నాను

1. కా. వేణుగోపాల్ మొదటి బ్యాచ్‌లో (1980 జూన్- జూలై) డికె రాలేదు. మొదటి బ్యాచ్‌లో వచ్చిన కామ్రేడ్స్ అనేక కష్టాలు, త్యాగాలతో పోరుదారులు వేస్తున్న క్రమంలో దాదాపు రెండేళ్ళ తర్వాత వేణు అడవికి వచ్చాడు. ఇది Fact, ఆయనను మొదటి బ్యాచ్‌లో వచ్చినవాడుగా పేర్కొనవద్దు.
2. అరుణతార రాతల్లో ఆయన నిర్మించిన ఉద్యమంగా కొనియాడుతోంది. ఇది సరైంది కాదు. దండకారణ్య ఉద్యమాన్ని పార్టీ నాయకత్వంలో ప్రజలు నిర్మిస్తున్నారు. పార్టీ నిర్ణయాలను అమలు చేయడంలో కా. వేణును అందరిలాగే ఒక వ్యక్తిగానే చూడాలి తప్ప అంతకు మించి ఎలాంటి ప్రాధాన్యత ఇవ్వాల్సిన అవసరం లేదు. ఆయన అతని స్థాయికి తగిన విధంగా నిర్ణయాలు చేయడంలో, విధానాలు రూపొందించడంలో, ఎత్తుగడలు చేపట్టడంలో. ఒక కమిటీ సభ్యుడిగా పాత్ర పోషిస్తున్న మాట నిజమే, వాటి అమలులోనూ శక్తి వంచన లేకుండా కృషి చేస్తోంది కూడా నిజమే, కానీ వ్యక్తినే సర్వస్వం చేసి కొనియాడడం మనం సుదీర్ఘకాలంగా అనుసరిస్తున్న విప్లవ సంప్రదాయాలకు పొసగనిది. దయచేసి ఇలా చేయకూడదని విజ్ఞప్తి. వందల, వేల సంఖ్యలో ప్రజల, విప్లవకారుల త్యాగాల ఫలితమే నేటి మన ఉద్యమం - అందులో ఒక భాగం డికె-కాబట్టి ఆ రకంగానే దానిని చూడాలి.

మీకు అభ్యంతరం లేకపోతే పైరెండు విషయాలను అరుణతారలో వేయండి.

విప్లవాభినందనాలతో........

- వేణుగోపాల్-డికె

# విరసం కొత్త పుస్తకాల పరిచయ సభ

- సంగ్రామ్

ఏప్రిల్ 15న గుంటూరులో విరసం ఆధ్వర్యంలో జరిగిన సాహిత్య సభలో 'గుమ్మెట మోత', కఫన్, ఆఖరి కుందేలు, వివేచన, పరామర్శ, తడి ఆరని నేల పుస్తకాల పరిచయ సభ జరిగింది.

యూనిట్ కన్వీనరు సంగ్రామ్ అధ్యక్షత వహిస్తూ నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల స్ఫూర్తితో 4 జూలై 1970న ఆవిర్భవించిన విరసం, తన మొదటి సభను అక్టోబరు 1970లో ఖమ్మం-సుబ్బారావు పాణిగ్రాహినగర్‌లోనూ తన 23వ మహాసభను 2012 మార్చిలో కర్నూలు కిషన్‌జీ హాల్‌లో జరుపుకుందని అన్నారు. అది సాహిత్య సంస్థే అయినా విరసానికి ఉన్న బలం దాని ప్రజారాజకీయ దృక్పథం అని, మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం-కరదీపికగా కళా సాహిత్య రంగాలను పరిపుష్టం చేసి ప్రజలకు చేరువయ్యిందని అన్నారు. ఈ నాలుగు దశాబ్దాల కాలంలో తెలుగు సాహిత్య సాంస్కృతి రంగంలో అది నిర్వహించిన చారిత్రక పాత్రను వివరిస్తూ, వివిధ సాహిత్య ప్రక్రియలలో విరసం చేసిన కృషిని సోదాహరణంగా వివరించారు.

**పాణి** నవల '**గుమ్మెట మోత**'ను అల్లం రాజయ్య పరిచయం చేశారు. రచయితలు సమకాలీన ఆలోచనల్ని జీవితాల్ని సాహిత్య సృజనలో భాగం చేసే ఒరవడిని గుంటూరు సీమ రచయితలు ప్రారంభించారని రాజయ్య అన్నారు. సృష్టికర్తలైన అట్టడుగు ప్రజలకు సంబంధించిన జీవితాల ఆధారంగా సాహిత్య సృజన చేయడం విరసం ఆవిర్భావం తరువాత ఒక ఉద్యమంలా సాగిందని ఆయన అన్నారు. విప్లవ రచయితలది ఆచరణాత్మకమైన సాహిత్యమని, ప్రజల భాష, వ్యక్తీకరణలు విప్లవ సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయని ఆయన అన్నారు. పీడిత ప్రజలు తమ విముక్తి కోసం చేస్తున్న పోరాటాలే సమాజంలో సకల వర్గాల విముక్తికి దోహదపడి నూతన ప్రజాస్వామిక సమాజం ఏర్పడుతుందని ఆయన అన్నారు. గుమ్మెట మోత నవలలో సంచార జీవులయిన బుడగ జంగాల అస్తిత్వం, రాగ ద్వేషాలు, అంతరంగిక ఘర్షణలు వైరుధ్యాల చిత్రణ ఉందని ఎనిమిది దశాబ్దాల వారి చరిత్రను ఆ నవల చిత్రీకరించిందని రాజయ్య వివరించారు. ఇప్పటికీ సంచార జీవిత దశలో ఉన్న మానవ సమూహాలన్నింటిని ఉత్పత్తి సంబంధాలలోకి తీసుకరావడం ద్వారా మాత్రమే వాళ్ళ జీవితాలలో మౌలికమైన, అభివృద్ధికరమైన మార్పు సాధ్యమవుతుందని ఆయన అభిప్రాయపడ్డారు. రచయితలు తమకు తెలిసిన జీవితాన్ని మాత్రమేగాక తెలియని అట్టడుగు వర్గాల జీవితాన్ని అధ్యయనం చేసి రచనలు చేయవలసిన సామాజిక అవసరాన్ని గుర్తించిన నవల "గుమ్మెట మోత" అని అన్నారు.

కథా రచయిత మంచికంటి-**ఇక్బాల్** కథా సంకలనం '**కఫన్**', **ఉదయ మిత్ర** కథా సంకలనం **ఆఖరి కుందేలు**ల పరిచయం చేశారు. ఈ రెండు సంకలనాలలోని కథలు పాలమూరు వలస కూలీలు దోపిడీ పీడన పరాయీకరణలను చిత్రించాయని అన్నారు. మానవీయ సంబంధాలు డబ్బు సంబంధాలుగా మారిన నేపథ్యంలో ప్రజా జీవితానికి చెందిన సకల పార్శ్వాలు ఎంత భయంకరంగా అమానవీయంగా పరిణామం చెందుతాయో ఈ కథల ద్వారా తెలుస్తుందని మంచికంటి అన్నారు. పోరాట ప్రాంతాల ప్రజల ఆర్తిని కథలుగా మలచడంలో విప్లవ కథకుల కృషిని ఆయన పేర్కొన్నారు.

సాహిత్య పరిశోధకులు కాళిదాసు పురుషోత్తం **చెంచయ్య** వ్యాస సంకలనం '**వివేచన**', **రుక్మిణి** వ్యాస సంకలనం '**పరామర్శ**'లను పరిచయం చేస్తూ మంచి సాహిత్యానికి మంచి సాహిత్య విమర్శ అవసరాన్ని గుర్తు చేశారు. మనం సాధించిన దేదీ వైయక్తికం కాదని, అంతా మానవ సమాజం, సమూహాలు, సంస్థలు కలిగించిన చైతన్యమేననే వాస్తవాన్ని గుర్తించాలని అన్నారు. కె.వి.ఆర్., మధుసూధనరావులు అందించిన మార్క్సిస్టు సాహిత్య విమర్శ ఒరవడిని చెంచయ్య, రుక్మిణిలు కొనసాగిస్తున్నారనడానికి ఈ రెండు వ్యాస సంకలనాలు నిదర్శనమని ఆయన అన్నారు. సాహిత్య విమర్శకుడికి మంచి చెడులను బేరీజు వేసుకొనే సంయమనం అవసరమని, అది ఈ ఇద్దరు రచయితలలోనూ ఉందని అభిప్రాయపడ్డారు.

**అరసవెల్లి కృష్ణ** కవితా సంకలనం '**తడి ఆరని నేల**'ను నల్లూరి రుక్మిణి పరిచయం చేశారు. ఆయన కవిత్వమంతా కన్నతల్లి, కన్న ఊరు, పరిచయమైన నదుల ప్రస్తావనలో ఉన్నాయని, వీటిని కవితా వస్తువుగా చేసుకోవడంలో రచయిత ఆవేదనను అర్థం చేసుకోవాలని అన్నారు. తాము అమితంగా ప్రేమించే భూమి నుండి, స్వంత ఊరి నుండి సెజ్‌ల పేరుతో, అభివృద్ధి పేరుతో బయటకు నెట్టవేయబడడాన్ని, వారు శ్రమకూలీలుగా రూపాంతరం చెందడంలోని దుఃఖాన్ని రచయిత వర్ణించారని రుక్మిణి అన్నారు. అదే సమయంలో ఆ దుఃఖాన్ని అధిగమించడానికి సామూహిక ప్రజా పోరాటాలే పరిష్కారమనే వాస్తవాన్ని కూడా ఆయన సూచించారని రుక్మిణి అన్నారు.

ఈ సభకు విరసం సభ్యుడు కిరణ్ స్వాగతం పలికారు.



కరపత్రం

# మాడ్ ప్రాంతంలో సైనిక చర్యలను నిరసిస్తూ బహిరంగ సభ

## 20 ఏప్రిల్, 2012, సా. 5 గంటలకు - ప్రెస్‌క్లబ్, బషీర్‌బాగ్, హైదరాబాదు.

ఆపరేషన్ హోకా, విజయ్‌లకు వ్యతిరేకంగా ఉద్యమిద్దాం. అధ్యక్షత : క్రాంతి, వక్తలు : ప్రొ. హరగోపాల్, పద్మకుమారి (బంధుమిత్రుల సంఘం), రాధ (చైతన్య మహిళా సంఘం), కోటి (ప్రజాకళామండలి), చిలుకా చంద్రశేఖర్ (ఎపిసిఎల్‌సి), వరవరరావు (విరసం) ప్రజా కళా మండలి సాంస్కృతిక కార్యక్రమాలు ఉంటాయి.

మార్చి 18న చత్తీస్‌గడ్‌లో భారీ ఎన్‌కౌంటర్ జరిగిందనీ, 15 మంది మావోయిస్టులు మృతి చెందారనీ పత్రికల్లో ఒక వార్త వచ్చింది. నారాయణ్‌పూర్, కాంకేర్ జిల్లాలను ఆనుకొని ఉన్న అబూజ్‌మాడ్ ప్రాంతంలో ఈ ఘటన జరిగినట్టు వచ్చింది. ఈ ఘటన గురించి పోలీసులుగాని, మావోయిస్టులుగాని ధృవీకరించలేదని కూడా రాశాయి. సరిగ్గా దీనితో సంబంధం ఉందో లేదో గాని ఆ సమయంలో మాడ్ ప్రాంతంలో 3000 సైనిక బలగాలు ఒక పెద్ద ఆపరేషన్ జరిపాయి. చత్తీస్‌గడ్‌లోని నారాయణ్‌పూర్, బీజాపూర్ జిల్లాల నుంచి, మహారాష్ట్రలోని గడ్చిరోలి నుంచి ఈ బలగాలు అబూజ్‌మాడ్ ప్రాంతాన్ని చుట్టుముట్టాయి. సరిహద్దు భద్రతా బలగాలు, ఇండో టిబెటన్ సరిహద్దు పోలీసు బలగాలు పాల్గొన్న ఈ దాడికి ప్రభుత్వం ఆపరేషన్ హోకా, ఆపరేషన్ విజయ్ అనే పేర్లు పెట్టింది.

ఇంద్రావతి నదికి అవతలి నుంచి మాడ్ ప్రాంతం దిశగా సాగిన ఈ ఆపరేషన్‌లో మానవరహిత విమానాలను ఉపయోగించారు. గొడ్డెల్‌మర్క ఈకోనార్, తాకిలోడ్, రేకవాయి, వెడమ, దుంగ, కుంనార్, తాడిబల్ల మొదలైన 20 గ్రామాలపై సైనికులు ముప్పేట దాడి చేసి భీభత్సం సృష్టించారు. తోక అనే గ్రామంలో దుంగ అనే ఆదివాసీని హత్య చేశారు. మరకొ ఆదివాసీని ఎత్తుకెళ్లారు. కొన్ని గ్రామాల్లో ప్రజలపై కాల్పులు జరిపారు. ఈ గ్రామాల్లో ఆదివాసులను కొట్టి ఇళ్లను లూటీ చేసి, తగలబెట్టారు. ముఖ్యంగా ఇంద్రావతికి దక్షిణం వైపు ఉండే పడ్కో అనే గ్రామ వ్యవసాయ క్షేత్రాన్ని ధ్వంసం చేశారు. ఇందులో రైతులు సమిష్టిగా మొక్కజొన్నలు, కూరగాయలు పండించి తమ రోజువారీ అవసరాలు తీర్చుకునేవారు. ఈ ఊళ్లో జనతన సర్కార్ ఆధ్వర్యంలో నడిచే పాఠశాల మీద కూడా దాడి చేశారు. అక్కడే బలగాలు కొన్ని రోజుల పాటు మకాం వేసి ఆ గ్రామాన్ని నానా విధ్వంసం చేశాయి.

చత్తీస్‌గడ్ డిజిపి అనిల్ నవనీ, మహారాష్ట్ర డిజిపి సుబ్రహ్మణ్యం, సిఆర్‌పిఎఫ్ డిజి విజయకుమార్, బస్తర్ ఐజి టిజె లాంగ్‌కుమేర్ తదితరుల ఆధ్వర్యంలో ఈ ఆపరేషన్ జరిగింది. ఈ సంయుక్త ఆపరేషన్‌కు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ముందస్తు సన్నాహాలు చేశాయి. ఫిబ్రవరి 22న కేంద్ర హోంమంత్రి నేతృత్వంలో జరిగిన నక్సలైట్ ప్రభావిత రాష్ట్రాల ప్రధాన కార్యదర్శులు, డిజిపిల సమావేశం జరిగింది. కాబట్టి అక్కడి నిర్ణయాల ప్రకారమే రెండు వారాలకు పైగా మాడ్ ప్రాంతంలో ఈ దుర్మార్గమైన దాడి జరిగిందని ఊహించడం కష్టమేమీ కాదు.

సరిగ్గా గత ఏడాది ఇదే కాలంలో చింతల్‌నార్ ఘటన జరిగింది. దీని గురించి జాతీయ మీడియా ప్రముఖంగా ప్రచారం చేసింది. నిజనిర్ధారణకు వెళ్లిన ప్రముఖ సంఘ సేవకుడు స్వామి అగ్నివేష్ బృందంపై దాడి జరగడంతో చింతల్‌నార్ ఘటనకు ప్రాధాన్యత పెరిగింది. దీంతో సుప్రీం కోర్టు జోక్యం చేసుకొని చత్తీస్‌గడ్ ప్రభుత్వాన్ని సిబిఐ విచారణకు ఆదేశించింది. అది అట్లా ఉండగానే దండకారణ్యానికి కేంద్రంగా ఉన్న మాడ్ ప్రాంతంపై సైనిక బలగాలు పైచేయి సాధించడానికి ఆపరేషన్ హోకాను అమలు చేశారు. గ్రీన్‌హంట్ ఆపరేషన్ రెండో దశను కూడా మావోయిస్టు ప్రజాసైన్యం తట్టుకొని నిలబడడంతో ప్రభుత్వం కొత్తగా ఆపరేషన్ హోకా, ఆపరేషన్ విజయ్ అనే వాటిని తీసుకొచ్చింది.

మాడ్‌ను గురిపెట్టిన ఈ కొత్త ఆపరేషన్ల ద్వారా ఆ ప్రాంతంలోని ఆదివాసులపై దుర్మార్గమైన దాడి చేయడమేగాక, వాళ్లు నిర్మించుకుంటున్న అభివృద్ధి నమూనాను ధ్వంసం చేయడం అసలు ఉద్దేశం. అందుకే వాళ్ల సమిష్టి వ్యవసాయ క్షేత్రాల మీద, స్కూళ్ల మీద దాడులు చేశారు. మాడ్ ప్రాంతంలో అత్యంత విలువైన ఖనిజ సంపద ఉన్న విషయం తెలిసిందే. రావ్‌ఘాట్ పర్వత సానువుల వెంట భారీ ఎత్తున ఇనుప ఖనిజ నిలువలు ఉండటంతో టాటా, ఎస్సార్ తదితర కార్పొరేట్ సంస్థలు ఆ ప్రాంతాన్ని కైవసం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి. మావోయిస్టుల నాయకత్వంలో ఆదివాసులు ఈ సంస్థల చొరబాటును అడ్డుకుంటున్నారు. అందుకే ఆపరేషన్ హోకా, విజయ్. వీటి ఉద్దేశం ఇంత మాత్రమే కాదు. మాడ్ ప్రాంతంలో కూడా తమ సైనిక కలాపాలు జరుగుతున్నాయని, మావోయిస్టుల కేంద్రాన్ని సైతం హస్తగతం చేసుకోబోతున్నామని చాటుకొనే కుట్ర ఇందులో ఉంది.

కానీ మాడ్ ప్రాంతంలో ప్రతిఘాతుక కార్యకలాపాలు కొత్తేమీ కాదు. ఆ ప్రాంతంలో ఇప్పటికే చాలాసార్లు వందల, వేల సంఖ్యలో సైనిక బలగాలు దుర్మార్గమైన దాడులకు పాల్పడ్డాయి. ఆదివాసులు, మావోయిస్టులు కొంత నష్టపోయినా సైనిక దాడులను తిప్పికొట్టారు. 2005 నుంచే సాల్వాజుడుం దాడులు చేసి గృహదహనాలు, హత్యలు, లూటీలు, అత్యాచారాలు, పంట విధ్వంసాలకు పాల్పడింది. డజన్ల సంఖ్యలో గ్రామాలను ధ్వంసం చేశారు. ఎంతో మందిని కాల్చి చంపారు. అయితే ఇంత పెద్ద ఎత్తున మాడ్‌ను చుట్టుముట్టడం ఇదే మొదలు కావచ్చు.

మాడ్‌లో శిక్షణ స్కూళ్ల ఏర్పాటు పేరుతో ఏడాది కిందే భారత సైన్యం బస్తర్‌లో తిష్ట వేసింది. శిక్షణ స్కూళ్ల పరమార్థం ఏమిటో ఈ తాజా దాడితో అందరికీ తేటతెల్లమైపోయింది. అబూజ్‌మాడ్ నుంచి ఆదివాసులను తరలించడం, ఆ ప్రాంతంలోని ఖనిజ సంపదను బహుళజాతి సంస్థలకు అప్పగించడం ఈ ఆపరేషన్ హోకా ఉద్దేశం.

గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను వెనక్కి తీసుకోవాలని అంతర్జాతీయ స్థాయిలో ఒత్తిడి వస్తున్నా పట్టించుకోని ప్రభుత్వం పైగా ఇప్పుడు కొత్తగా మరోరెండు ఆపరేషన్లను ఆదివాసులపై ప్రయోగించింది. నిర్దిష్టంగా మాడ్‌ను హస్తగతం చేసుకోవడానికే ఈ తాజా ఆపరేషన్లు. ఇవి కూడా గ్రీన్‌హంట్‌లో భాగంగానే గుర్తించాలి. లేదా పేరు ఏదైనా ప్రజలపై జరుగుతున్న యుద్ధంలో భాగం. ఆ యుద్ధాన్ని ఈ మాడ్ ఆపరేషన్ చాలా తీవ్రస్థాయికి తీసుకెళ్లింది. సంఖ్యాపరంగా, దాడి స్వభావరీత్యా కూడా ఈ దాడి గ్రీన్‌హంట్ మొదలయ్యాక జరిగిన దాడుల్లో చాలా పెద్దది. అమెరికా నేరుగా మన దేశంలోని కౌంటర్

# విప్లవ సాహిత్యంపై రగల్‌జెండా కా. షంషేర్ సంస్మరణ సభ

## సాహిత్య సాంస్కృతికోద్యమంలో గ్రీన్‌హంట్ వ్యతిరేక చైతన్యంతో షంషేర్‌ను పునర్జీవింపచేసుకుందాం

29 ఏప్రిల్, 2012 సాయంత్రం 5.00 గంటలకు సుందరయ్య విజ్ఞానమందిరం, హైదరాబాద్.
'యోధ' కథా సంపుటి ఆవిష్కరణ
అధ్యక్షత: పి. వరలక్ష్మి( విరసం రాష్ట్ర కార్యదర్శి)
వక్తలు : ఆకుల భూమయ్య, అల్లం నారాయణ, పద్మకుమారి, వరవరరావు, పాణి

విప్లవ సాహిత్య పాఠకులకు షంషేర్ అనగానే ఒక పదునైన కలం గుర్తుకు వస్తుంది. విప్లవోద్యమ అనుభవాలకు ఎప్పటికప్పుడు సాహిత్య రూపం ఇచ్చే ఒక కథకుడు తలపుకొస్తాడు. ఆలోచనాపరుడైన విశ్లేషకుడు స్ఫురిస్తాడు. షంషేర్, శేషన్న పేర్లతో అరుణతారలో దశాబ్దకాలంగా రచనలు చేస్తున్న గుండేటి శంకర్ మార్చి 18న అజ్ఞాతంలో పాము కరిచి అమరుడయ్యాడు.

కరీంనగర్ జిల్లా గోదావరిఖనిలో కార్మిక కుటుంబంలో పుట్టిన శంకర్ ఆ ప్రాంతంలోని విద్యార్థి ఉద్యమాలతో ఉత్తేజం పొంది రాడికల్ విద్యార్థి సంఘంలో చేరాడు. 1983 నాటికే పూర్తికాలం కార్యకర్తగా విప్లవోద్యమంలోకి వెళ్లాడు. అజ్ఞాత నిర్మాణాల్లో అనేక స్థాయిల్లో పని చేస్తూ 1987 ఆగస్టులో అరెస్టయి 1990 దాకా వరంగల్ జెయిల్లో ఉన్నాడు. ఆ తర్వాత ఆదిలాబాద్ విప్లవోద్యమంలో, సింగరేణి కార్మికోద్యమంలో పని చేస్తూ ఉత్తర తెలంగాణ ఉద్యమానికి నాయకుడిగా ఎదిగాడు.

రాజకీయ కార్యకర్తగా రాటుదేలుగూ అపారమైన జీవితానుభవం, అవగాహన గడించిన శంకర్ సృజనాత్మక సాహిత్య కృషిని చైతన్యయుతంగా ఎంచుకున్నాడు. ప్రజా ఉద్యమ నిర్మాణానికి కళా సాహిత్యాలు ముఖ్యమైన పనిముట్లు అనే అవగాహన ఉన్న విప్లవోద్యమ సంప్రదాయానికి చెందినవాడు కావట్టి సహజంగానే రచనా రంగంలోకీ ప్రవేశించాడు. చాలా మంది ఉద్యమ రచయితల వలె శంకర్ కూడా అనేక ఉద్యమ నైపుణ్యాలను అలవర్చుకున్నట్టే తనలోని రచనాశక్తిని తీర్చిదిద్దుకున్నాడు. రచన విశ్రాంత కాలంలోని కార్యకలాపంలా కాకుండా ఉద్యమ ప్రయాణంలోని మామూలు విషయంగా ఆయన స్వీకరించాడని, బహుశా ఉద్యమ రచయితలందరికీ సాహిత్య సృజనతో ఉండే అనుబంధమే ఆయనకూ ఉన్నదని ఆయన రచనలు చదివితే అర్థమవుతుంది. అందువల్ల ఉద్యమాచరణ నుంచి అలాంటి వాళ్ల సాహిత్యాన్ని వేరు చేసి అంచనా వేయలేమనే నియమం షంషేర్‌కు కూడా వర్తిస్తుంది. ఆయన రాసిన 'యోధ' అనే పెద్ద కథ ఒక్కటిచాలు - కథకుడిగ ఆయన శక్తిని నిర్ధారించడానికి. ఆదిలాబాద్ ఆదివాసీ ఉద్యమ నేపథ్యంలో అంత విస్తృతమైన కాన్వాస్ మీద ఆ కథ రాయడం షంషేర్ లాంటివాళ్లకే

---

ఇన్‌సర్జెన్సీ కార్యకలాపాల్లో తమ ప్రత్యేక బలగాలు నేరుగా పాల్గొంటున్నాయని ఈ మధ్యే పెంటగాన్ ప్రకటించింది.

ఆపరేషన్ గ్రీన్‌హంట్ లేదా హాకాలను నిలువరించకపోతే ఈ దేశంలోని బలీయమైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట క్షేత్రాన్ని పోగొట్టుకున్నవాళ్లమవుతాం. మాడ్ ప్రాంతంలో సైన్యాన్ని వెనక్కి తీసుకోవాలని డిమాండ్ చేస్తూ నిర్వహిస్తున్న ఈ సభకు అందరికీ ఆహ్వానం.

## పుస్తకావిష్కరణలు


చింతల్‌నార్ భీభత్సకాండపై నివేదిక


మాడ్‌పై దాడుల నివేదిక



సింగనమడుగు ఘటనపై నిజనిర్ధారణ నివేదిక

విప్లవ రచయితల సంఘం



నివేదిక

# విప్లవోద్యమ 'కథా' వ్యాఖ్యాత-షంషేర్

- చంద్రయ్య

భారత విప్లవోద్యమ చరిత్రలో ఉత్తర తెలంగాణది కీలకపాత్ర. ఉత్తర తెలంగాణ ప్రాంతపు విప్లవ కేంద్రం కరీంనగర్. కరీంనగర్ జిల్లా, ఎందరో విప్లవ వీరులకు పురిటిగడ్డ, ఈ గడ్డమీది నుంచి విప్లవోద్యమంలోకి అడుగిడిన కా. కిషన్‌జీ, చంద్రన్నల వారసత్వాన్ని అందిపుచ్చుకున్నవాడు కా. షంషేర్ గుండేటి శంకర్, ఇంకా శేషన్న, మహేష్, జగన్ పేర్లతో ప్రజలకు పరిచయం.

సింగరేణి కార్మిక కుటుంబం నుంచి వచ్చిన షంషేర్, కళాశాల దశలోనే విప్లవోద్యమం పట్ల ఆకర్షితుడయ్యాడు. రాడికల్ స్టూడెంట్ యూనియన్‌లో పనిచేసి విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించాడు. తదనంతర కాలంలో అంటే 1983 నాటికి పూర్తికాలం కార్యకర్తగా విప్లవోద్యమంలోకి వెళ్ళాడు. వరంగల్ జైలు జీవితం తరువాత ఆదిలాబాద్ విప్లవోద్యమంలో, సింగరేణి కార్మికోద్యమంలో పనిచేస్తూ ఉత్తర తెలంగాణ విప్లవోద్యమానికి నాయకుడిగా, అధికార ప్రతినిధిగా పని చేశాడు. విప్లవోద్యమానికి ఎవరి అవసరం ఎంత, ఎవరిని ఏ విధంగా ఉపయోగించుకోవాలి అనే విషయాలను గుర్తెరిగి వ్యవహరించడంలో విజయం సాధించిన వ్యక్తి కా. షంషేర్.

విప్లవోద్యమంలో క్షణం తీరిక లేకుండా పనిచేస్తూ కూడా షంషేర్, శేషన్న పేర్లతో విప్లవోద్యమాన్ని సాహితీకరించేవాడు. షంషేర్ రచనలు విప్లవోద్యమానికి సాంస్కృతిక వ్యాఖ్యానాలుగా నిలిచిపోయాయి. ముఖ్యంగా షంషేర్ విప్లవ కథా సాహిత్యాన్ని పరిపుష్టం చేసాడు. రచన విశ్రాంత కాలంలోని కార్యకలాపంలా కాకుండా, ఉద్యమ ప్రయాణంలోని మామూలు విషయంగా ఆయన స్వీకరించాడని, బహుశా ఉద్యమ రచయితలందరికీ సాహిత్య సృజనతో ఉండే అనుబంధమే ఆయనకూ ఉన్నదని ఆయన రచనలు చదివితే అర్థమవుతుంది. విప్లవోద్యమ కార్యకర్తలు మాత్రమే రాయగలిగే సాహిత్యాన్ని షంషేర్ సృష్టించాడు. ఈ విప్లవోద్యమ నేపథ్యంలోనే షంషేర్ రచన, నిర్మాణ పద్ధతులను విశ్లేషించాల్సి ఉంటుంది. విప్లవ రచయితల సంఘం కా. షంషేర్‌ను ఈ కోణంలోంచి చూస్తుంది. అధ్యయనం చేస్తుంది.

ఒక చేత్తో పెన్ను మరో చేత్తో గన్ను పట్టి విప్లవ సాహిత్యాన్ని సృష్టించిన కా. షంషేర్ మార్చి 18, 2012న దండకారణ్యంలో పాము కాటుకు బలయ్యాడు. విప్లవోద్యమానికి, విప్లవ సాహిత్యానికి ఉన్న అవినాభావ సంబంధాన్ని కా. షంషేర్ అమరత్వం సందర్భంగా మరోమారు స్మరించుకోవడానికి విప్లవ రచయితల సంఘం కా. షంషేర్ సంస్మరణ సభను 29 ఏప్రిల్ 2012న సా. 6 గంటలకు సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిపింది. ఈ సంస్మరణ సభలో రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న విప్లవాభిమానులు, సానుభూతిపరులు పాల్గొని కా. షంషేర్ ఆశయాలను కొనసాగిస్తామని నినాదాలిచ్చారు.

కా. కాశీం వక్తలను, సభాధ్యక్షులను వేదిక పైకి ఆహ్వానించి, కా. షంషేర్ విప్లవ సాహిత్య కృషిని తన ప్రారంభ పలుకుల్లో గుర్తు చేశారు. కా. ఉదయ్ భాను, షంషేర్ స్మృతిలో రాసిన కవితను చదివి వినిపించాడు.

---

సాధ్యం.

ఎన్నో కథలు, కవిత్వం, విశ్లేషణ వ్యాసాలు రాసిన షంషేర్ అకాల మరణం విప్లవోద్యమానికి, విప్లవ సాహిత్యోద్యమానికి తీరని లోటు. అయితే అన్ని లోట్లను ఎప్పటికప్పుడు భర్తీ చేసుకుంటూ పురోగమిస్తున్న విప్లవోద్యమం అసంఖ్యాక షంషేర్లను తయారు చేసుకుంటుందని నమ్మవచ్చు. ఇవాళ దండకారణ్యంలో, ఆంధ్ర-ఒడిషా సరిహద్దు ప్రాంతంలో విస్తరించిన విప్లవోద్యమం ఆపరేషన్ గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా ప్రజా యుద్ధాన్ని పురోగమింప చేస్తున్నట్టే, ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను నిర్మిస్తోంది.. అతి పెద్ద ఎత్తున సాహిత్య సాంస్కృతికోద్యమాన్నీ నడుపుతోంది. యేనాన్ విముక్తి ప్రాంతంలో మావో కళలు సాహిత్యం విప్లవ సైన్యానికి, పోరాట ప్రజలకు అని చెప్పిన మాట అక్షరాలా భారత విప్లవోద్యమంలో రుజువు అవుతోంది. అంత మాత్రమే కాదు..పోరాట జీవితాన్ని, యుద్ధాన్ని, అనన్యసామాన్యమైన త్యాగాన్ని, అంతిమంగా ఒక భవిష్యత్ సుందర స్వప్నం నిజమవుతుందనే వాగ్దానాన్నీ ఉద్యమ రచయితలు బైటి రచయితలకు, పాఠకులను, ఆలోచనా జీవులకు చాటిచెప్తూ సాహిత్యం రాస్తున్నారు. విధ్వంసం, యుద్ధం, నిర్మాణాల మధ్య భారత సమాజం అనుభవిస్తున్న లోతైన సంఘర్షణ వాళ్ల సాహిత్యానికి వస్తువు, నేపథ్యం.

షంషేర్ ఆ వొరవడికి చెందిన రచయిత. సాహిత్యాన్ని క్రియాశీలం చేసిన ఘనత తెలుగులో విప్లవోద్యమానిదే. పనిలో పుట్టి తిరిగి పనిలోకి విస్తరించే సుగుణం విప్లవ సాహిత్యానికి ఉంది. కాబట్టి ఆ సాహిత్యాన్ని ఏ ప్రమాణాలతో చూడాలి? అనే ప్రశ్న ప్రమాణాల సమస్య మాత్రమే కాదు, ప్రయోజనం, దృక్పథానికి సంబంధించింది. షంషేర్ కథలు చదివితే ఈ కథలను ఏ ప్రమాణాలతో కొలవాలి? అనే ప్రశ్న తలెత్తే అవకాశం ఉంది. విప్లవ సాహిత్య విమర్శలో ఇప్పటికే ఆ దిశగా జరిగిన కృషిని విమర్శాలోకం స్వీకరించగలిగితే షంషేర్‌లాంటి వాళ్ల కథలను అర్థం చేసుకోవడం తేలికే.

ఆయన సాహిత్యాన్ని ఆవిష్కరించుకోవడమన్నా, ఆయన స్మృతికి నివాళి ప్రకటించడమన్నా ఇప్పుడున్న సామాజిక, రాజకీయ సందర్భంలో గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకించడమే. ఇది గ్రీన్‌హంట్ వ్యతిరేక సాహిత్య సమయం. ఈ స్ఫూర్తితో జరుగుతున్న షంషేర్ సంస్మరణ సభకు రమ్మని అందరికీ స్వాగతం.

**విప్లవ రచయితల సంఘం**

**అమరుల బంధుమిత్రుల సంఘం**



విప్లవ రచయితల సంఘం కార్యదర్శి కా. పి. వరలక్ష్మి ఈ సభకు అధ్యక్షత వహించారు. షంషేర్ మరణించిన సందర్భంలో 'కోబ్రా'లకు పాము వచ్చి సహకరించిందని' ఒక ఆంగ్ల పత్రిక రాయడాన్ని పేర్కొంటూ, సామ్రాజ్యవాదానికి అనుకూలంగా మీడియా వ్యవహరించడాన్ని విమర్శించారు. విప్లవోద్యమంలో పనిచేస్తున్న వివిధ సందర్భాల్లో కా. షంషేర్ రాసిన కథలను **'యోధ'** పేరుతో విరసం సంపుటీకరించింది. ఈ కథా సంపుటిని దీనితోపాటు **'మోదుగు పువ్వు'** పేరుతో షంషేర్ జీవితం, జ్ఞాపకాలు, స్మృతుల విరసం సంకలనాన్ని షంషేర్ తల్లి 'మల్లమ్మ' ఆవిష్కరించింది. తదనంతరం మావోయిస్ట్ పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు ఆనంద్ పంపిన సందేశాన్ని కా. వరలక్ష్మి చదివి వినిపించారు. ఆ సందేశంలో దుఃఖాన్ని వర్గ కసితో ఎంత ముందుకు తీసుకువెళ్తామో అంత విజయం సాధిస్తాం. శేషన్న/షంషేర్ చరిత్ర అంటే ఆదిలాబాద్ యుద్ధ చరిత్ర, ఆదిలాబాద్ యుద్ధ చరిత్ర, అంటే గెరిల్లా యుద్ధ చరిత్ర. అజేయమైన భారత ప్రజల పోరాటాల ద్వారా ప్రజలపై జరుగుతున్న యుద్ధాన్ని వ్యతిరేకించి షంషేర్‌లాంటి అమరవీరులకు జోహార్లు అర్పిద్దామని పేర్కొన్నారు.

అమరుల బంధుమిత్రుల సంఘం సభ్యురాలు కా. పద్మకుమారి, అమరులను స్మరించుకోవడమంటే పాలక వర్గాలను ధిక్కరించడమేనన్నారు. షంషేర్‌తో కలిసి విప్లవోద్యమంలో పనిచేసిన నాటి అనుభవాలను ఈ సందర్భంగా విప్లవాభిమానులతో పంచుకున్నారు. విప్లవోద్యమంలోకి అనుకున్నంత స్థాయిలో స్త్రీలు రాకపోవడాన్ని నిశితంగా పరిశీలించి, దానికి పరిష్కారాన్ని చూపించిన షంషేర్ ఆచరణను గుర్తు చేశారు. రాజ్య అణచివేత కారణంగా షంషేర్ శవాన్ని కూడా మేము ఆయన తల్లిదండ్రులకు చేర్చలేకపోయామని చెబుతూ, రాజ్యంపై పోరాడవలసిన అవసరాన్ని చెప్పారు.

20 ఫిబ్రవరి 2012న అమరుడైన సింగన్నపై, షంషేర్‌రాసిన కథతోపాటు, సింగన్న స్మృతిలో వచ్చిన సాహిత్యాన్ని విరసం సంకలనం చేసింది. **'కా. సింగన్న స్మృతిలో'** వచ్చిన పుస్తకాన్ని సింగన్న తల్లిదండ్రులు ఆవిష్కరించారు. ఇదే వేదికపై **'ఆదర్శ కమ్యూనిస్టు కామ్రేడ్ సునీతను స్మరించుకుందాం'** పుస్తకాన్ని కా. పద్మకుమారి ఆవిష్కరించారు. కా. సునీత ముప్పై అయిదు ఏళ్ళు విప్లవోద్యమంలో పనిచేసి, అనారోగ్యంతో చనిపోయిందని ఆమె కృషిని, త్యాగాన్ని సభలో గుర్తు చేశారు.

షంషేర్ రాసిన **'యోధ'** కథల సంపుటిపై విరసం కార్యవర్గ సభ్యుడు పాణి మాట్లాడారు. 'యోధ' కథలు ఉత్తర తెలంగాణ విప్లవోద్యమాన్ని సాహిత్యంగా వ్యాఖ్యానించాయన్నారు. ఆదిలాబాద్ జిల్లా విప్లవోద్యమ నిర్మాణం చరిత్రకు సంబంధించిన ఎన్నో అంశాలు షంషేర్ కథల్లో కథా వస్తువులయ్యాయన్నారు. రైతాంగ, ఆదివాసి, కార్మికోద్యమాలు తీవ్ర స్థాయిలో మారినప్పుడు ఆలంపల్లి ఆంబుష్ ప్రధాన పాత్ర పోషించింది. ఈ చరిత్రంతా షంషేర్ కథలలో వస్తువయింది. నవలికా స్థాయి కల్గిన 'యోధ' కథ-ఒక సామూహిక, ఉద్యమ నిర్మాణ క్రమంలో వచ్చే అనుభవాలు ఉంటే తప్ప మరొకరికి సాధ్యకాదంటూ, విప్లవోద్యమం, విప్లవ సాహిత్యాల అవిభాజ్య సంబంధాన్ని వివరించారు.

షంషేర్ సాధారణ ఆదివాసులకు ఉద్యమ నిర్మాణ విషయాలను ఎలా అర్థం చేయించేవాడో 'పద్మక్క' కథ చెబుతుంది. ఈ కథలో సాధారణ ఆదివాసి స్త్రీ (పద్మక్క) సభ్యురాలిగా చేరి, దళ కమాండర్‌గా ఎదిగిన విధానాన్ని షంషేర్ ఎంతో కళాత్మకంగా వర్ణించాడు. షంషేర్ కథలను సమీక్షించుకోవడమంటే దండకారణ్య సాహిత్యం గూర్చి మాట్లాడుకోవడమే అని కా. పాణి అన్నారు. దండకారణ్యంలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను, స్కూళ్ళను ప్రభుత్వం ధ్వంసం చేసింది. ఇది ఆదివాసులను స్కూళ్ళకు దూరం చేయడం, వారి ఉత్పత్తిని ధ్వంసం చేయడంగా షంషేర్ పేర్కొన్నాడు. యోధ పుస్తకాన్ని కొనడమంటే గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకించడమేనని కా. పాణి అన్నారు. అదేవిధంగా గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా మన అన్ని జీవన సందర్భాలలో స్పందించాలని పిలుపునిచ్చారు.

షంషేర్ బంధువు మాట్లాడుతూ-ఆర్ఎస్‌యు విద్యార్థులు ఇచ్చిన 'గ్రామాలకు తరలండి' కార్యక్రమంలాగానే మనం కూడా నేడు 'గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా గ్రామాలకు తరలండి' కార్యక్రమాన్ని చేపట్టాల్సి ఉందని అన్నారు.

కా. ఆకుల భూమయ్య (టిపిఎఫ్)-షంషేర్, తనకు పాముకరిచినా, ఎలుక కరిచి ఉండవచ్చనే ఉద్దేశంతో జీవితాన్ని నిర్లక్ష్యం చేయడాన్ని గుర్తు చేస్తూ-విప్లవకారులు తమ జీవితం విషయంలో ఎలాంటి నిర్లక్ష్యాన్ని ప్రదర్శించకూడదనీ, విప్లవకారుని మరణం వ్యక్తిగతం కాదనీ షంషేర్ అమరత్వాన్ని గుర్తు చేశారు. ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణను కాక్షించి జగన్ పేరుతో షంషేర్ అనేక వ్యాసాలను రచించాడు. అనేక అధికారిక ప్రకటనలను చేసాడు. 1998 నుండి తెలంగాణ ఉద్యమానికి దిశానిర్దేశాన్ని అందించాడని చెబుతూ షంషేర్‌కు, తెలంగాణ గడ్డకు గల ఆత్మీయతానుభూతులను గుర్తు చేశారు.

ఉత్తర తెలంగాణోద్యమం వెనుకపట్టు పడుతున్న సందర్భంలో షంషేర్ లోటు పూడ్చలేనిది అంటూ, షంషేర్ ఉత్తర తెలంగాణ బాధ్యతలను నిర్వర్తించిన తీరును కా. వరవరరావు పేర్కొన్నారు. తీవ్ర నిర్బంధాన్ని అమలు చేసిన ఎన్.టి.ఆర్. కాలంలో, ఆ నిర్బంధానికి ఎదురొడ్డి విప్లవ, ఆదివాసి, రైతాంగ పోరాటాలకు వెన్నుదన్నుగా నిలిచినవాడు షంషేర్ అంటూ ఆయన పోరాట పటిమను, విప్లవ నిబద్ధతను ప్రస్తావించారు. మనం కాంగ్రెస్ ప్రభుత్వంతో పోరాడుతూనే, తెలంగాణ సందర్భంలో ఆర్ఎస్ఎస్‌తో పాటు అలాయ్ బలాయ్ తీసుకుంటున్నాం. ఆర్ఎస్ఎస్ గుండాలు విప్లవకారులను ఎట్లా చంపారో ఒక్కసారి గుర్తు చేసుకోండని తెలంగాణ ప్రజలను, విద్యార్థులను, మేధావులను ఉద్దేశించి కా. వరవరరావు అన్నారు.

గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా తెలుగులో సాహిత్య సృజన జరగకపోవడాన్ని కా. వరవరరావు ఎత్తి చూపారు. ఇట్లాంటి ధోరణిని సాహిత్యకారులు మునుపెన్నడూ ప్రదర్శించలేదన్నారు. గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకించడం, హిందూమతోన్మాదులపై పోరాడడం - ఈ రెండంశాలపై షంషేర్ పోరాడి అమరుడయ్యాడన్నారు.

చత్తీస్‌ఘడ్ రాష్ట్రానికి చెందిన కలెక్టర్ 'అలెక్స్'ను మావోయిస్టులు నిర్బంధించినప్పుడు 'కిడ్నాప్'గా రాజ్యం, మీడియా చిత్రిస్తాయి. ఈ 'కిడ్నాప్' అనే పదాన్ని అమాయక ఆదివాసులను ప్రభుత్వం మాయం చేసినపుడు వాడరని అన్నారు. అలెక్స్ విషయంలో ప్రభుత్వం, రకరకాల మానవీయ దృష్టికోణాలను వ్యక్తం చేస్తూ విడిచిపెట్టమంటూ కోరింది. మరి వందలాది మంది ఆదివాసుల పరిస్థితి ఏమిటి? అని కా.వరవరరావు ఈ సందర్భంగా రాజ్యాన్ని ప్రశ్నించారు. విప్లవ దృక్పథం లేకుండా మానవతా దృక్పథం లేదు. విప్లవ ప్రజాస్వామ్యం లేకుండా ప్రజాస్వామ్యం లేదు అని చెబుతూ తన ప్రసంగాన్ని ముగించారు.



కరపత్రం



## చిరుగాలి సితారా సంగీతాన్ని ఆవాహన చేసుకుందాం

# శివసాగర్ సంస్మరణ సభ

**11 మే 2012 శుక్రవారం సాయంకాలం 6 గంటలకు, ప్రెస్‌క్లబ్, బషీర్‌బాగ్, హైదారాబాద్,**
**అధ్యక్షత : కాశీం, వక్తలు : సతీష్ చందర్, విమల, వి. చెంచయ్య, కళ్యాణరావు, వరవరరావు**
**ప్రజాకళామండలి కళాకారులు పాటలు పాడుతారు.**

'కసితో స్వార్థం శిరస్సు గండ్రగొడ్డలితో
నరకగల్గిన వాడే నేటి హీరో'
'ప్రజల గుండెల కొండల్లో మాటుకాసి
ట్రిగ్గర్ నొక్కగలిగిన వాడే ద్రష్ట
ప్రజలను సాయుధం చేస్తున్న
రివల్యూషనరీ నేడు కవి'

-శివసాగర్

ఆయన కవిత్వం ఒక కాలానికి ప్రతినిధి. ఆ కాలమే ఆయనలో కవిత్వమై పలికింది. అత్యంత కల్లోలభరితమైన ఆ ఉద్వేగపు చరిత్రలోని కీలకదశలను ఆయన కవిత్వం చేశారు. శ్రీకాకుళ అడవుల నుంచి సాయుధ సందేశమూ, కవితా గానమూ వినిపిస్తున్న రోజుల్లో శివసాగర్ ప్రజలను సాయుధం చేస్తున్న రివల్యూషనరీ నేటి కవి.... అని విప్లవంలోకీ, విప్లవ కవిత్వంలోకీ వచ్చారు.

తెలుగు నేల మీద విప్లవోద్యమం ఎక్కడెక్కడ ఎట్లా చిగురించి, విస్తరించి, సంఘర్షించి పురోగమించిందో ఆ అడుగు జాడల్లోని స్థల కాల నిర్దిష్టత ఆయన కవిత్వ సొంతం. రాజకీయ సంవాదంలోంచి విప్లవ వైఖరిని ప్రతిబింబిస్తూ ఆయన ప్రతి కవితా భవిష్యదాశను, పోరాట ఉత్తేజాన్ని వ్యక్తం చేస్తుంది. అందుకే ఆ చరిత్రలోకి తొంగి చూసినప్పుడల్లా శివసాగర్ కవితా చరణాలు విప్లవ కాల్పనిక ఉద్వేగానికి లోను చేస్తాయి.

నక్సల్బరీ తెలుగు సాహిత్యంలో విప్లవ బాటను నిర్మిస్తున్న తొలి రోజుల్లో కవిగా ఆయన ఆ మార్గాన్ని విశాలం చేశారు. విప్లవోద్యమ నేతగా, కవిగా శివసాగర్ విరసం ఆవిర్భావానికి నేపథ్యంలో కెవిఆర్‌తో కలిసి కృషి చేయడమేగాక, 1980ల మధ్య కాలం దాకా మార్గదర్శకత్వం వహించారు. ఆ కాలంలోని విప్లవ సాహిత్య సాంస్కృతికోద్యమంలో ఆయన కవిత్వం, కృషి ప్రధానమైన భాగం. మార్చ్, ఝంఝ కవితా సంకలనాల్లో ప్రభుత్వం నిషేధించిన ఆయన నాలుగు కవితలను విరసం పుస్తక రూపంలో తీసుకొని వచ్చి గుంటూరు మహాసభల్లో పంచి పెట్టింది. వాటిని ఇంగ్లిషులోకి అనువదించి నిషేధాన్ని ధిక్కరిస్తూ దేశవ్యాప్తంగా ప్రచారం చేసింది. రాజ్యం బహిష్కరించి, నిషేధించిన కవిని విరసం సొంతం చేసుకున్నది. ప్రజలను సాయుధం చేయగల ఆయన కవిత్వం విప్లవ రచయితల సంఘానికి చిరస్మరణీయం.

తెలుగు నేలలో విప్లవంలోకి ప్రవేశించిన రివిజనిజానికి ప్రత్యామ్నాయంగా చారుమజుందార్ మార్గాన్ని ఎత్తిపట్టిన వారిలో సత్యమూర్తి అగ్రజుడు. సాయుధ రైతాంగ పోరాటానికి విత్తనాలు చల్లిన నాయకులలో ఆయన ఒకరు. పీపుల్స్‌వార్ పార్టీ నిర్మాణంలో భాగమైయ్యారు. కొన్నాళ్ళు ఆ పార్టీకి నాయకుడుగా పనిచేసారు. ఆయన కార్యకర్త. నాయకుడు. కవి. ఉపన్యాసకుడు. సిద్ధాంతకర్త. అన్నీ కలిసిన విప్లవ బహుముఖ ప్రజ్ఞాశాలి.

విప్లవోద్యమం ఆర్థికవాదానికి గురైందనే ప్రధాన విమర్శతో ఆయన విప్లవపార్టీకి దూరమయ్యారు. బైటికి వచ్చాక దళితసమస్యను కేంద్రం చేసుకొని అనేక ప్రతిపాదనలు, ప్రయోగాలు చేశారు. వాటి సాఫల్య వైఫల్యాల సంగతి ఎలా ఉన్నా ఈ కాలమంతా వర్గం, కులం.. వాటి మధ్య సంబంధాలపై భిన్న వైఖరులు తీసుకున్నారు. కొన్ని సంస్థలు స్థాపించి, మరి కొన్నిటికి చేరువై అప్పటికి తానేర్పచుకున్న అవగాహనతో పనిచేస్తూ వచ్చారు. అందులో సైద్ధాంతిక స్థిరత్వం లేకపోవడంతో ఆయన వైఖరులతో ఏకీభవించడం కష్టమే. అయినా బుద్ధిజీవిగా ఆయన ఆలోచనల్లో మార్క్సిస్టు ధోరణి వ్యక్తమవుతూ ఉండేది. చాలా లోతుగా, విమర్శనాత్మకంగా అంచనా వేయాల్సిన గంభీరమైన విషయం ఇది.

అజ్ఞాతంలో ఉన్నప్పుడు విరసం ఆయనకు గౌరవ సభ్యత్వం ఇచ్చింది. అందువల్ల ఆయన విప్లవపార్టీ నుంచి బైటికివచ్చాక విరసంలో కూడా ఆయన చర్చనీయాంశమయ్యారు. ఆర్థికవాదానికి గురైందని ఆయన విమర్శించిన విప్లవోద్యమమే ఇవాళ ప్రత్యామ్నాయ సామాజిక, రాజకీయార్థిక, సాంస్కృతిక వ్యవస్థలను నిర్మిస్తున్నది. దండకారణ్యంలో విప్లవ జనతన సర్కార్‌ను స్థాపించింది. విరసం మరణించిందని ఆయన చెప్పాకే రెండు దశాబ్దాలకు పైగా వైవిధ్యమైన సాహిత్య సృజనతో, గాఢమైన సైద్ధాంతిక కృషితో, కొత్త గొంతులతో నిషేధ నిర్బంధాల మధ్య విప్లవోద్యమంలో భాగంగా కొనసాగుతోంది. కాబట్టి ఆయన విప్లవోద్యమం గురించి, విరసం గురించి, దళిత బహుజన విముక్తి గురించి చేసిన సూత్రీకరణలన్నీ వర్తమాన చరిత్రలో భాగంగా చర్చించాల్సినవే.

అయినా ఆయన విప్లవభావావేశంతో జీవన వాస్తవంలో నుంచి ఒక తోటరాముడ్ని, మరొక చెల్లి చంద్రమ్మను చరిత్ర నిర్మాతలుగా కవిత్వంలోకి అద్భుతంగా తీసుకొని వచ్చారు. రాజకీయాలను ఉన్నత ప్రమాణాలతో కవిత్వం చేయడం, పోరాటాన్ని యావత్ జీవితంలో భాగం చేస్తూ పాటలల్లడం ఆయన విశిష్టత. నర్రెంక సెట్టు కింద నరుడో భాస్కరుడా.. పాటతో ఆయన విప్లవ సాహిత్యోద్యమ గానానికి పల్లవిని అందించారు. విప్లవ కవిత్వాన్ని స్వరపరిచిన మేటి కవిగా ఆయన ప్రభావం మూడు తరాల మీద ప్రసరిస్తూనే ఉంది. బ్రాహ్మణీయ కల్పనలో తలకిందులైపోయిన ఏకలవ్యుడ్ని, శంభూకుడ్ని ధిక్కార ప్రతీకలుగా తీర్చిదిద్దారు. విప్లవ, దళిత కవిత్వాలపై ఆయన ముద్ర చెరిగిపోనిది. విరసం దాన్ని ఎత్తిపడుతూ ఆయనను స్మరించుకుంటూ ఈ సభ తలపెట్టింది. అందరికీ ఆహ్వానం.

*నర్రెంక సెట్టు కింద నరుడో! భాస్కరుడా!*
*బందూకు పట్టివయ్య నరుడో! భాస్కరుడా!*
*బందూకు సేతబట్టి నరుడో! భాస్కరుడా!*
*బంధాలు తెంచివయ్య నరుడో! భాస్కరుడా!*

*నర్రెంక సెట్టు కింద నరుడో! భాస్కరుడా!*
*బందూకు పట్టాము నరుడో! భాస్కరుడా!*
*బందూకు సేతబట్టి నరుడో! భాస్కరుడా!*
*బంధాలు తెంచాము నరుడో! భాస్కరుడా!*

-శివసాగర్

**5 మే, 2012** **విప్లవ రచయితల సంఘం**



# -: స్వీకారం :-

| | | |
|---|---|---|
| వివేచన<br>(సాహిత్య వ్యాసాలు)<br>రచయిత :<br>వి. చెంచయ్య<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 50/-<br>పేజీలు : 128 | పరామర్శ<br>(సాహిత్య వ్యాసాలు)<br>రచయిత :<br>నల్లూరి రుక్మిణి<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 80/-<br>పేజీలు : 176 | ప్రజలపై యుద్ధం<br>(ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక వ్యాసాలు)<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 125/-<br>పేజీలు : 240 |
| గుమ్మెట మోత<br>రచయిత :<br>పాణి<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 100/-<br>పేజీలు : 190 | యోధ<br>షంషేర్ కథలు<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 50/-<br>పేజీలు : 182 | బలహీనుడి బలం<br>కామ్రేడ్ పటేల్ సుధాకర్ రచనలు<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 25/-<br>పేజీలు : 90 |
| జంగిడి<br>మార్క వెంకట్రాములు కథలు<br>ప్రచురణ :<br>పాలమూరు ప్రచురణలు<br>వెల : రు. 50/-<br>పేజీలు : 60 | కఫన్<br>ఇక్బాల్ కథలు<br>ప్రచురణ :<br>పాలమూరు ప్రచురణలు<br>వెల : రు. 60/-<br>పేజీలు : 86 | విముక్తిబాటలో<br>'నారాయణపట్నా'<br>రచయిత :<br>బి.డి. దమయంతి<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 60/-<br>పేజీలు : 124 |
| విప్లవ పథంలో వరంగల్ విద్యార్థి ఉద్యమం<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 40/-<br>పేజీలు : 118 | ఆంధ్రప్రదేశ్ రాడికల్ విద్యార్థి సంఘం<br>**1974-92**<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 50/-<br>పేజీలు : 154 | జంగల్‌నామా<br>(మావోయిస్ట్ గెరిల్లాజోన్‌లో అనుభవాలు)<br>రచయిత :<br>సత్నామ్<br>ప్రచురణ :<br>మలుపు బుక్స్<br>వెల : రు. 90/-<br>పేజీలు : 166 |
| కా. కిషన్‌జీ, సహచర అమరుల స్మృతిలో<br>జగిత్యాల జంగల్‌మహల్<br>(విప్లవోద్యమ చారిత్రక రచనలు 1)<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 75/-<br>పేజీలు : 168 | కా. కిషన్‌జీ, సహచర అమరుల స్మృతిలో<br>జగిత్యాల జంగల్‌మహల్<br>(విప్లవోద్యమ చారిత్రక రచనలు 2)<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 100/-<br>పేజీలు : 214 | లాంగ్‌మార్చ్<br>(జగిత్యాల టు జంగల్‌మహల్)<br>ప్రచురణ :<br>తెలంగాణ జర్నలిస్టులు<br>వెల : రు. 100/-<br>పేజీలు : 206 |

**ARUNATARA** A Literary and Cultural Telugu Monthly Journal of Revolutionary Wr... (VIRASAM)

• RNI Regn.No.21152/72 • Published on 25/06/2012 291 - Mar - Apr, 2012






## గ్రీన్‌హంట్‌కు వ్యతిరేకంగా

# విరసం ౨౩వ రాష్ట్ర మహాసభలు










Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Nagendra Printing Press, Vijayawada - 520 002,
Editor : Chalasani Prasad



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M159 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |